# భారతి

[సచిత్ర మాసపత్రిక]

సంపాదకుడు:

శివలెంక శంభుప్రసాద్



ఆంధ్రపత్రికా ముద్రాలయము
మదరాసు.

సంపుటము 29 డిసెంబరు, 1952 సంచిక 12

ప్రతి వెల ఒకరూపాయి.

త్వరపడండి! త్వరపడండి!!

సిద్ధముగనున్నది.

# డాన్ క్విక్సోట్

(Don Quixote)



మూలం.

సెరివాన్టెజ్

ఆంధ్ర గ్రంథ మాల

వెల. రూ. 2/-



# విషయానుక్రమణిక

## డిసెంబరు - 1952



త్రివర్ణ చిత్రము : "చెట్లమధ్య-చక్రకట్టా"—రణవీర్ శాక్సేనా.

సాధారణ చిత్రము : పార్వతి తపస్సు—ఇరుకుల కుమారిలస్వామిగారు.

# భారతి, ఇరువది తొమ్మిదవ సంపుటము

(1952 : జూలై-డిసెంబరు)

## అకారాది విషయసూచిక



పార్వతి తపస్సు

చిత్రకారుడు : శ్రీ ఇరుకుల కుమారిలస్వామి




నందన
మార్గశీర్షము

# భారతి

సంపుటము 29
సంచిక 12


# కైలాసము




శ్రీ బొడ్డు బాపిరాజు


[ఎల్లోరా ఒక మహా శిల్ప కావ్య మన్నచో, సర్వ ప్రపంచ దృష్టి నాహరించుకున్న కళా నిక్షేపము కైలాస నాథ మందిర మందొక రసవద్ఘట్టము. అందునా శతాబ్దాలుగా నసి చెడిన అందాలతో కళా ప్రియుల నానందపెట్టు శిల్ప విన్యాసము కైలాసము,(రావణ గర్వ భంగము), ప్రసాద మధుర శ్లోకమువలె సహృదయహృదయ శాయి. తద్రమణీయ సందర్శన స్మృతి స్పందనమే యీరచన]

“ప్రాలేయ శైల కన్యక
బాలేందు కళా వతంసు వైలాసము; ను
ద్దోలాం దోళిత మగున
కైలాసము తెరగు చూచి కనలుచు పతితో

స్వామీ! స్వామి దయాను విద్ధ వరగర్వాంధుండు పౌలస్త్యుడున్
సామంతమ్మ్మున వెండి కొండ పెకలించన్ సిద్ధమైనాడు; తా
మేమో సుంతయు చిత్తగించినటు లేనే లేదు! క్రీగంట కే
ళీ మంద స్మితరేఖ దక్క నొక పల్కే పల్కరేలా ప్రభూ?

సాల ప్రాంశు పటిష్ఠ వింశతి భుజస్తంభమ్ములన్ హుంకృతిన్
కైలాసమ్మును దాకి యొడ్డరపుచున్నన్ మిమ్ము కాదన్న య

క్లేలా చూచెద రంత వేడుకయుటే మృత్యుంజయా? ఊగు ప్రా
ణాలం గుప్పెటలోన బట్టుకొనియున్నా రెల్ల తత్రత్యులున్.

ప్రాతర్భాను కరావలగ్నము సితాభ్రం బట్టు, వైరావతో
త్తాత క్రీడల కల్పవల్లిక వలెం గైలాస ముద్రాగి, త
ద్రైతే యాధిపు బాహు బంధనమునం దల్లాడ మీ యా యుపే
తా తాత్పర్యము లంతుపట్టవు మహేశా! లెమ్ము మాకోసమై!

ముమ్మొన వాలు వంగినదొ, మూడవ కన్నున మంట లారెనో!
బమ్మెర వోయెనో అజగవంబు, పరశ్వధ ముక్కు చెడ్డదో!
కిమ్మన రేల?—మా ప్రభుల కింకను భక్త సమాదరాభిమా
నమ్ములు చావకున్న వవునా తమ కొంపకె సీల్లు తోడినన్!

తపముల్ సేయగవారు ఘోరముగ, ప్రత్యక్షమ్ములై స్వాములుం
గృప నందించిరి కోరు కొన్న వరముల్ కీడైన మేలైననున్
చపలాత్ముల్ సరిపుచ్చ రంతట, నెదో సాగున్ జగత్ క్షోభ; మా
యుప చారంబది మీకె వచ్చెనిపుడో హో! స్వామి యదృష్టముల్!

శిరము ల్తొమ్మిది; రెండు దక్క కరముల్ చెండాడి హోమాగ్నిలో
హారు ప్రీత్యర్థము వ్రేల్చె నీ పరమ భక్తాగ్రేసరుం—డిప్పుడో
పరగర్వోద్ధతుడై తెగించె; భళిరా వాల్లభ్య మీ పొంగులన్
త్వరలో తేలిచి పాదుకొల్పు మిక మా ధైర్యం—బహార్యంబునున్

పలికె నపశ్రుతిన్ నులికి పడ్డ మృదంగము, భావితాంగ సం
చలనము భంగమై యడుగు జారెను నర్తన కేళి; వీడనో
జ్వల కర కంకణోదితరవం బడగెన్; పరిచారికా జన
మ్ములు నిట నిల్వలేరు నెటు పోవను పోవగలేరు శంకరా!

పావులు గళ్లు తప్పినని, పచ్చివి పంటకువచ్చె, పంటలో
వీవలకెక్క, పందెమిక వేయుట యెట్లు మహానుభావ! ఈ
కావలు డింత చేసియును కాచెను మీ మరియాద; కానిచో
దేవర యోడి రెప్పుడో!—అదే యభిమానమొ మాన ముద్రకున్?

చెదరి కపర్దమ్ము చిందిన మినువాక
వెల్లి నూగాడె జాబిల్లి మొలక
ఒరిగి బాల శశాంకు డోరసిన నెన్నొసల్
కలచె వీబూది ముక్కంటి కోన

ఊఁగి పుక్కిలపేరు లొత్తిన ఫణిరాజు
  తల్ల డాగ కటిబంధగళిత కృత్తి
జెడసి త్రిశూలమ్ము బడి పదాంగదముతో
  దుసికిలిపోయె పాదూపహమ్ము
  పటు భుజాక్రమ క్రమ పరివర్ధమాన
  ధూతకైలాస గిరి సమాందోళనములు
  ప్రభుల కుయ్యాల జంపాల లౌనుగాక!
  నిమిష నిమిషమ్ము ప్రాణగొడ్డములు మాకు

నెత్తిన చెయ్యి వెట్టుటకె నెంచె నొకం, డొకఁడేమొ వాకిటన్
బత్తెపు కూటికిన్ నిలిపినా; డిక వీడిపుడున్న యిల్లెపై
కెత్తగ చూచెలే! దొరికి రెక్కడ భక్తుల పేరితో మహా
పత్తులు వీరు?—దిద్దెదరు స్వామికి చక్కఁగ పంగ నామముల్!

ధరణీధ్రం బటులుండ, పట్టి ప్రభు పాదాంగుష్ఠముం ద్రోయఁగా
తరమే లోకములెల్ల వచ్చినను? ఈతం డొక్క లెక్కా మహే
శ్వర! విశ్రాంత మనో వినోద సరణిన్ సర్వజ్ఞుతా మీర లీ
వర కియ్యాటలు సాగ నిచ్చుటలె దేవా! కండ్లు పైకెక్కవే?

"ఎల్ల జగమ్ము కుక్షి సవరించిన యాద్యు డనంత మూర్తి గా
సిల్లున టీ పదిం బదియు చేతుల మొల్చిన!" నంచు నాకు నుం
దెల్లమె కాని, గోటికొన తీరెడి దానికి నేల గొడ్డలిన్
దెల్లగ జేయ నో త్రిజగదీశ్వర? ఓ హుతభుగ్విలోచనా!"

అని యుత్క్రోశముతోడ హైమవతి వ్యాఖ్యానించు చున్నంత, త
ద్దను జాఢీశ విధూత శైలచల నోత్కంపమ్మునన్ తూలె శం
భుని వక్షస్థలి;—న య్యయాచిత సమాభుక్త స్వయంగ్రాహ సం
జని తోత్సాహి శివుండు హత్తుకొనియెన్ శర్వాణి, హస్తావృతిన్

తొణకిన మిన్నేటి నణచి కపర్దమ్ము
  ప్రిదులక నెలవంక కుదురుచేసి
కలగిన ఫణిహారముల తీర్చి గజచేల
  మున ప్రేలు కటి బంధమును బిగించి
ఎడయు పినాకమ్ము నొడిసి చేదు బుడక్క
  మొరయ చిచ్చర కంటి మెరుపు లార్చి
తలకిన పరి జనమ్ముల జీరి యభయమ్ము
  పలికి మోవిని నవ్వుటలలు పొదివి

అంకమున శైల బాల నిశ్శంక నిలిపి
యేలు కొనుచును నిండు పేరోలగమ్ము
విశ్వ విభుడంత నలవోక వెండి కొండ
కొనల నొత్తె నల్లన పదాంగుష్ఠ రేఖ

అప్పాటున బడు కొండం
దెప్పున దెమలింప గాక తెగి పెడ మొగమై
కుప్పన గూరగ దనుజుని
యప్పుడియుం బడి కరమ్ము లడుగున జిక్కెన్

అదిరి పడి లేచి యాడల
గదిరిచి హుమ్మంచు కొండ గదలించు పదే
చెదరిన బలమ్ము బ్రోవిడి;
ఎదిరిని తన్నెరుగలేని హీను డసురుడున్

జలరుహామాలికన్ మదగజమ్ము పదమ్మున ద్రొక్కిపట్టి న
ట్టుల తన చేతు లిర్వది కఠోర గిరీశ్వర భార సంభృతిన్
నలుగగ చొక్కమేదియు, తనంతన బోనున బడ్డ సింగ మ
ట్లలుగును బొబ్బరించు ససమర్థ భుజాబల కోపదగ్ధుడై

గరువము నీరుగారి పది కన్గవలం బొగరెల్ల జారి దు
ర్భరమగు బాధ నోర్చుకొనరాక యొకే మొరవెట్టు దిగ్దిగం
తరములు నుచ్చిపోవగ;—వ్యథా పరిఖిన్నత కన్నుతెచ్చు న
త్తరికిని గాని గుర్తునకు దట్టడహో! గిరిశుండు వానికిన్

'శంభో!' యంచు దశాస్యముల్ యుగపదుచ్ఛ స్వానముం జేయ, గం
గ్గం భీరోజ్జ్వల దీర్ఘ నాదము దిశాంత వ్యాప్తమైతోన నా
రంభించుం బ్రతి శబ్దరూపమున శైలాంతర్గుహోద్గీర్ణ సం
రంభశ్రీల; సమస్త వాయుపథముల్ బల్కుం దదోంకారమే.

శివ పదాబ్జాతములు మనస్సీము నిలిపి
అఖిల యోగీంద్ర దుర్లభమైన నిష్ఠ
నెనసె రావణుడంత; నింకెంతలోన
కరగు కైలాసమును తదీశ్వరుడు కూడ!

---

# బెంగుళూరునిర్మాత పెదకెంపరాయఁడు
## 'గంగాగౌరివిలాసము'



శ్రీ నిడుదవోలు వెంకటరావు

నేఁడు మైసూరి ప్రాంతమున, బెంగుళూరిని కట్టించిన "పెదకెంపగౌడు" పేరు వినని వారరుదని చెప్పవచ్చును. ఈతని నిజనామము పెద్ద కెంపరాయఁడు. కన్నడమున హిరియ కంపరాయఁడు. గౌడు అనునది యీ వంశీయుల కందఱకును నొక నాయకపదమును సూచించు బిరుదము. పెదకెంప రాయని పూర్వులు తెలుగువారు. కాంచీపుర ప్రాంతములనుండి మైసూరి రాజ్యముననున్న 'అవటి' యను గ్రామమునకు వచ్చి, యచ్చటనుండి, బెంగుళూరి కుత్తర దిశ మైళ్ళదూరముననున్న ఎలహంక అను ప్రాంతమున స్థిరపడిరి. అప్పటికి విజయనగర సామ్రాజ్య మేర్పడుటచే, నా ప్రభువులవలన నాడగౌడికమును పొందిరి. అందుచేత నీ వంశీయులకు 'గౌడ' యను పదమును, ఎలహంక ప్రభువులను పదములును నియతముగా నుండ జొచ్చినవి.

వీరిలో క్రీ. శ. 1418 నుండి 1433 వఱకును ఎలహంకను పాలించిన జయగౌడయను నాతఁడు ప్రసిద్ధుఁడు. అతని కొమారుఁడు 'గిద్దగౌడ' గిద్దగౌడునకు పిల్లలు లేకపోవుటచేత, తమ యిలువేల్పగు [1]కెంపమ్మ నారాధించి, యొక కుమారుని గని యాతని కాదేవత పేరుతో 'కెంపనంజగౌడ' అని పేరుపెట్టెను. ఆ నాటినుండి 'కెంప' అను పేరే యా వంశీయులందఱకిని గలదు. కెంపనంజగౌడ, తన తండ్రి వెనుక క్రీ. శ. 1443 నుండి క్రీ. శ. 1513 వఱకును తన సంస్థానమును పాలించెను.

ఈ కెంపనంజగౌడ కుమారుఁడే పెదకెంపగౌడ. ఈతఁడు క్రీ. శ. 1513 నుండి 1569 వఱకు నేబదియారేం డ్లవిచ్ఛిన్నముగా రాజ్యము పాలించినవాఁడు. ఈతఁడు కృష్ణదేవరాయలచేతను, నచ్యుతదేవరాయనిచేతను మన్ననలను పొందినాఁడు. ఈతఁడే క్రీ. శ. 1537 బెంగుళూరు పట్టణమును నిర్మాణము చేసియున్నాఁడు. ఈతఁడే గంగాగౌరీవిలాస కృతికర్త.

బెంగుళూరు పట్టణము కట్టబడుటకు పూర్వమీ ప్రాంతమునకు 'శివసముద్రము' అని పేరు. తన



రాజ్యము విస్తరించిన తరువాత రాజధానికొఱకై, శివసముద్ర గ్రామమునుండి బయలుదేరి, స్థలములు పరీక్షించుచుండఁగా పది మైళ్లువెళ్లిన వెనుక నొక స్థలమున నొకకుందేలు తనకుక్కను వడ్డగించుటచూచి, అదియే రాజధానికి తగిన స్థలమని యెంచి, కోటను నిర్మించెను. ఈ కోటకు నాలుగు బురుజులు కలవు. నాలుగు బురుజులు కోట పూర్తిరైయే, సింహద్వారము కట్ట ప్రారంభింపగా, నది సాయంకాలమువఱకు

---

1. 'కెంపమ్మ' అనగా తెనుగులో 'ఎల్లమ్మ' అను దేవత.

నిలిచియుండి, తెల్లవారినతోడనే పడిపోవుచుండెడిది. ఇట్లెన్నియో దినములు జరుగగా, కంపరాయఁడు నిరుత్సాహుఁడై యుండగా, నొకనాఁడు, స్వప్నములో నాతనికి నరబలియిచ్చిన నిలుచునని యొక మహనీయుడు చెప్పెను. కంపరాయఁడీ వృత్తాంతము తనవారితో తెలుపగా, నాతని కోడలు "లక్ష్మమ్మ" అను నామె తానుబలి యగుదునని చెప్పెనట. కాని కంపరాయ డందుల కంగీకరింపలేదు. తుద కామెయే, ఎవ్వరికి తెలియకుండ, సింహద్వారమువద్దకు బోయి, కంఠము నత్తరించుకొని, యా రక్తముచే నా ద్వారమును తడిపివైచినది. మఱునాఁడు సింహద్వారము నిలిచినది. కంపరాయ డామెకు బెంగుళూరుకు తూర్పున కోరమంగలమను చోట దేవాలయమును కట్టించెను. అందు నేటికి నీమెపూజల నందుచున్నది.

తెనుగున 'లక్ష్మమ్మ కథ' యని యొక పాట ప్రచారములో నున్నది. అది ముద్రితమైనది. దానిని చూడగా నందు పేర్కొనబడిన లక్ష్మమ్మ, చిరుమామిళ్లవారి యాఁడుబడుచని కలదు. కావున నీ లక్ష్మమ్మ కాదు.

ఈతఁడు బెంగుళూరు పట్టణము కట్టించి దాని నభివృద్ధిపఱచుటయే గాక, అనేక దేవాలయములను నగ్రహారములను కట్టించినవాఁడు. గనిపురమున గంగాధరేశ్వరాలయము కట్టించినాఁడు, అందొక పెద్ద చెఱువు త్రవ్వించినాఁడు దానికి తనకులదేవతయగు కెంపమ్మపేర "కెంపాంబుధి" అని పేరు పెట్టినాఁడు. నేటి బసవనగుడియందలి బసవేశ్వరుని ప్రతిష్ఠించి యా గుడి కట్టించిన బసవభక్తుఁడు కంపరాయఁడే. ఆ గుడిచుట్టునున్న దొడ్డ విఘ్నేశ్వర, నందీశ్వర, ఆంజనేయ, మల్లికార్జున దేవాలయములన్నియు నీతడే కట్టించెను. అన్నింటికన్న ముఖ్యముగా పేర్కొన దగినది హల్సూరునందలి సోమేశ్వరాలయము.

హల్సూరునందలి దేవాలయ నిర్మాణముగూర్చిన కథ గలదు. అచ్చట నున్న సోమేశ్వరస్వామి కంపరాయనికి కలలో కనబడి, యొక స్థలము త్రవ్వినచో నక్కడ నధిక సంఖ్యాకమైన ద్రవ్యము లభించు ననియు దానితో నొక దేవాలయము కట్టింపు మనియుఁ జెప్పెను. తెల్లవాఱినతోడనె యచ్చట త్రవ్వింపఁగా, త్రవ్వ తండములుగా ధనమును, నొక లింగమును కాన్పించెను. ఆ ధనముతోడ నా దేవాలయమును కట్టించి, అందు సోమేశ్వరస్వామిని ప్రతిష్ఠించి కెంపరాయఁడాతని సేవించుచుండెను.

ఈ సోమేశ్వరునికే కంపరాయఁడు తన1 గంగాగౌరీ విలాసయక్షగానము కృతి నిచ్చెను. గ్రంథాదిని.

"శ్రీ గౌరీపతి చంద్రశేఖర సతీ
చిత్తాబ్జరోలంబ ప
న్నాగాధీశ్వరహార మార మథనా
నాకేశసంసేవితా
యోగీంద్రార్చిత పాదపద్మ యుగళా
యోషామ యార్ధాంగ...
హిరియ కెంప నృపతిన్ రక్షించు సోమేశ్వరా!"

"సుకవులకు సారమై బహు
కుకవులకెద శూలమై యకుంఠితధారై
చకిత చకిత వాద్యములై
వికసించును పెద్ద కెంప విభుసత్కవితల్!"

"గంగా గౌరి విలాసము
సంగతి పదపద్యములకు సరసతమీఱన్
రంగద్వ్యాఖ్యానములు చెల
గంగా పెద కెంపరాయ ఘనుఁడొనరించున్"

"తన ప్రాణేశుని వెదకుచు
వనితామణి గంగవచ్చు వైఖరియేలా
గన నెల్లవాఁడు నేఁడన
గనుగొనవలె సకలజనులు కాంక్షరహింపన్"

ఈ యక్షగానము పూర్తిగ లభింపలేదు. గ్రంథాంతమున నీ కంద పద్యమున్నది.

"అంగజుకేళిని మది యు
ప్పొంగగ రతి నేలి సోలి బోఁటిరహిల్లన్
బంగారు గిండిబట్టుక
ముంగిటికిని నడలె చాల మురిపెంబలరన్"

ఇందలి కవితారచన తెలుపుటకు రెండు పద్యములను రెండు పదములను నిందుదాహరించుచున్నాను.

"ఏనుమోములవాఁడు యిగురుపాయమువాఁడు
నెలబాసికమువాఁడు వలపుకాఁడు
చిలువ సొమ్ములవాఁడు తెలిమేను గలవాఁడు
నీలకంఠమువాఁడు నీటుకాఁడు
వేడికన్నులవాఁడు లేడిఁబట్టినవాఁడు
జగము లేలెడువాడు జాలకాఁడు
జడలుమోసినవాఁడు వెడవిల్తు పగవాఁడు
చుట్టాలుగలవాఁడు సొగసుకాఁడు
వింటెసిగవాఁడు పెనుగొండ వింటివాఁడు
లీలహాసమువాఁడు నామేలువాఁడు

1. ప్రాచ్య లిఖిత పుస్తకభాండాగార వివరణ సూచిక సం. 8. యక్షగానములు. సం. 1864. పుట. 2097–98. ఇది కాగితపు ప్రతి. బ్రౌనుదొర వారి కాలమున వ్రాయబడినది.

అలరునీ గుబ్బలకు నలువైనవాఁడు
అనిన గౌరితో శౌరి వ్యంగ్యమనుచు బలికె"
"పాయమంగున పతిసెపబోయకన్న
పురుష దారిద్ర్యమున మది బొగులుకన్న
విరహవేదనచేఁ జిక్కి బొరలుఁకన్న
నీ శరీరము తృణముగా నెంచ మేలు."

గుమ్మ కాంబోది - ఏకతాళము

కేల మున్మొక్రన వాఁడ నీ
కేలనే వానిమీఁద మేలు
పూనెను తలపై నొకయన్న యట్టి
వానిపై కేలనె కన్న
జడలలోన నెలవంక కాని
కడియాసతేలనె యింక
తెలిమేనిపైని విభూతి వాని
చెలువము నీకేమి భ్రాంతి
అన్నింటి కొఱగానివాఁడు ఓ
కన్నెరో నీ కీడుగాఁడు

కాంబోది - ఏకతాళం.

జాలిమాలి బొందితిని వాని
పాయజాలక గుందితిని
చాలుచాలు ఇపెబుట్టూ యిక్లైనవీాద
బాలనాకేటి పట్టూ
గడియ యేడాదిగ్గౌన గదవే వానిమూ
విడిదికి తేగదవే
తలకెక్కె దానిమందునే
నెంత పిలిచినాఁ డేమందు.

పెద కెంపరాయని పుత్రుఁడగు ఇమ్మడి కెంపరాయఁడు1 బెంగుళూరున బల్లాపురపు పేటలోనున్న రంగనాథ దేవాలయమున వేయించిన యీ క్రింది తెలుగు శాసనములను బట్టి వీరు తెలుగు వారని తెలియనగును.

స్వస్తి శ్రీ విజయాభ్యుదయ శాలివాహన శకవర్షంబులు ౧౫౭౮ అగు అఁయెడి ప్రభవ సంవత్సరము గను ౧౫ అలు శ్రీ మహారాజాధిరాజ రాజపరమేశ్వర శ్రీ వీరప్రతాప శ్రీ పెదరామదేవరాయ మహారాయలయ్యవారు రత్నసింహాసనారూఢులై పృథివీ సామ్రాజ్యంజేయుచుండగాను ఆ సంస్థానకులైన ఎలహంకనాడు ప్రభువులైన కెంప సంజయ గౌని2వారి పౌత్రులైన కెంప గౌనివారి పుత్రులైన యిమ్మడి కెంప గౌనయ్యవారు సద్ధర్మ ప్రతిపాలకులై సుఖరాజ్యం జేయుచుండగాను బెంగుళూరి పేటయందు సమస్తుల యొక్క రూపాంతరము.
సమయం తీర్చుకొనివచ్చిన స్వస్తి సమస్త నిజమహంకాళికా ప్రశస్త సమస్తులైన శ్రీ మద్గణేశ్వర గౌరీశ్వర వీరనారాయణదివ్య శ్రీపాదపద్మారాధకులైన అయ్యావళి ముఖ్యులైన స్వదేశ, పరదేశ ఉభయ నానాదేశం చాలు మూల సమస్త పెక్కండ్రు పెనుగొండ బెంగళూరు, చిక్కనాయనిపల్లె బళ్లాపురం తాటిపర్తి అవటె చంద్రగిరి, కోలార, కొత్తకోట, కావేరీ పట్నం రాయకోటి శ్రీరంగపట్న నరసీపురం బేలూరు హాబురు నాగమంగలం ఇక్కేరి బస్తిహల్లి మొదులైన స్థల పరస్థల ఉభయ నానా దేశసాలు మూల సమస్తులున్నూ బెంగళూరు ముత్యాలపేట రంగనాథస్వామి పడితర నైవేద్య తిరుతిరునాళ్లు మొదలైన ధర్మాలకు కెంపగౌనయ్యవారికి యేలుక చేసి యిచ్చిన మగముం పడి కవ ౧ టిప ౧ టి అరవీసం లెఖను నిడిచేస్తిమి. ఆచంద్రార్క స్థాయిగా స్వామిపడితర నైవేద్యతిరుతిరునాళ్లు మొదలైన ధర్మాలు త్రికరణశుద్ధిగా సమర్పించిన దానపత్రశిలాశాసనం. తిరువాతి స్వదత్తాద్విగుణ పుణ్యం...ఇత్యాది శ్లోకములు.

దీని తరువాతివి తెలుగుదే 8 పంక్తులు మాత్రమున్నది. "యిమ్మడికెంప గౌనయ్యవారికి ఆ చంద్రార్కము పుత్రపౌత్ర పారంపర్యము ధర్మం" అని కలదు.

ఈ కెంప గౌడి వంశీయులు క్రీ. శ. 1728 వఱకు బెంగుళూరి ప్రాంతమును పరిపాలించిరి. మైసూరి దొడ్డ కృష్ణరాజు దళవాయి, దేవరాజయ్య వీరిలో చివరివాడగు ముమ్మడి కెంప వీరప్పను జయించి యీ రాజ్యములో దీని చేర్చెను.

ఈ వంశీయుల వృత్తాంతమును దెలుపు నొక తాళపత్ర పుస్తకమిటీవల లభించినది. అందులో మొదటి యేఱు పుటలు తెలుగు. తక్కినది కన్నడము (?) దీనినిబట్టి వీరు తెలుగువారనియు, రాజ్య వ్యవహారములు కన్నడ భాషలో చేయుచుండెడివారనియు తెలియగలదు. వీరి వంశ వృత్తాంతము నాంగ్లేయ1 భాషలోను, కన్నడములోను విపులముగా గలదు. వానినిబట్టియే నీ వ్యాసము వ్రాసితిని. గంగా గౌరీ విలాసకర్త బెంగుళూరి నిర్మాతయగు కెంపరాయడే యగుట తెలుగువారికి ముదావహము.

1. *Epigraphica Carntica Vol. 9. Bangalore 1 Page. 179.*

2. గౌని అనునది 'గౌడని' అను శబ్దభవము

1. *The quarterly Jornal of the Mythi Society Vol. XII. No. 4. July 1923.*

*The Kempa Gouda Chiefs by B. Puttaiya Esq B. A. (Pages 723-741).*



నవల:

# శాఫో



★

## ఆల్ఫాంజ్ డాడె (ట్)

"చిట్టిబాబూ,

ఈమధ్యనే మనకు ఒక పెద్ద గండం తప్పింది. దాని అఘాతంనుంచి ఇంకా నేను తేరుకోనే లేదు. కవలపిల్లలు తప్పిపోయారు... ఒక పగలు, ఒక రాత్రీ, మర్నాడు ప్రొద్దున్నా కూడా, కాసిలెట్‌లో ఎక్కడా కనపడకుండా పోయారు.

ఆదివారంనాడు ప్రొద్దుటి భోజనాలవేళవరకు వాళ్లు తప్పిపోయినట్టే ఎవళ్ళమూ కనిపెట్టనే లేదు. ఆవేళ ప్రొద్దున్నే 8 గంటలకే నాన్నగారితో చర్చికి బయలుదేరేందుకు వాళ్ళకు మంచి బట్టలూ, అవీ తొడిగి తలదువ్వి, నీటుగా తయారుచేశాను.

ఇంతలో మీ అమ్మపను లేవో చూస్తూ వాళ్ళ విషయమే మర్చిపోయాను. మీ అమ్మకూడా ఏదో ఆపదరాబోతుందన్నట్లు మరీ ఏదో భీతావహంతో ఉండటంవల్ల, ఆమెను వదిలిపెట్టకుండా చూడాల్సి వచ్చింది. అసలు జబ్బు చేసినప్పటినుంచీకూడా, అల్లా ఏదో ఆపద రాబోయేటప్పుడల్లా ఆవిడ అల్లా మనాదిగా ఉండటం నీకూ తెలిసిన విషయమేగదా! మంచంలో కదల్లేని స్థితి వచ్చినకొద్దీ ఆమెకు మనస్సులో ఇల్లాంటి భయపుటాలోచనలు మరీ ఎక్కువౌతూ వస్తున్నాయి.

అదృష్టవశాత్తూ ఆసమయానికి మీ అమ్మ తన గదిలోనే ఉంది. ఇక మేం అంతా భోజనాలకు సిద్ధంగా కూర్చుని పిల్లలకోసం ఎదురుచూస్తూ కూర్చుంటే ఎంతసేపటికీ పిల్లలు రాకపోతే మాకు ఎల్లా ఉందో నువ్వే ఆలోచించుకో. తోటలు, దొడ్లన్నిటా వాళ్ళ పేర్లెట్టి గట్టిగా పిలిచాము. గొల్లవాడుకూడా, గొర్రెలను పిలవటానికి ఊదే కొమ్మబూరా గట్టిగా ఊదాడు. మా సీజేర్ బావాయి ఒకప్రక్కకు, నేనొకప్రక్కకు వెదకటానికి బయలుదేరాం. మాస్సెలేన్, టార్టీవ్‌లు, తలో దిక్కునా వెదకటానికి వెళ్ళారు. అల్లా అందరం కాసిలెట్ చుట్టుపక్కలంతా గాలిస్తూ తిరిగాం. ఏ ఇద్దరు ఎక్కడ తటస్థపడ్డా, "ఏమయింది" అని ఒకరడగటం మరొకరు "ఊహూ" అని పెదవి చప్పరించటం అవుతూ వచ్చింది. చివరికి ఒకళ్ళనొకళ్లు అడగటానికికూడా భయం వేయసాగింది. అల్లా గుండెలు దడదడలాడ్తూనే, చివరికి నూతులూ, గోతులూ అన్నీ వెదకసాగాం. అబ్బ! ఎంత దుర్దినమనీ! ఇక నేను మధ్యమధ్య మీ అమ్మగదికి పరుగెత్తుకుంటూ వెళ్ళాల్సి వచ్చేది. చిరునవ్వు తెచ్చిపెట్టుకొని, ప్రశాంతంగా ఉన్నట్లు నెమ్మదిగానే మాట్లాడుతూ కూర్చునే దాన్ని. పిల్లలనిద్దరినీ సెలవురోజని, వాళ్ల అత్తయ్యగారింటికి 'విల్లామూరిస్' గ్రామానికి పంపించానని చెప్పాను. ఆవిడ నమ్మినట్లే కనబడింది. కానీ తీరా సాయంత్రందాకా నాకు తెలిసి రాలేదు. అప్పుడు నేను ఆవిడగదిలో నేకూర్చుని, కిటికీలోంచి, పిల్లలకోసం తోటలూ దొడ్లూ వెతుకుతూ అటూ ఇటూ కదల్తాన్న కాగడాల వెలుతురుకేసి చూస్తూ కూర్చున్నాను. ఇంతలో పక్కమీదినుంచి ఆవిడ ఏడుపు సన్నగా వినబడింది. దేనికేడుస్తున్నారని అడిగితే, "ఏదో నాకు చెప్పకుండా దాస్తున్నారు. కాని, మీరు చెప్పకపోయినా నేను గ్రహించాను. అందుకని ఏడుస్తున్నాను" అంది. జబ్బుతో నీరసించి ఉన్నదేమో, ఆ కంఠం మరీ పసిపిల్లకంఠంలాగా ఉంది. ఆతర్వాత ఇద్దరం మాట్లాడనే లేదు. కాని మేడమీద గదిలో ఏకాంతంగా కూర్చుని, ఇద్దరం ఒకేమాదిరి ఆదుర్దా అనుభవిస్తూ కూర్చున్నాము.

చిట్టిబాబూ, ఈ కథంతా వర్ణించి నిన్ను దుఃఖపెట్టటం నాకు ఇష్టం లేదు. చివరికి సోమవారం

ప్రొద్దున్న, మా బాబాయివద్ద లంకలో పనిచేసే పాలేళ్లు, పిల్లలనిద్దరినీ తీసుకొచ్చారు. ఆ లంకలో ఒక చితుకులగుట్టమీద ఇద్దరూ పాలిపోయి ఆకలితో నకనకలాడ్తూ, ఆ చలిలో, ఆ నీటిగాలిలో రాత్రంతా గడుపుతూకూర్చుని ఉన్నారట. వాళ్లుఅమాయికంగా చెప్పుకొన్న కారణం ఇది. చిన్నప్పటినుంచే వాళ్ళిద్దరికీ, తమ పేరిటి భక్తయోగినులలా చేద్దామని ఉండేదట. సెయింట్ మేరీ, సెయింట్ మార్తాల కథ వాళ్ళిద్దరూ చదివారట. వాళ్ళలాగే, తెరచాపా, చుక్కానీ లేని నావలో బయలుదేరి, భగవంతుడు తమనే తీరానికి తీసికొనిపోతే అక్కడికిపోయి, అక్కడి జనానికి భగవత్సందేశం ఉపదేశం చేద్దామని అనుకొన్నారట. అందుకని ఆదివారంనాడు చర్చిలో ప్రార్థన అవగానే నదిగట్టుకుపోయి, ఒక చేపలపడవ కట్టుకొయ్యతాడు విప్పేసి, పడవలో ఇద్దరూ మోకరిల్లి కూర్చున్నారట. ప్రవాహ గతిలో పడవ కొట్టుకుపోసాగిందట. కాని నీరు ఇంతనిండుగా ఉన్నా, గాలి జోరుగా ఉన్నా, నదినిండా సుడిగుండాలున్నా, భగవదనుగ్రహ వైచిత్రివల్ల, మా బాబయ్యకొన్న, లా పిబూలెట్ లంకదగ్గర జమ్ములో పడవ నేల రాసుకొని ఒడ్డుకు కొట్టుకుని జమ్ములో నిలిచిందట. నిజంగా భగవదనుగ్రహమే! భగవంతుడే మా ముద్దుబిడ్డలను భద్రంగా కాపాడి మళ్ళీ మాకు ప్రసాదించాడు. వాళ్ళ గౌనులు కాస్తనలిగి బాడి అయి ఉన్నాయి. బైబిలు పుస్తకాల బంగారపు పూత కాస్తపోయింది. మొగాలు భయంతో పాలిపోయి ఉన్నాయి. అంతకుమించి ఆపద ఏమీ కలగలేదు. అంత అమాయకంగా వాళ్లు చేసినందుకు వాళ్ళనేమనేందుకూ మా కెవళ్ళకూ నోరు రాలేదు. పిల్లలను గట్టిగా కౌగలించుకొని, ముద్దాడి తేరుకొనేటట్టు చేశాం. కాని ఆ అలజడినుంచి మేం తేరుకొనేందుకే చాలా వ్యవధి పట్టింది.

అందరికన్నా ఎక్కువ బాధ పడిన వ్యక్తి మా అమ్మ! మేం ఎవళ్ళం ఆమెతో ఏమీ చెప్పక ముందే, ఆవిడ ఏదో గ్రహించి బాధపడ సాగింది. కాసిలెట్ ఇంటిమీదిగా మృత్యువు పయనిస్తోన్నట్టు తన కనిపిస్తోందని చెప్పింది. మామూలుగా ఎప్పుడూ ఓర్పుతో శాంతంగా, నవ్వుతూ ఉండే ఆవిడ, అప్పటినుంచీ ఏదో విచారంగా ఉంటూంది. మా నాన్నగారూ, నేనూ ఎన్ని ఉపచారాలుచేసినా, ఎంతమంది ఆవిడ కెంత కనిపెట్టి చూస్తున్నా ఆవిడలో ఆ విచారం తగ్గేటట్టు లేదు. జీన్‌బాబూ, నీకో సంగతి చెప్పదలుచుకొన్నాను. ఆవిడ కన్నిటికన్నా నీమీద చింత ఎక్కువైనట్లు నాకు తోస్తోంది. నిన్ను గురించే అస్తమానం శోధ పడుతూంది. మా నాన్నగారితో ధైర్యంచేసి ఆమాట చెప్పలేదు. ఆయనేమో 'నీ చదువు పాడౌతుంది. పిలిపించవద్దం'టారు. నువ్వు పరీక్ష అవగానే సెలవులకు వస్తానన్నావు. రాలేదు. పోనీ క్రిస్మస్‌కన్నావచ్చి మమ్మల్ని ఆశ్చర్య ఆనందాలలో ముంచెత్తు. మళ్ళీ మా జబ్బుమనిషి ఎప్పటి సంతోషంతో సుఖంగా చిరునవ్వు నవ్వేట్టు చేయి. నాయనా, తలిదండ్రులుపోయాక, వాళ్ళని కనిపెట్టి చూడకపోయామే అని ఒక్కొక్కళ్ళం పడేబాధ ఎంతో నీకు తెలిసుంటే..."

పొగమంచును తెముల్చుకుంటూ, బద్ధకంగా కొద్దికొద్దిగా బైటపడుతూన్న శీతాకాలపు పొద్దుటి వెల్తురులో కిటికీప్రక్కనే నుల్చొని ఆ వుత్తరం చదువుతూంటే, జీన్, మరో ప్రపంచపు మధుర స్మృతులలో, అచటి వాతావరణంలోని ఆ వాత్సల్యాన్ని, వెచ్చదనాన్నీ, వెలుగునూ, నిబిడ స్వేచ్ఛా సౌరభాన్నీ అనుభవిస్తూ నిల్చున్నాడు.

"ఏమిటదీ? నన్నూ చూడనీ!"

కిటికీ తెర తొలగించటంలో పచ్చని ఎండ వెలుగుపక్కమీదబడి ఫాన్నికి మెలుకువవచ్చి అనిద్ర బరువు మొగంతోనే మంచంప్రక్క టేబిల్‌మీద నిత్యం సిద్ధంగా ఉండే "మేరీలాండ్" సిగరెట్ ప్యాకెట్‌కోసం చెయ్యిజాస్తూ అడిగింది. దివోనీపేరు చెప్తేనే ఈర్ష్యతో ఎల్లా మండిపోతుందో తెలిసి ఉండటంవల్ల ఉత్తరం ఆమెకు ఇయ్యటానికి జీన్ ముందు భయపడ్డాడు. కాని ఉత్తరం ఆకారాన్నిబట్టే, ఎక్కడనుంచివచ్చిందో, ఉత్తరం ఏమిటో, గ్రహించగలిగినమనిషిముందు దాచటం ఎల్లా కుదురుతుంది?

ఉత్తరం చదవటంలో ముందు పిల్లలు తప్పిపోవటం అదీ చదివి, ఆర్ద్రమనస్కురాలై అట్టే ఉండిపోయింది. తలగడలు ఎత్తుగా అమర్చుకొని నిరాచ్ఛాదితవక్షంతో చెదరినకేశపాశం మెడ కిరువైపులా తెల్లని నగ్నభుజాలమీదికి నల్లగా అలుముకొంటూ, చేతిలో సిగరెట్ తిప్పుకొంటూ అల్లా వాలుగా పడుకొనే ఉండి ఉత్తరం చదువుతోంది.

ఉత్తరం చివరి కొచ్చేటప్పటికి అకస్మాత్తుగా కోపంతో మండిపోయి, ఉత్తరం నలిపి ఉండజుట్టి, విసురుగా అవతలకు పారేసి ఉగ్రంగా అంటూంది. "ఈ 'యోగినుల' కట్టుకథలన్నీ నేను నమ్మతాననుకోకు! ఇదంతా నిన్ను రప్పించటానికి అల్లిన కల్లబొల్లి కథ! తన అందాల అబ్బాయి కావాలని ఈ—"

ఆమాట లాపుదామని చూశాడు. కాని అతను అడ్డే లోపలేవచ్చి బూతులు తిడ్తూంది. అంతకుముందెప్పుడూ అతనిముందర ఇంత బరిమీరి మాట్లాడలేదు. ఇంత రాక్షసి కోపపు కళ్లతో ఇలా వచ్చి బూతులు తిట్టలేదు. మురికి కాలువ తూము పగిలి, ఆ మురుగుడూ, కుళ్ళూ అంతా బైటికి పొర్లినట్లయింది. ఆమె పూర్వ జీవిత భాషా పాండిత్యం అంతా బైటికి వస్తూంది. బాజారి రంకుటాండ్ర వచ్చి గ్రామ్యపుభాష అంతా వాడుతూంది. పెదవులు ఉబ్బిపోయి వణికిపోతున్నాయి. కంఠం, నాడులు దడదడా కొట్టుకొంటున్నాయి.

ఓ! వాళ్ల పన్నాగాలు తెలుసుకొనేందుకు పెద్ద తెలివితేటలక్కరలేదు! సిజేర్ ఇంటికెళ్ళి ఇక్కడి విషయం అంతా వాగాడు. అక్కడి పెద్దలు నలుగురూ కూడబలుక్కొని, దివోనీ 'సమ్మోహన విగ్రహం' ఎరగా చూపించి, తమపిల్లాడు ఇక్కడ తెగతెంపులుచేసుకొని తమదగ్గిర కొచ్చేందుకు వేసిన పన్నాగం ఇది.

"నువ్వు గనుక వెళ్ళావంటే, దాని వెక్తి వెంగళాయిమొగుడికి ఉత్తరం వ్రాస్తాను! ఖబర్దార్ జాగ్రత్త! ఇదిగో చెప్తున్నాను..."

ఆమాటలంటూ, ద్వేషంతో కంపించిపోతూ, మొగం తెల్లబడి మెలికలు పడిపోయి, ఉగ్రంగా ఎఱమీదికి దూకపోయే అడివిజంతువులాగా ముంగాళ్ల మీద దేహం బిగించుకొని కూర్చుంది.

రూడిలా ఆర్కేడిగ్ ఈరూపంలో ఆమెను చూసినఘట్టం గాసిన్ జ్ఞప్తికి తెచ్చుకొన్నాడు. కాని ఈనాడు ఆ ద్వేషం తనమీదికి తిరిగింది. ఆ ద్వేష ఉన్మత్తరూపం చూస్తూంటే, అతనికి ఆమెమీదపడి కసిదీరా చావగొట్టాలనిపించింది. పరస్పరగౌరవాల వల్లగాక, కేవలం కామవాంఛే మూలకమైన, ఇల్లాంటి మోహబంధాలన్నిటిలోనూ, కామ క్రోధ ప్రకోపన క్షణాలలో, పశుప్రవృత్తికే విజృంభణ కనిపిస్తుంది.

ఏం చెయ్యరానిపనిచేస్తానో, అని భయపడి వెంటనే ఇల్లుకదిలి ఆఫీసుకుబయలుదేరిపోయాడు. వీధిలో దోవపొడుగునా, తన చేతులారా తను కూర్చుకొన్న ఈ జీవితంమీద కోపం మండుకురాసాగింది. ఇప్పటికైనా ఇల్లాంటి ఆడదానిపంజాలో చిక్కకోకుండా బుద్ధి వచ్చిందా! ఎంత నైచ్యం! ఎంత ఘోర పశుత్వం! అరె, తన తల్లిని, చెల్లెళ్ళను, ఒకళ్ళనేమిటి అందరినీ, ఎంతెంత నీచపుమాటలంది. ఏమిటీ! తనకు తన యింటికిపోయి కుటుంబాన్ని చూసే హక్కు లేదన్నమాట! అరె! ఎల్లాంటి బందిఖానాలో తన్ను తను కట్టేసుకొన్నాడు. ఆనాడు విందు అనంతరం ఐగుప్తు పల్లీయ ఝుంఝటి లలిత సుందరనగ్న హస్తాలు తన మెడచుట్టూ ఎల్లా కీలింపబడ్డదీ జ్ఞాపకం చేసుకొన్నాడు. ఆ బాహుబంధం ఎంత క్రూరంగా, గాఢంగా తన్ను ఇరికించుకొని తన బంధుమిత్రులందర్నించీ తనను ఛేదించి, ఎల్లా వేరుచేసి, గట్టిగా బిగిసిపోయి ఉందో గ్రహించాడు. ఇక మనస్సును స్థిరపరచుకొన్నాడు. ఏది ఏమైనా సరే, ఆ రాత్రే కాపిలెట్‌కు ప్రయాణమై తీరుతాడు.

ఆఫీసులో పనులు ముగించుకొని సెలవుచీటీ నమోదు చేయించుకొని త్వరగా ఇంటికొచ్చాడు. ఇంటిదగ్గర పెద్ద రభస జరుగుతుందనే అనుకొంటూ వచ్చాడు. అన్నిటికీ, చివరికి తెగతెంపులు చేసికొని విడిపోయేందుకుకూడా, సిద్ధమయే ఇంటికి వచ్చాడు.

కానీ తీరా ఇంటికి వచ్చేటప్పటికి, ఫానీ అతిసాధువుగా మారిపోయి ఉంది. కళ్లు జ్యోతుల్లా అయిపోయి కన్నీటిచారలు బుగ్గలనిండా కనబడుతూ, ఆ ఏడ్పు పొంగు ఆరిపోవటంతో సాధువైపోయి, బహువినయ సంపన్నురాలయినట్లుగా అతి ఒద్దికతో ప్రవర్తిస్తుంది. ఆ కుంచించుకొనిపోయి, మెత్తపడిపోయినరూపం చూసేటప్పటికి అతనికి ఏమి చెప్పటానికి నోరు రాలేదు. ఏ నిశ్చయానికి రావటానికి కుదరటం లేదు.

చివరికి మొగం బిగించుకొని, "నేను ఈ సాయంత్రం వెళ్తున్నాను" అని దిట్టరితనం తెచ్చుకొని అన్నాడు.

"మంచిదోయ్. తప్పకుండా వెళ్ళిరా. మీ అమ్మను చూసిరా"—అని లాలిస్తూ అతనిప్రక్కన చేరి "అన్నిటికన్నా ముఖ్యవిషయం, నాకు కోపం వచ్చిందని మర్చిపో. నాకు నువ్వంటే వల్లమాలిన ప్రేమ. అందుకని, ఏదివచ్చినా ఇట్టే పిచ్చికోపం వచ్చేస్తుంది."

ఆ సాయంత్రం అంతా, అతని పెట్టీ బేడా సర్దుతూ, ప్రతివిషయానికీ ఆప్యాయంగా పెద్ద కామాటంచేస్తూ, కాపురం కొత్తరోజుల్లో ఉన్నంత మృదుమధురంగానూ ఉంటూ, అతన్ని లాలిస్తూ, తన పశ్చాత్తాపపరివేదననంతా ప్రతిభంగిములోనూ వ్యక్తీకరించుకొంటూ నడుచుకొంది. బహుశా అల్లాఅయితే అతని బుద్ధి మారి ఆగిపోతాడని ఆశపడి ఉండవచ్చు. కాని "నాతో ఉండిపో" అనిమాత్రం నోటితో ఒక్కసారైనా అనలేదు. చివరికి అన్నీ సర్దుడూ పూర్తిఅయి చివరి వీడ్కోలు సమయం ఆసన్నమయేటప్పటికి, లతలాగా అతన్ని చుట్టవేసుకొని, ఆగా

టపు కౌగిలింతలో, తనలో నితనను కొంతగానైనా అతని కర్పణమొనర్చుకొని, ఆ ప్రయాణంలోనూ ఆ ఎడబాటులోనుకూడా, తన శరీరార్ధం అతనిలో భాగమై వెంట నిలవాలన్నట్లు, అతన్ని పట్టుకు పాకులాడింది. తుది వీడ్కోలుగా ముద్దు పెట్టుకొంటూ "జీన్, నామీదేం కోపం రాలేదుకదా! నాతో చెప్పవా?" అంటూ గొణిగింది.

*　　*　　*

ఓహో! చిన్ననాడు తను పడుకొన్న తన ఇంటిగదిలో పడుకొని నిద్ర లేస్తోంటే ఏం ఆనందంగా ఉంది! తన రాకతో సంతోష సంభ్రాంతులై పోయిన తన కుటుంబంవారంతా ఆప్యాయంగా ఎదకు హత్తుకొన్న గాటపు కౌగిలింతల వెచ్చదనం ఇంకా గుండెల నావరించుకొనే ఉంది. తన ఆ చిన్న మంచపు దోమ తెరమీద, అదేచోట, కిటికీ సన్నని చిల్లుల్లోంచి పొద్దుటి ఎండచార, చిన్ననాటిలాగే అల్లాగే రమ్యంగా పడుతూంది. పర్దాయిచోట్ల వేకువకలలుకంటూ ఆ ఎండచారకోసం నిరీక్షిస్తూండేవాడు. తన చిన్ననాటి ఆ సెమళ్లు, ఈనాడూ, ఆ బురుజులమీద అల్లాగే కూర్చుని కూతలు కూస్తున్నాయి. నూతిగిలక కిరకిరమంటూ వినబడుతూంది. గొర్రెలమందల తోలుకెళ్తున్నట్లు వాటి గిట్టల సంకుల రావం వినబడుతూంది. అంతటితో లేచి కిటికీ తలుపులు బార్లగా తెరచి గోడలకు కొట్టుకు నేటట్టు విసిరాడు. నది ఆనకట్ట తూములు తెరిచినట్టు, సూరలీరశ్మి నురుగులు కక్కుకుంటూన్న ప్రవాహంలాగా తెరలు తెరలుగా గదిలోకి పొర్లి వచ్చింది. దూరాన ద్రాక్షతోటలు, ఫలవృక్షాలు, ఎండలో తళతళలాడ్తున్న తమాలవృక్షాలు, అన్నీ ఏకవంపుగా కొండ దిగువకువాల్తూ, రోన్‌నది అంచుదాకా విస్తరించి, నదివి స్పృశిస్తూ రమ్యంగా ఉన్నాయి. ఇంత ప్రొద్దుటివేళలోకూడా ఆ ఆకాశం మంచు తెరచారికన్నా లేకుండా, నదీవాయువులు శుభ్రపరిచినట్లు సాంద్ర స్వచ్ఛగరుడనీలవర్ణంతో ప్రకాశిస్తూంది ఆ ప్రాతర్మందపవనాలు ఇప్పటికీ తమ సంతోష నృత్యకోలాహలంతో గాఢంగా వీస్తూ ఆ కొండకోన కోననంతటినీ ఆనందతరంగాలలో ముంచెత్తుతున్నాయి.

ఈనాటి ఈ మెరుగువ రావటాన్ని—తన కామంలాగే కళంకితమై గాబుపట్టినట్లున్న ఆకాశం కనబడే పారిస్‌లో మెరుగువరావటాన్ని-పోల్చిచూసికొని, జీన్ ఈ స్వేచ్ఛా ఆనందాలను నెమరేసుకొంటున్నాడు. పొద్దుటి ఎండ వెచ్చదనంలో ఆ తెల్లని ఇల్లంతా ఇంకా నిద్రపోతున్నట్లే ఉంది. గదుల కిటికీతలుపులన్నీ మూసి ఉండి ఇంకా ఇల్లు కనురెప్పలు మూసుకొనిఉన్నట్లే ఉంది. కొత్త తనలో స్వాస్థ్యం చిక్కించుకొనేందుకు ఈ ఏకాంతం లభ్యమాటంకూడా అతనికి సంతోషం చేకూర్చింది. తన ఆత్మ రోగపీడితమై, జబ్బునించి ఇప్పుడే తేరుకొన ప్రారంభించినట్లు ఈ ఆరోగ్య సేకరణ సమయంలో ఈ ప్రశాంతత అత్యవసర మున్నట్లు, భావనలో పడ్డాడు.

ఇంటి ముందుచప్పరంమీదికి నడిచాడు. అక్కడి నుంచి మంటపం దిగి కొంచఎగువ ఆరామానికి—కేసిలెట్‌కు దక్షిణప్రక్క ఎగువనున్న తమాల వృక్షాలతో పునే వాళ్లు ఆరామం అనేవారు—ఎగుడుదిగుడుగా ఉన్న కాలిబాటను ప్రయాణం సాగించాడు. బాట అంతా ఎండిపోయిన తీగలు ముళ్లూ చేరి పాచిబట్టి జారుడు జారుడుగాకూడా ఉంది. అతని కుక్క "మిరకిల్," ముసిల్దయిపోయి కుంటిదయింది. అదికూడా, తన నెలవునుంచి బైటికివచ్చి, అతన్ని వెంబడిస్తూ నిశ్శబ్దంగా వస్తూంది. మును పెన్నో సార్లు ఇద్దరూ, ఈ ప్రొద్దుటి షికారులు తిరిగారు.

ద్రాక్షతోటలకు చుట్టూ తమాల వృక్షాలు కంచెగా దట్టంగా పాతారు. ఆ కోరడిదగ్గిరకు వచ్చేటప్పటికి కుక్క కొస్త నెనుకాడింది. ద్రాక్షతోట పురుగు పట్టకుండా, అడుగునంతా గంధ్రపు ఇసక తోటనిండా దట్టంగా పోయించాడు కౌన్సల్. పురుగును జయించటానికి ఆయన ఈ క్రొత్తప్రయోగం అవలంబించాడు. అక్కడి గంధ్రపుయిసుకలో, ఆ ముసలికుక్క నడవటానికి చాలా కష్టంగా ఉంది. తోటలోకి కట్టిన ఎగుడుదిగుడు మెట్లుకూడా కుక్క ముసలి పాదాల మెత్తలకు కఠినంగానే తగులుతూన్నాయి. కాని యజమానిననుసరిస్తూన్న సంతోషంలో ఆ కుక్క అల్లాగే సాగివస్తూంది. కాలికి కష్టం తోచినప్పుడల్లా, సన్నగా భయంభయంగా కుయ్‌కుయ్‌లాడుతూ, బండరాతిమీద పడేసిన పీతలాగా అడుగడుక్కీ ఆగుతూంది. జీన్ కుక్కవంక చూడటంలేదు. తన తండ్రి కాపుదల పద్ధతులూ-ఆయనచేస్తూన్న "అలికాంట్ మొక్కల" ప్రయోగాలన్నీ గత రాత్రి వివరించి ఉన్నాడు- ఆ కొత్త విషయాలన్నీ జాగ్రత్తగా పరిశీలిస్తున్నాడు. నున్నటి ఇసుకభూమిలో పైకి పొడుచుకొనివచ్చిన కొమ్మ మొదళ్ళన్నీ బలంగా, బాగాఉన్నట్టే కనబడుతున్నాయి. పోనీ పాపం ఇప్పటికన్నా ఆయనపడ్డ పాటుకు ప్రతిఫలం కలుగుతూంది. దక్షిణ సీమల పెద్దపెద్ద ద్రాక్షతోటలన్నీ నాశనమయేకాలంలో కాసిలెట్ ద్రాక్షతోటలన్నా బాగుపడతాయి.

అకస్మాత్తుగా అతనిముందర ఒక తెల్లని తల కట్టు పైకి కదిలింది. దివోనీ! ఇంట్లో అందరికంటే

ముందే నిద్రలేచే, డివోనీ. ఒకచేతిలో మొక్కలు కోసే చిన్నకత్తి ఉంది. రెండోచేత్తో ఏదో విసరి అవతల పారేస్తోంది. విత్యంపాలబుగ్గల్లా ఉండే ఆమె బుగ్గలు ఆ అదటులో ఎఱ్ఱగా కందిపోయాయి. "ఎవరు, జీన్, నువ్వా! అదరగొట్టేశావు. మీ నాన్నగారేమో అనుకొన్నాను." అని ఇంతలో తేరుకొని బిడ్డడిని ముద్దుపెట్టుకొని "బాగా నిద్ర పట్టిందా?" అని అడిగింది.

"చాలా బాగా నిద్రపోయాను, పిన్నీ! కాని నాన్నగారొస్తారని ఎందుకూ అల్లా అడిలిపోయావ్?"

"ఎందుకంటే..." అంటూ అప్పుడే తను పెకిలించి పారేసిన మొక్క మొదలుతీసి చూపించి చెప్పసాగింది. "కౌన్సల్ గారు ఈమాటు తప్పకుండా పురుగును రూపు మాపుతానని నీతో అన్నారు కాదూ? అన్నారా! మాడు! ప్చ! ఇదిగో పురుగు మళ్ళీ తయారయింది."

జీన్ అటు చూశాడు. పసుపు పచ్చని చిన్న బూజు కుక్క గొడుగు పట్టినట్టుగా చెట్టుమ్రానికి చిన్నగా పట్టిఉంది. దాదాపు ఆ బూజు కనబడటమే లేదు. ఈ చిన్నకీటకమే వ్యాపించి వ్యాపించి, రాష్ట్రాలురాష్ట్రాలను, అడుగడుగూ, అంగుళం అంగుళమూ, నాశనంచేసి వదిలిపెట్టింది. ప్రకృతివిచిత్రం! అటు సర్వజీవప్రాణదమై రమ్యమైన ప్రాతఃసూర్యాతపము, ఇటు రూపుమాపటాని కలవికాని స్వల్పాతిస్వల్ప వినాశక కీటకము!

"ఇప్పుడే మొదలుపెట్టూంది. మూడునెలల్లో తోటంతా తినేస్తుంది. మీ నాన్నగారు అభిమానంతో, మళ్ళీ కొత్తమొక్కలు తెచ్చి నాటుతారు. మళ్ళీ కొత్త మందులు, చికిత్సలు—తీరా ఒకనాడు..."అంటూ నిరాశగా ముఖం పెట్టి ఆ భంగిమంతోనే వాక్యభావాన్ని పూర్తిచేస్తూ, ఆ నైరాశ్యాన్ని ఇనుమడింపచేసింది.

"ఆ! అయితే పరిస్థితి అంత అధ్వాన్నంగానూ ఉందన్నమాట!"

"ఎందుకూ, కౌన్సల్ గారి విషయం నీకు తెలుసునుకదా. ఆయననోటివెంట ఏమాటా చెప్పరు. ఎప్పటిలాగే ఇంటిఖర్చులకు డబ్బుమాత్రం నాచేతికిస్తూనే ఉంటారు. కాని మొగంచూస్తే ఆయన పడేబాధ తెలుస్తూనే ఉంటుంది. అవిగ్నన్ కో, ఎక్కడికో వెళ్ళి, అప్పు పుట్టించుకు వచ్చేందుకు ప్రయత్నిస్తారు"

"పిజేర్ బాబాయిసంగతేమిటి! ఆయన పల్లపుసాగుపద్ధతి ఎల్లా ఉంది?" అంటూ అడిగాడు జీన్. ఇంటి కథ వింటూంటే అతని దిగులెక్కువైంది.

భగవంతుడి దయవల్ల, అటు పరిస్థితులన్నీ బాగానే ఉన్నాయి. కిందటి ద్రాక్షపంటలో ఏభై కాగుల ద్రాక్షాసవం తయారయింది. దాంతో కౌన్సల్ గారుకూడా, బంజరుగాఉన్న పల్లపుతోటల వ్యవసాయంకూడా అతనికే అప్పచెప్పారు. గత మూడునెల్లనుంచీ ఆ తోటలు నీటిముంపుక్రిందే ఉంచారు.

అని చెప్తూ, తనభర్త, పాకేలా, చేస్తూన్న ఘనకార్యానికి గర్వపడుతూ తము నిల్చున్న గుట్టమీది నుంచి, దూరాన పెద్దపెద్ద ఉప్పునీటిగుంటలలాఉన్న ముంపుపొలాలను చూపించింది. ఆ గుంటలచుట్టూ సున్నపురాళ్లు గట్టుగట్టి ఉన్నాయి.

"రెండేళ్ళల్లో అవి పంటకొస్తాయి. అటు లాపి బూలెట్ లంకతోటలూ, ఇవీ డి —మోట్ తోటలూకూడా అప్పటికే పంటకు రావొచ్చు. మీ బాబయ్య అవిఎవరితో చెప్పకుండాకొన్నారు. రెండేళ్ళలో మనమూ భాగ్యవంతులమౌతాము. కాని అంతవరకూ బిగబట్టుకొని ఉండాలికదా. ప్రతి ఒక్కరం ఎవరికి చేతనైనంత త్యాగం వాళ్ళం చేస్తూ రావాల్సి ఉంటుంది."

త్యాగంవిషయం, అతిసంతోషంగో, ఆవిషయంలో ఏమీ ఆదుర్దాలేనిస్త్రీలాగ, అంత తేలికగా సంసిద్ధురాలైఉన్నట్టే మాట్లాడుతూంది. ఆమెమాటలు వింటూంటే జీన్ మనస్సులో ఆకస్మికంగా ఏదో భావం మెరసి, అదే కంఠధ్వనిలో అన్నాడు.

"త్యాగాలుచేసి తీరుతాము. డివోనీ."

ఆనాడే ఫాన్నీకి ఉత్తరం వ్రాశాడు. ఆ ఉత్తరంలో తన తలిదండ్రులు ఇకనుంచీ తనకు డబ్బు పంపలేరనీ, తనకొచ్చే కాస్త జీతంతప్ప తన కక్కడేమీ ఆధారంలేదనీ, ఆ పరిస్థితుల్లో తాము ఇద్దరూ కలిసి కాపురం గడపటం ఇక అసంభవమౌతుందనీ తెలిపాడు. అంటే ముందు, ఎప్పుడో రాగలదని తాను అనుకొన్న ఎడబాటు, ఆ విదేశాల కెళ్ళటానికి మూడు నాలుగేళ్లు ముందుగానే వచ్చిందన్నమాట. కాని ఆమె, పరిస్థితులు ఎంత క్లిష్టంగా ఉన్నాయో ఏలాగూ తప్పక గ్రహించగలదనీ, తన దుస్థితికి తనను జాలి దలుస్తుందనీ, బాధాకరమైన తన ఈ విధ్యుక్తధర్మనిర్వహణంలో తనకు తోడ్పడగలదనీ ఆశ ప్రకటించాడు.

కాని నిజంగా ఇది త్యాగమా? పైపెచ్చు, ఈనాడు మళ్ళీ తన కుటుంబ-ప్రాకృతిక, స్వచ్ఛ

సులభ, నిష్కల్మష వాత్సల్యపూరిత వాతావరణంలోకి తిరిగి రావటంతో, అక్కడి జీవిత కళ్మల దుర్గంధాన్ని వదుల్చుకొని కైటపడ్డానని, అతను, మనస్సులో సంతోషించటంలేదా? ఆ ఉత్తరం వ్రాయటంలో కూడా, ఏ సంక్షోభమూ, బాధా, లవమైనా లేకుండా వ్రాసేశాడు. ఇంక రాశాక, అవిడదగ్గరనుంచి వచ్చే ఉత్తరానికి జవాబు ఆలోచిస్తున్నాడు. తప్పకుండా మండిపోతూ తిట్తూ, బెదిరిస్తూ ఉత్తరం వ్రాస్తుంది. తన ఆత్మబంధువుల అమాయక వాత్సల్యమే తనకు కవచంగా ఉపయోగించుకొని ఆమెకు ప్రతికి ప్రతి చెప్తాడు. అటు తన తండ్రిని చూడండి. ఆయనకన్నా గర్వంతో తలఎత్తుకొని తిరగగల మగవాడెవడు. నిగ్గయిన మనిషి, శిష్టుడు, పురుషోత్తముడు. ఆ చిన్న చెల్లెళ్ళిద్దరూ, వాళ్ళ అమాయక వదనాలతో నిజంగా దేవతాసములే. ఇక్కడివాతావరణమో! ఆ సుదూర విశాలమైన ప్రకృతి, ఆ కొండల బారులు, పర్వతపువెలుగు, కొండలగాలి. ఆ అనంత ఆకాశపు వంపు. దురితప్రవాహ రమ్యమై, సీమ నంతనూ ఆవరిస్తూన్న ఆ నదీమతల్లి, అక్కడి క్షితిజ రేఖల సౌభాగ్యము. ఇదంతా కూడా ఆమెను కాదనేందుకు ప్రబలహేతువుగా చూపెట్టగలడు. ఒక్కసారి తన కామకలాపాన్ని సింహావలోకన మొనర్చుకొని చూశాడు. ఆ లాలసలో ఎన్ని హీన, నీచ ధాతువులు సంకలనమై ఉన్నాయో పారజూచుకొంటూంటే, ఏదో ప్రాణాంతకమైన మన్యపు జ్వరం బారిబడి ఇప్పుడిప్పుడే తేరుకొంటూన్నట్లుగా అతనికి కనిపించింది.

ఉత్తరం పంపాక ఐదారురోజులు గడిచాయి. ఒకమహామారుతాన్ననుసరించివచ్చే నిశ్శబ్దతఆరోజుల నలముకొంది. రోజూ ప్రొద్దున్నా సాయంత్రం, జీన్ పోస్ట్ ఆఫీసుకు పోయి ఉత్తచేతుల్తో తిరిగి వస్తున్నాడు. అతనిలో వింత కలవరం బయలుదేరింది. ఆమె ఏం చేస్తోంది? ఏం నిశ్చయించుకొంది? అసలు ఏది ఏమైనా, జవాబు ఎందుకు రాయలేదు? నిరంతరం ఇదితప్ప వేరేవిమీ ఆలోచించలేకపోతున్నాడు. రాత్రిళ్లు, వరాండాలలో జోలపాడ్తూన్నట్లుజోరుగా వీస్తున్న గాలి హోరుకు దివాణం అంతా, నిద్రకు జోగుతూంటే, తన చిన్న పడకగదిలో సిజేర్ బాబాయితో ఈ విషయం చర్చిస్తూ కూర్చునేవాడు.

"ఇక్కడికి వచ్చినా రాగల మనిషే సుమా!" అంటాడు సిజేర్ బాబాయి. అతగాడు, జీన్ చివర వ్రాసిన ఉత్తరం కవరులోనే, తనవి రెండు ప్రామిసరీ నోట్లు కూడా,—ఆరు నెల్ల కొకటి, ఏడాది కొకటీ, వడ్డీతో సహా అప్పు తీర్చేట్టు వ్రాసినవి— పెట్టి పంపించాడు. ఇత్వాడా అప్పు తెమ్మని వచ్చికూర్చుంటుందేమోనని ఆదుర్దాలో మునిగిపోయాడు. ఆ వోస్తే అడిగితే ఇప్పుడెల్లా తీర్చగల్గుతాడు? దిహోనికి ఏమని చెప్పుకోగలుగుతాడు? ఆ ఆలోచన వచ్చేటప్పటికీ అతనికి ఒళ్లు కంపరం కల్గుతూంది. సంభాషణ ముగించుకొని క్రుంగిపోయిన బుజాలతో లేచి నుంచుని, చిలుముగొట్టం త్రిప్పుకొంటూ విచారంగా "సరేరా అబ్బాయి, పోయి పడుకొంటా! ఏమయినా, నువ్వు ఇల్లా చేయటం, చాలామంచిపనే సుమా!" అంటూ బయలుదేరిపోతుంటే, జీన్‌కు గుండెలు కలికినట్లయి ఆ బాబాయిమీద జాలికలిగేది.

చివరికి ఇన్నాళ్లుగా వేచిఉన్న ఆ ప్రత్యుత్తరం వచ్చింది. మొదటి పంక్తులలోనే, "నాప్రాణప్రియమూర్తీ, ఇందాకా నీకు ఉత్తరం వ్రాయలేదంటే, నిన్ను ఎంత పూర్తిగా అర్థంచేసుకోగలనో, ఎంత పూర్తిగా ప్రేమిస్తున్నానో, కేవలం మాటలతో మాత్రమే గాకుండా, చేతల్లోకూడా చూపించదలచుకొనే, ఆగాను." అని చదివి తెల్లబోయి ఆగాడు. రణదుందుభులు మ్రోగుతాయని సిద్ధపడి ఉండగా, మధుర గీతాలాపం వినిపించినట్లయి, అదిరిపడ్డాడు. వెంటనే చివరి పేజీ త్రిప్పిచూశాడు. "ఆ మరణపర్యంతం విశ్వాసంతో నిన్నంటిపెట్టుకొని ఉండే కుక్కను. కుక్కలాగే, నన్ను నువ్వు కొట్టినా తిట్టినా, మళ్ళీ నీ ఒళ్ళోకే దూకి నిన్ను బుజ్జగించ చూస్తాను..." అని చదివాడు.

అయితే తన ఉత్తరం అందలేదా! కాని పంక్తి, పంక్తీ, కళ్ళనీళ్ళతో చదువుతూంటే, ఇది తనకు జవాబేనని, ఈ విషాదవార్త రాగలదని ఎన్నాళ్ళనుంచో ఫానీ తయారయే ఉన్నదనీ విదితమౌతూంది. కాసిలెట్‌లో చిక్కులవల్ల, ఈ వియోగం తప్పదని ఆమె అనుకొంటూన్నట్టే తెలిపింది. వార్త విన్నవెంటనే, అతనికి భారంగా ఉండకుండా ఉండేందుకై ఎక్కడైనా ఉద్యోగంచూసుకొందామని బయలుదేరింది. బాయి-డి-బూలోన్ అవెన్యూలో, ఒక భాగ్యవంతురాలు నడుపుతూన్న వసతిగృహంలో, మేనేజరెస్‌గా ఆమెకు ఉద్యోగం దొరికింది. నెలకు నూరు ఫ్రాంకులు జీతం. వసతీ, భోజనం, హోటలులోనే ఉచితంగా ఇస్తారు. ఆదివారాలు సెలవు.

"చూడు, నా ప్రాణమూర్తీ! ప్రతివారం ఒక పూర్తిరోజంతా మనం ప్రేమించుకోటానికి ఉంటుంది. నీకు కూడా, ఇప్పటికీ, మనం ఇద్దరం కలిసిఉండాలనే ఉంది కాదా? ఏం, కాదా? నేను పడుతున్న ఈదుర్భరశ్రమకు ప్రతిఫలం తప్పకుండా

ఖయ్యావా! ఇంతవరకూ నా జన్మలో నేను ఒకళ్ళ దగ్గిర పనిచేయటం ఇదేమొదలు—నువ్వు ఊహించనైనా ఊహించలేని ఎన్ని వైచిత్ర్యాలకో పాల్పడుతూ, ఈ అహర్నిశల బానిసత్వానికి ఒప్పుకొన్నాను. నా కున్న విశృంఖల స్వేచ్ఛాప్రియత్వానికి, ఈ బానిస బ్రతుకు చాలా కష్టమే. కాని నీమీది ప్రేమకోసం ఈకష్టం పడగలుగుతున్నా ననుకోవటం, నామనసుకు ఎక్కడలేని సంతృప్తి ఇస్తుంది. నీకు నేను ఎంతో అచ్చిఉన్నాను. ఇతరు లెవ్వరూ ఏనాడూ, ప్రసక్తి అయినా లేని, అనేక సద్విషయాలపై నాకు అభిమానంకల్గించి, నేను అవి అర్థంచేసికో గలిగేటట్లు చేశావు! ఓ! ఇంతకుముందే మనం కలుసుకోగలిగి ఉంటే ఎంతబాగుండేది! కాని నేను మగవాళ్ళ కౌగిళ్ళల్లో నలిగిపోతూన్న రోజుల్లో నువ్వింకా తప్పటడుగులు వెయ్యటమైనా నేర్చుకోలేదు. ఇంకా కొన్నాళ్లు నీతో ఉండాలన్న తీవ్రవాంఛను, నీతోటే ఉండాలన్న దృఢనిశ్చయాన్నీ, నువ్వు నాలో కల్గించినంతగా, వాళ్ళల్లో ఏ ఒక్కరూ నాలో కల్గించలేకపోయారు...ఇంక నీ యిష్టంవచ్చినప్పుడే ఇక్కడికిరా—నీ గది నీరాకకు ఖాళీగా సిద్ధంగా ఉంది. అందులో నాసామాను లొక్కటీ లేవు. అన్నిటికన్నా ఆసొరుగులన్నీ ఖాళీచేస్తూ ఆస్మృతులన్నీ తోసేసుకోవటమే మరీ కష్టమైపోయింది. అక్కడ నా రూపచిత్రం ఒకటితప్ప, నా వస్తువేదేదీ నీకు కనబడదు. అదికూడా నిన్నేమీ బాధించదు. దానివంక దయతోమాత్రం అప్పుడప్పుడు చూడమని ప్రార్థిస్తున్నాను. ప్రియతమా! ప్రియతమా! ఒక్క ఆదివారాలుమాత్రమే నీ భుజబంధం మధ్య నాస్థానాన్ని అట్టే ఉంచగలిగా వుంటేచాలు—అది నాస్థానం—నువ్వెరుగుదువు కదా..."

ఆ తర్వాత మృదుమధురమైన లాలనలు—తల్లి పిల్లి, పిల్లల దేహాన్నంతనూ నాకుతూ శుభ్రపరుస్తున్నట్లు, దేహమంతటా మృదుప్రకోపనం కల్గిస్తూన్న నులివెచ్చని ముద్దుల ఓలలాడింపులు—ఆ ఉద్రిక్తవచనాలకు ఆ ఉత్తరం కౌగిలిం తన చెక్కిలికి రాచుకొన్నాడు. ఆ అనురాగం ఆ కౌగిలింలో నుంచి బైటికివచ్చి, సజీవంగా, వెచ్చవెచ్చగా, ప్రియురాలి స్ఫూర్తితో ముద్దుల కురిపిస్తోందా అన్నట్లు.

సిజేర్ బాబాయి, భయం భయంగా "నా ప్రామిసరీ నోట్లవిషయం ఏమన్నా వ్రాసిందా" అని అడిగాడు.

"నీనోట్లు రెండూ వెనక్కి పంపించేసింది. నీవు భాగ్యవంతుడివయ్యాకే తీర్చుకోవచ్చునని అంది"

బాబాయి, గుండెల బరువంతా తీరిపోయినట్లు, ఒక్క నిట్టూర్పు విడిచాడు. మహాధానందంతో అతని మొగమంతా వికసించింది. ఆ బరువు తీరేటప్పటికి సంతృప్తితో వల్లెటి హుందా తనమంతా, మాటయాసలో వెలువరిస్తూ అన్నాడు.

"ఆహా! నే చెప్పానుగదరా అబ్బాయి—ఆ మనిషి దేవతరా!"

అని యింతలో అతని సహజ వాచాలధోరణిలో మరో భావం అందుకొన్నాడు. చంచలచిత్తం, ఏ ఒక్క విషయం క్రమంగా ఆలోచించలేకపోవటం, ఇప్పుడన్న విషయం మళ్ళీ క్షణానికి జ్ఞప్తి ఉండక పోవటం, సీజేర్ బాబాయిలో విశిష్ట లక్షణాలు. ఆ ధోరణిలోనే ఇట్టే మరో విషయం మాట్లాడుతున్నాడు.

"కాని మనిషిలో ఏం ఉద్ధృతంరా అబ్బాయి! అరే, ఏం కోపం, ఓః! తలచుకొంటేనే నాకు గొంతుకు పాడి ఆరిపోతోంది. ఎందుకూ! తనప్రియురాలు లామోర్నా వ్రాసిన ఉత్తరాలు కొర్బ చేసి చదివి వినిపిస్తూండే రోజుల్లో, అమ్మ ఇల్లాగే అనిపించేది..."

సిజేర్ బాబాయి మొదటిసారి పారిస్‌కు వెళ్లటం, హొటల్ కుజాలో దిగటం, 'పెయ్యానాకుడు' పిల్లతో ప్రేమకలాపం—ఆ గాథంతా జీన్ మళ్ళీ వినాల్సివచ్చింది. కాని అవి అతని చెవి కెక్కటం లేదు.

జీన్‌లో ఒక అహంకారం పొటమరించుకొంటూవచ్చింది. ఫాన్నీ పూర్వ ప్రేమికులు, అంతంత కీర్తివంతులూ అంతంతటి మహా పురుషులూ అయినా, ప్రతి ఒక్కరూ ఆమె నంతకంతకు అధఃపాతాళానికి దిగద్రొక్కుతూ వచ్చారు. కాని తనో! కేవలం తన సచ్ఛీలశక్తి మాత్రంచేతనే ఆమెనా బురదగుంటనుంచి ఉద్ధరించేందుకు బహుశా సిద్ధంగా ఉన్నాడు.

ఆమె ఒక మధ్యేమార్గం చూపించినందుకు, తమ ఈ బంధం కొంచెంకొంచెంగా సడలిపోయేందుకు అవకాశం చూపించినందుకు, ఆమెపట్ల కృతజ్ఞుడై పోయాడు. ఆమె కూడా కొత్త అలవాట్లు చేసుకొంటుంది. స్వతహాగా బద్ధకస్తురాలైన ఆమె పనిపాటల కలవాటుపడటం చాలా కష్టమే కావచ్చును. కానీ అలవాటు పడగలదు. మర్నాడే ఆమెకు ఉత్తరం వ్రాశాడు. జ్ఞానవృద్ధుడు పితృవాత్సల్యంతో ఉపదేశం చేస్తున్నట్లుగా వ్రాశాడు. ఆమె సంస్కరణాభిముఖంగా ఉన్నందుకు అభినందించాడు. ఆ వసతి గృహ మెల్లాంటిదో, అక్కడి కెల్లాంటి మనుష్యులు వస్తారో కాస్త జాగ్రత్తగా ఉండవలసిందని చెప్ప

రిక యిచ్చాడు. ఆమెలోని అలసత్వం—ఎంత తేలికగా పరిస్థితులకు లొంగిపోగలదో—ఆ విషయాలే అతనికి అనుమానాలు కల్గించాయి. తీరా అల్లా లొంగిపోయి, "ఏం చెయ్యమంటావ్? పరిస్థితు లల్లా ఉన్నాయి—" అంటుంది.

ఫానీ ప్రతిరోజూ అతి వినయంతో పసిపల్ల వ్రాసినట్లు, అతనికి ఉత్తరాలు వ్రాసేది. తనున్న హోటల్ నా లేఖలలో చిత్రించి చూపించింది. చాలా శిష్టులైన విదేశీ కుటుంబీకులు దిగే హోటలు. క్రిందఅంతస్థులో పెరూవియన్‌కుటుంబం ఉన్నారు. తల్లి, తండ్రి, పిల్లలు, చాలామంది నౌకర్లు ఉన్నారు. రెండో అంతస్థులో రష్యన్ కుటుంబా లున్నాయి. ఒక డచ్చి వర్తకుడు, పగడాల వ్యాపారి, ధనికు డున్నాడు. మూడవ అంతస్థులో, హిపొడ్రోమ్‌లో రింగు-మాస్టర్లు ఇద్దరు ఇంగ్లీషువాళ్ళు ఉన్నారు. ఛాలా నీటుగా, ప్రతి విషయంలోనూ, అతి నిశ్శబ్దంగా ఉంటారు. ఆ అంతస్థులోనే, స్టట్‌గార్ట్ నుంచి వచ్చిన వైణికురాలు ఫ్రాలిన్‌మిన్నావోగిల్ ఉంది. చాలా ఆకర్షణీయమైన వ్యక్తి. ఆమెతో ఆమె తమ్ముడు లియో కూడా ఉన్నాడు. పాపం ఆ అబ్బాయికి క్షయవ్యాధి. అందుకని "కాన్సర్వెటోర్"లో నాగస్వర వాయిద్యం నేర్చుకొంటూన్న వాడల్లా అది మానేసి ఇక్కడకొచ్చాడు. అతని అక్కగారు అతనికి సేవ చేయటానికే ఇక్కడకు వచ్చింది. పాపం చాలా బీదవాళ్ళు. మధ్య మధ్య ఏవైనా సంగీతసభలు చేసుకొంటూ, ఆ వచ్చిన కాస్త డబ్బుతో హోటలులో గ్రాసవాసాలు గడుపుకొంటూ వస్తున్నారు.

"ఆత్మేశ్వరా! చూశావుకదా! ఇంతకన్నా మనోరమూ, మర్యాదాయుతమూ ఐన పరిసరాలు ఎక్కడా ఉండవుకదా. ఇక నామాటా! నేను భర్తృహీనననే ఇక్కడంతా అనుకొంటున్నారు. ఆ అభిప్రాయంలో అనేకవిధాల చిన్న చిన్న గౌరవోపచారాలన్నీ చేస్తున్నారు. నేనూ, అల్లా తప్ప ఇతరత్రా జరగకూడనే నిశ్చయించుకొన్నాను. నీ భార్యను అందరూ గౌరవించి తీరాలి. నేను "నీభార్యను" అన్నప్పుడు, దయచేసి ఏ భావంతో అంటున్నానో అర్థంచేసుకో. ఎప్పుడో ఒకనాడు నువ్వు ఇతరత్రా వెళ్ళి పోతావనీ, నాకు దక్కవనీ నాకు తెలుసును. కానీ నీతర్వాత నాజీవితంలో మరెవ్వరూ ఉండరు. నీ స్పర్శను, నీ ప్రేమను, నువ్వు నాలో రేకెత్తించిన సద్భావాలను నెమరేసుకొంటూ నిత్యమూ నీదాననుగా నేను ఉండి పోతాను...హాస్యాస్పదంగానే ఉందికదూ, శాఫో పతివ్రతగా మారటం! నిజం! నువ్వు నాదగ్గిర ఇంక ఉండనప్పుడు నేను సద్గుణవతిగానే ఉండి పోతాను. కాని నీతో ఉన్నప్పుడు మాత్రం, నువ్వు నన్ను ప్రేమించిన దినంలోనే, మహోద్విగ్నమైన కామంతో దహించుకుపోతూ ఉంటాను—నిన్ను నేను ఉన్మత్తంగా ప్రేమిస్తున్నాను..."

ఒక్కసారిగా నీరసం, నిస్పృహా ఒక మహా తరంగంలాగా జీన్‌నుముంచెత్తేశాయి. ఇల్లు వదలి వెళ్ళి, దుర్వ్యసనలోలురై, ఉన్నధనమంతా ఖర్చుపెట్టుకొని, బికారులై, హీనజీవితపరిస్థితుల్లో మెలగి, చివరికి ఇంటికి వచ్చినవాళ్ళను, ఇంటివాళ్ళు మహదానందంతో అపారవాత్సల్యంతో, పంచభక్ష్య పరమాన్నాల భోజనాలమర్చి సర్వసౌఖ్యాలు ఏమరకుండా చూస్తూ అతి ఆప్యాయంతో కౌగలించుకొని ఆదరిస్తున్నా, ఆ బికారిజీవితపు స్వేచ్ఛకోసం పరితాపం కల్గిస్తూ, ఆ తిండిలేక కందమూలాలు తిని పందుల తోలిన బానిసబ్రతుకు విషాదస్మృతులన్నీ పునరాకర్షణ కలిగిస్తూ, స్వగృహ ఆతిథ్య వాత్సల్య ఆనందాన్ని భగ్నంచేస్తూ బాధకల్గిస్తాయి. వ్యక్తులూ వస్తువులమీద ఉన్న పూర్వాకర్షణలన్నీ తారుమారయిపోయి నిర్మోహస్థితిని కల్పిస్తాయి. ఒక్కసారిగా సర్వమూ, నిరామయంగా, వసివాడిపోయి కనిపిస్తుంది.

పల్లెటి ప్రభాతాల ప్రకృతి రమ్యత్వంలో, మునుపటి అకల్మషానందం కనిపించదు. అడవులలో నదీతీరాన, విహారాలూ, వేటలూ, మునుపటి ఆకాంక్షకాన్నియ్యక విసుగు కల్పిస్తాయి. నదిమీద కొంగలవేటకు ఆ బ్రూలపడవ తీసుకు పోటానికి ఇష్టమే కలగటంలేదు. బాబాయి పల్లపుతోటల్లో, ప్రక్కనే బాబాయి తను చేస్తూన్న ప్రయోగాలన్నీ వివరించి చూపిస్తుంటగా, నదిముంపు జాగాలలో తిరుగుతూంటే, నది మరీ పొంగులెత్తుతున్నట్లూ, గాలి మరీ జబ్బుగా వీస్తున్నట్లూ అనిపించేది. ఈమాటు వచ్చిన కొత్తలో, తన స్వగ్రామం, చిన్ననాడు తను గంతులేస్తూ ఊరంతా పరుగెడ్తూ తిరిగినప్పటి అంత ఆకర్షణీయంగానూ కనబడింది. కాని ఇప్పుడు ఆ చోటే-అక్కడక్కడ చివికిపోయి పాడుపడ్డ గుడిసెలూ అవీ, మృత్యువును తలపిస్తూ నిర్ధూమధామ-నిర్జనప్రదేశా లయినట్లు, బిక్కుబిక్కుమంటూంటే దక్షిణ ఇటలీ గ్రామాలలా కనిపిస్తున్నాయి.

ఇంక పోస్టుకు బయలుదేరినప్పుడల్లా దోవ పొడుగునా, ప్రతిగుమ్మంలోనూ ముసలాళ్ళు నిల్చుని ఎక్కడికక్కడ నిలేసి గంటలసేపు కుశలప్రశ్నలతో గడిపేవాళ్ళు. ఆ ముసలాళ్ళందరూ గాలివానలో వంకరలు తిరిగిపోయిన చెట్లల్లా కనబడుతూ, వణుకుతూన్న చేతులకు, అల్లిక మేజోళ్లు తొడుక్కొని ఉండేవారు.

ఇంకా వాళ్ళ ముసలమ్మలు నెత్తికి బిగుతుగా టోపీలు పెట్టుకొని, చందనపు బొమ్మలలాగా పచ్చగా కొయ్యబారిన మొగాలలో సన్నగా మెరుస్తున్న చిన్ని కళ్లు చికిలించుకొంటూ, పాడుగోడలమీద తొండలలా, గుమ్మాల కంటుకొని ఉండేవారు.

ఇంక ఊళ్ళో కబుర్లు, ఎప్పుడూ ఒకటే విలాపం. ద్రాక్షతోటలన్నీ పురుగుపట్టి పాడయిపోయాయి. మల్బరీ తోటలు చీడపట్టి పోయాయి. పెండలం దుంపంతా చివికిపోయింది. సుక్షేత్రమయిన ఈరాష్ట్రం పొలాలన్నీ ఈజిప్టుకుపట్టిన దుర్భిక్షపు పీడలు ఏడూపట్టి నాశనమైపోయాయి.

వాళ్ళను తప్పించుకొనేందుకు అడ్డ సందులు తొక్కి ఇంటికి బయలుదేరాడు. పాడుపడ్డ అర్చకుల దివాణం గోడలప్రక్కనే కొండ ఎగుడు దిగుళ్ళన్నీ ఎక్కుతూ దిగుతూ, పోతూండేవాడు. ఆ సందులన్నీ నిర్జనంగా ఉండేవి. ఆ దోవల్లోనే, తుప్పలు దుబ్బులూ మొలిచి ఉండేవి. చర్మరోగ నివారణకు, పూర్వం సెంట్‌రాబ్ మొదలైన బైరాగులువాడిన మొక్కలు, దోవపొడుగునా అడ్డంగాఎత్తుగా మొలిచి ఉండేవి. ఈస్థలంలో, పాడుపడ్డ ఆపెద్దకోట నీడలలో, మధ్యయుగాలు ఇంకా స్థిరనివాసం ఏర్పరచుకొని వదలలేక పాకులాడుతున్నట్లు, ఆ పూర్వపు ఓషధీలతలు అందు కనుపుణ్యంగా ఉన్నట్లూ, అనిపించేది.

అటువస్తూంటే చర్చి పూజారి ఫాదర్ మాలాసాన్ని చర్చిలో ప్రార్థనోపన్యాసం ముగించుకొని వస్తూ కనబడేవాడు. పెద్దపెద్ద అంగలు వేసుకొంటూ త్వరత్వరగా నడుస్తూ పైఅంగరఖా దోవలోని ముళ్ళ చెట్లల్లో తుప్పల్లో ఇరుక్కోకుండా రెండుచేతులా ఎత్తిపట్టుకొనివస్తూ కనబడేవాడు. పూజారి జీన్‌ను చూచి ఆగి, ఇక్కడి జనంలో భక్తి ఎల్లా నశించిపోయిందో, మ్యునిసిపల్ వాళ్లు ఎంత నాస్తికంగా ప్రవర్తిస్తున్నారో అన్నీ వివరిస్తూ, అక్కడి పొలాలను, చర్చికిరాని జనాన్ని, జంతువులనూ, అన్నిటినీ శపిస్తూ ఉపన్యాసాలిచ్చేవాడు. ఈజనం పూజారివన్నా పిలవకుండా అంత్యక్రియలు జరిపేస్తున్నారు. వైద్యుడుకీ పూజారికీ డబ్బుయివ్వాల్సివస్తుందని, మంత్రాలతోటి, భూతబలులతోటీ వైద్యాలూ అవీ మొదలెట్టారు—

"ఔనండీ! భూతవైద్యాలు బయలుదేరాయి. చూడండి! జనం ఎంత అధోగతికి దిగిపోతున్నారో. ద్రాక్షతోటలు చీడపట్టి పాడయ్యాయంటే పాడవవూ"

జీన్ జేబులో ఫాన్నీ ఉత్తరం ఉండేది. అది చదవాలన్న ఆత్రం దహించుకుపోతున్నా, అక్కడే నుల్చుని, ఆ మాటలన్నీ వినాల్సివచ్చేది. చివరికి ఎల్లాగో ఆ పూజారి ఉపన్యాసంనుంచి చించుకొని బైటపడి, దివాణంకేసి పరుగెత్తేవాడు. అక్కడ ఒక మూల కొండగుట్టల్లో బండరాళ్ళమధ్య గాలి తగలని లోయలాగా ఒక చిన్నస్థలం ఉంది. చలిగాలి తగలకపోయినా ఎండమాత్రం, రాతిమీద పడి చుట్టూ అంతా వెచ్చబడేసినట్లుండేది. అక్కడిపల్లెటిజనం అన్నట్లు, ఒంటరిగా ఏడ్చేందుకు అనువైన స్థలం.

జీన్ ఎప్పుడూ దూరంగా, నిర్జనంగా ఉండే ఏకాంతప్రదేశాన్నే ఎన్నుకొనేవాడు. ఎఱ్ఱమాను చెట్లూ, గులివింద పొదలూ, ఉన్నచోట, అల్లాంటి బండల మధ్య లోయ నొకదాన్ని ప్రత్యేకం ఎన్నుకొన్నాడు. ఫాన్నీ ఉత్తరాలు చదువుకొనేందుకు ఆ ఏకాంతస్థలం ఎన్నుకొన్నాడు.

ఉత్తరం చదువుతూన్నకొద్దీ, ఉత్తరంనుంచి వస్తూన్న అత్తరు వాసన నెమ్మది నెమ్మదిగా మైకం కల్గించేది. అందులో మాటల మెత్తదనం, అవి స్ఫురింపచేసే ఘట్టాలూ, తలలో కమ్ముకొని, కామోద్వేగంతో నాడి తీవ్రంగా కొట్టుకొనేట్టు చేసేవి. ఆ మైకం అల్లాగే కమ్ముకొంటూ వచ్చి, అక్కడి వాతావరణమంతా నాటకరంగంలో తెర ఎత్తితే మారిపోయినట్లు మారిపోయేది. ఆ నది, మధ్య మధ్య లంకలూ, అటు ఇటూ కోనలో పల్లెలూ, ఆ గాలి హోరూ, ఆ ఎండ, తెలిమబ్బులూ, కోనకోనంతా, అర్థంలేని తెర ఎత్తేసినట్లు మాయమైపోయేవి. ఇట్టే మళ్ళీ పారిస్‌లో తమ పడకగదిలో, కిటికీలోంచి రైలుస్టేషన్ పైకప్పుకేసి చూస్తూన్నాడు. ప్రబల కామేచ్ఛకు దాసుడౌతూ, నదిలో మునిగిపోతున్న జంట, ప్రాణాలు పోతూన్న ఆవేదనలో ఊపిరాడకుండా ఒకరినొకరు గట్టిగా బంధించేసుకొన్నట్లు, తమ కామోద్వేగంలో ఇద్దరూ గాఢంగా బంధితులై పోతూ......

అకస్మాత్తుగా వెనుక కాలిబాటమీద పదధ్వనులు వినబడ్డాయి. కిలకిల నవ్వులతో "అదుగో అక్కడున్నాడు" అన్న కేకలు వినబడ్డాయి. కవల పిల్లలిద్దరూ, కాళ్ళకు పొదలముళ్లు గీసుకుపోతుంటే జంటగా ఆ సన్నదోవను కలిసివస్తున్నారు. వాళ్ళ ముందర ముసలి కుక్క "మిరకిల్" తన యజమానిని పసిగట్టి కనుక్కొగలిగానన్న సంతోష గర్వంతో నన్నట్లు తోకాడించుకొంటూ దోవ చూపిస్తూ వస్తూంది. పిల్లలిద్దరూ ఎగబడిదగ్గిరకు వచ్చి, "దాగుడు మూతలాడదామనీ" లేకపోతే పరుగులు తీద్దామనీ నును సిగ్గుమొగాలతో పెద్ద అన్న నడుగుతున్నారు. జీన్ కుక్కనొక్క తన్ను తన్నాడు. ఆపిల్లలమాటలు ఇట్టేతోసేశాడు. కాని ఆపిల్లలంటే అతనికి అతి వాత్సల్యమే. ఇంటికి వచ్చినప్పటి

నుంచీ వాళ్ళకోసం తానుకూడా పసివాడయిపోయి వాళ్ళిద్దరితో ఆటలు తానే మొదలుపెట్టాడు. కవల పిల్లలైపుట్టినా, ఆయిద్దరిరూపాలలోనూ గుణాలలోనూ ఉన్నవిభేదం అతనికి రమ్యంగా తోచేది. ఒక పిల్ల పొడుగ్గా, చామనచాయ నుంటుంది జుత్తు ఉంగరాలు తిరిగిఉంటుంది. ఎప్పుడూ ఏవో కలలు కంటూండే కళ్ళు. ఆ అమ్మాయికి ఎంతతోస్తే అంత. చర్చిలో ఉపన్యాసం వినగానే ఉద్రేకంతో పడవలో బయలుదేరి భగవంతుని సందేశం నలుదిక్కులా అందజేయాలని భావించింది ఇద్దరిలో మొదట ఈ పిల్లే. తాను ఈజిప్టు మేరీననీ, తన అందమైన చెల్లెలు మార్తని, తనతోపాటు భక్తురాలిని చెయ్యాలనీ, ఆవేశపడ్డది ఈ పిల్లే. మార్త జుట్టు అందంగా ఉంటుంది. ఇద్దరిలో ఆపిల్లే తెలుపు. చాలాబిడియస్థురాలులాగా, చెప్పిన మాట వినే రకంగా ఉంటుంది. పోలికలో కూడా తల్లినీ అన్నగారినీ పోలిఉంటుంది.

కాని తన స్మృతులలోనుంచి ఇంకా బయలుపడలేనిస్థితిలో, ఈ అమాయక పిల్లలిద్దరూ తన ఒడిలో కెక్కి తనను కౌగిలించుకుంటూ తనుపాల బుగ్గలతో ప్రియురాలిలేఖా సువాసనలంటిన అన్న మొగాన్ని రాస్తూంటే, జీన్ మహాఘోరంగా చికాకుపడిపోయాడు. "వద్దు! నన్ను వదిలిపొండి నాకు కొంచెంపని ఉంది" అంటూ వాళ్ళను విదిలించేసుకొని లేచాడు. అక్కడినుంచి తన గదిలోకిపోయి తలుపు వేసుకోబోతూంటే తండ్రి పిలిచాడు.

"ఇదిగో జీన్ ఇక్కడే ఉన్నావా, చూడు ఇది విన్నావా."

రోజూటపాలో పొద్దుటి పేపరు రావటంతో ఏదో దిగులు పుట్టించే కొత్త వార్త ఉంటూనే ఉండేది. కౌన్సల్ వస్తుతః ఎప్పుడూ ఏదో విచారంతోనే ఉండేవ్యక్తి. ప్రాచ్యదేశాలలో కౌన్సల్ గా ఉన్నప్పుడు నోరు మెదపక్కరలేకుండా దీర్ఘకాలం గడపటానికి అలవాటు పడ్డాడు. ఉండుండి ఒక్కసారి గప్పుమని మండిన బాణాసంచాలాగా, ఆ పూర్వస్మృతులు కెలుక్కుంటూ "హాంగ్ కాంగ్ లో నేను కౌన్సల్ గా ఉన్నప్పుడు..." అంటూ చెప్పటం ప్రారంభించేవాడు. తండ్రి పేపరు చదువుతూ, విమర్శలు సాగిస్తూన్నంతసేపూ జీన్ నిశ్శబ్దంగా కూర్చుని, అక్కడ అలమారుగూటిమీది, కాపుసల్ చెక్కిన శాఫో కంచు విగ్రహం — ఆ మోకాళ్ళను పెనవేసుకొన్న చేతులూ, ఆమె ప్రక్కనున్న తంత్రీవాద్యం — మహతీ వీణా శత తంత్రీ సర్వస్వం — కేసి, చూస్తూ కూర్చునేవాడు. ఆ కంచుబొమ్మ ఎప్పుడో ఇరవైఏళ్ళక్రితం "శేస్లెట్" గృహాన్ని అలంకరించేరోజుల్లో కొన్నారు. పారిస్ దుకాణాలలో ఈ ఫ్యాక్టరీ తయారీ కంచువిగ్రహాన్ని చూసి అసహ్యించుకొన్న అతనికి, ఇక్కడ ఈ ఏకాంతంలో ఆ విగ్రహాన్ని చూసేటప్పటికి కామాగ్ని ప్రజ్వరిల్లి, ఆ భుజాలను ముద్దిడుకోవాలని, నిగనిగలాడ్తూ చల్లగా ఉన్న ఆ చేతుల పట్టు విడదీసి, ఆమె నోటివెంట "శాఫో నీకోసమే, నీఒక్కడికోసమే" అని అనిపించాలని, కోరిక కలిగేది.

అతను బైటికి బయలుదేరినప్పుడల్లా, మరులుగొల్పుతూ ఆమె రూపం అతన్ని వెంటాడించేది. అతనితో నడుస్తూండేది. మెట్లు ఎక్కుతూంటే అతని పదధ్వనుల్లో ప్రతిధ్వనిస్తూండేది. అక్కడి పురాతన గోడగడియారం పెండ్యులమ్ ఇటూ అటూ కదలికలో "శాఫో" స్వరానికే నిత్యం తాళం వేస్తూన్నట్లుండేది. వరాండాలలో జోరుగా వీస్తున్న ఈదురుగాలి శాఫో పేరే చెవిలో రహస్యంగా ఊదుతూన్నట్లుండేది. ఆదివారం, పురాతన గ్రంథాలయం బీర్వాలలో పెద్దపెద్ద పాతబైండు ఎట్టంచు పుస్తకాలన్నిటా, అతను ఏ పుట తెరిచినా అక్కడంతా శాఫో పేరే పునఃపునః ఉల్లేఖితమై ఉండేది. ఆ పుస్తకాలు తెరిచినప్పుడు, చిన్నప్పుడు రొట్టెలు నములుతూ ఆపుస్తకాలు తిరగేసినరోజుల్లో వాట్లల్లో పడిన రొట్టె నలుసులు, ఎండినవి, రాలుతూండేవి. నిత్యం స్మృతిపథంలో శాఫో అల్లా వెంటాడుతూనే ఉంది. చివరికి తల్లి గదిలోకి వెళ్ళినప్పుడు కూడా శాఫో మోహనరూపం మనస్సులో మెదలుతూనే ఉంది.

పిన్ని దివోనీ, ఆ రోగి మనిషి తల చిక్కుదీస్తోంది. అంత రోగపుబాధలో ఉన్నాకూడా ఆమె ముగం గులాబీ పువ్వువన్నెలో ప్రశాంతంగా ఉంది. ఆ నుదురునుంచి వెనుకకు దువ్వుతున్న కేశపాశాలు ఒత్తుగా తెల్లని పట్టుపోగుల్లా రమ్యంగా ఉన్నాయి.

"ఇదుగో, మన జీన్ వచ్చాడు" అనేది తల్లి.

కాని దివోని తలకట్టు, ఆ తెల్లని మెడ, జబ్బు మనిషికి ఆమె తప్ప ఎవరూ చెయ్యలేని ఈ ఉపచారాలు చేసేందుకు మోచేతులపైకి మడిచినజాకెట్టు, అన్నీ ఏవో ఇతరప్రాతః స్మృతులను రేకెత్తిస్తూండేవి తన ప్రియురాలు ప్రక్కమీదనుంచి సిగరెట్టు తాగుతూ ఆ పొగ మధ్యలోంచి ఎల్లా ఉరుకుతూ మంచం దిగేదో అవన్నీ జ్ఞప్తికి వస్తున్నాయి. మాతృసన్నిధిలో, ప్రపంచం అంతటిలోకీ ఇక్కడ, ఈ మాతృమందిరంలో, అల్లాంటి తలపులు తగిలినందుకే తన్ను తను తీవ్రంగా అసహ్యించుకొనేవాడు. కాని ఆ స్మృతులను విదుల్చుకోటానికి ఏం చెయ్యగలడు!

"అబ్బాయి మునుపటి మాదిరిగా లేడమ్మా, షెర్లీ!" అనేది గాసిప్ సతి విచారంతో. "కారణం ఏమి టంటావ్?" అక్కడినుంచి ఆ యిద్దరూ ఆ విషయమే దీర్ఘంగా విచారిస్తూ కూర్చునేవారు. దివోనీ తన అమాయకపు బుఱ్ఱను ఎంత పగులకొట్టుకున్నా కారణం తెలియటంలేదు. అతన్నే అడగాలనుకొంది. కాని అత నామెను తప్పించుకొని తిరుగుతోన్నట్లు కనబడుతున్నాడు. ఒంటరిగా ఆమెతో నిలవటానికే యిష్టం లేనట్లు, కనబడుతున్నాడు.

ఒకసారి అతను ఒంటరిగా ఎటు వెళ్తాన్నదీ పరిశీలించిచూసి, అతనికి తెలియకుండా వెళ్ళి చటాలున అతనికి కనబడింది. అక్కడ ప్రియురాలిప్రేమలేఖల మదనతాప జ్వరతీవ్రతలో, ఆ దుస్స్వప్న మధ్యాలలో మునిగి తేలుతున్నాడు. అకస్మాత్తుగా ఆమె కనపడేటప్పటికి మందగొడిగా చూస్తూ అదాటుగా లేచి నిలబడ్డాడు. ఆమె అతన్ని కూర్చోపెట్టి, అతని ప్రక్కనే ఆ పెచ్చునిరాతిమీద కూర్చుని అనునయంగా అడుగుతూంది. "ఏం నాయనా! నేనంటే ఇష్టం తప్పిపోయిందా? మునపటి దివోనీని, కానా! నీ కష్టాలన్నీ గుండెవిప్పి చెప్పుకొనేవాడివి ఆ దివోనీని కానా"

ఆ వాత్సల్యానునయాలకు కంపించిపోతూ "ఔను, ఔను! నువ్వు, నువ్వే" అంటూ నత్తినత్తిగా అన్నాడు. అంటూ మొగం తిప్పేసుకొన్నాడు. తన దూరస్థవియోగినీ ప్రేమాలాపాలు, ఆ మోహపు పలుకులు, ఆ ప్రోషిత ఆక్రందనాలు, అప్పుడే చదివిన వన్నీ తన కన్నులలో ప్రతిఫలిస్తున్నాయి. ఆ కన్నులామెకు కనబడకుండా మొగం తిప్పేసుకొన్నాడు.

"మరి ఏమిటి సంగతి! ఎందుకల్లా విచారంగా ఉన్నావ్," అంటూ మాటలోనూ చేతలోనూ పసిపిల్లడిని సముదాయిస్తున్నట్లుగా చేతులతో అతన్ని నిమురుతూంది. ఆమెకడుపునకనకపోయినా అతను దాదాపు ఆమె బిడ్డడే! ఈనాటికీ అతనికి పదేళ్ళే! పసితనం వీడి పడుచుదనంలో అడుగెట్టే ఆ యీడునే ఆ పిల్లడు ఆమె కళ్ళల్లో కనబడుతున్నాడు.

శాఫోఉత్తరాలు చదివి ఉద్విగ్నుడై ఉన్నాడు. అతనికంత దగ్గిరలో ఆనుకొని కూర్చున్న ఆ రమణీయమూర్తి శరీరము, ఆ ఈదురుగాలికి మరింత ఎఱ్ఱపడిన ఆమె పెదవులు, ఆమె తలాడించినపుడల్లా, గాలికి కదులుతూ ఆమె నుదురుమీద ఆనంద నృత్యాలు చేస్తున్న ఆమె ముంగురులు, అన్నీ ఒక్కసారి అతన్ని మరీ కామంతో మండించివేశాయి. శాఫోసూక్తులన్నీ—"ఆడవాళ్లంతా ఒకటే—పురుషుడు దగ్గిరున్నప్పుడు వాళ్ళకుండే ఆలోచనఒక్కటే ఒక్కటి—" అన్న సూక్తులన్నీ మనసుకు తగిలి మైకంకల్పించి, ఆపల్లెటి పడుచు ఆనందహాసమూ, అతన్ని బతిమాలుతూ అతని చేతులు పట్టుకొన్న ఆమె స్పర్శా, అన్నీకూడా తనను రెచ్చగొట్టేందుకు చేస్తున్న చేష్టల్లాగే కన్పింపచేశాయి.

అకస్మాత్తుగా ఒక విషవ్యామోహం, పడగ విప్పి నిల్చున్న దుష్ట సర్పంలాగా, అతని వెన్నున ఎగప్రాకి, నరనాడులనూ కంపించివేసింది. ఆ దుష్ట సర్పాన్ని అణగద్రొక్కటంలో పళ్ళు కరుచుకొంటూ మొగం పాలిపోయి కంపించిపోయాడు. బిడ్డడల్లా కంపించి పళ్ళు కొరుకుతూ పాలిపోవటం చూసి, దివోనీ తెల్లపోయింది. "అయ్యో పిచ్చి నాయనా! జ్వరం వచ్చిందిరా," అంటూ తన అవ్యాజ కరుణాహృదయంతో, అనాలోచితంగా, అతని తలకు చుట్టేందుకని, తన బుజాలచుట్టూ కట్టుకొన్న రుమాలు విప్పింది. అకస్మాత్తుగా ఆమె అతని కౌగిలిలో పట్టుబడింది. ఆమె బుజాలమీదా కంఠసీమనూ, చేతులపైనా, ఆ సూర్యరశ్మిలో తెల్లగా మెరిసిపోతున్న ఆమె దేహమంతటా, అతను వెఱ్ఱిగా ముద్దులు కురిపిస్తున్నాడు. ఆమె కేక వేసేందుకుగాని తన్ను తను రక్షించుకొనేందుకుగాని వీలు లేకపోయింది. అసలు, ఏం జరుగుతోందో గ్రహించేందుకు కూడా ఆమెకు వ్యవధి లేకపోయింది.

"ఛీ! నాకు పిచ్చెత్తింది, పిచ్చెత్తింది," అంటూ అరిచి, అదాటుగా అక్కడినుంచి పరుగెత్తిపోయాడు. అంతలోనే పచ్చికదాటి రాళ్ళమీద బూట్లు టకటకలాడించుకొంటూ పరుగెత్తిపోయాడు.

ఆవేళ మధ్యాహ్నం ఫలహారాలవేళ, జీన్ ఆ సాయంత్రమే పారిస్ వెళ్తాన్నానని, ఆఫీసువాళ్లు రమ్మన్నారనీ చెప్పేశాడు. "వెళ్తున్నావా! అప్పుడే! మరి నువ్వనటం...ఇంకా ఇప్పుడే కాదా వచ్చావ్"అంటూ ఆత్రంగా బతిమాల్తూ ఇంటిల్లిపాతీ అడుగుతున్నారు. కాని, ఇంక ఈ ఇంట్లో ఉండలేడు. శాఫోదుష్ప్రభావం, ఆ వ్యామోహ కశ్మలం, తనను, తన బంధువులప్రేమనుంచి విడదీసేసింది. అదీ కాక, ఆమెతో నివసించకుండా ఉండటంలో, వాళ్ళకోసం తనుచేయగల మహాత్యాగం అంతా చేసెయ్యనే చేసేశాడు కదా? ఇకపూర్తిగా విడిపడిపోవటంకూడా తర్వాత ఎప్పుడో జరుగుతుంది. ఆ తర్వాతే ఇక్కడికివచ్చి, ఈ అమాయిక సజ్జనుల నందరినీ, సిగ్గుగాని చీకాకుగాని లేకుండా, కౌగిలించుకో గలుగుతాడు.

అన్నకొడుకును అవిగ్నన్ స్టేషనులో రైలెక్కించి, సీజేర్ బాబాయి ఇంటికి వచ్చేటప్పటికి

చాలారాత్రిపడి, దీపాలన్నీ ఆరిపోయి ఇల్లంతా నిశ్శబ్దంగా నిద్రపోతోంది. గుత్తాలను కట్టేసి గిగ్గిళ్లు పెట్టాడు. వానావంగుడూ రాదుకదా అన్నట్లు, కర్షక సైజస్వభావంతో, ఒకసారి ఆకాశంవంక చూశాడు. ఇక ఇంట్లోకి రాబోతూంటే ముందు చప్పరంమీద ఒక దిమ్మమీద కూర్చున్న వ్యక్తిఆకారం కనబడింది.

"ఎవరు! దివోనీ?" అని అడిగాడు.

"నే నే! నీకోసమే కాసుక్కూర్చున్నా" అంది.

రోజంతా ఆవిడకు పని ఊపిరి సల్పకుండా ఉంటుంది. తన ప్రియస్వామితో మాట్లాడేందుకే ఆమెకు పగలు తీరిక చిక్కదు. అందుకని ఇల్లాగే రాత్రిళ్లు ఇద్దరూ కలుసుకొని, ఆ కబురూ, ఈకబురూ చెప్పుకొంటూ తోటమట్టూ ఒకసారి తిరిగివస్తారు. ఆరోజు ఆమెకు జీన్‌కూ మధ్య జరిగిన ఘట్టమే కారణమో (ఆ విషయం ఎంతో ఆలోచించింది. చాలామటుకు అర్థమూ చేసికొంది. ఆ అర్థం ఆవిడ మనస్సుకు హితవుగా లేదు.) లేదా రోగిష్టిమనిషి రోజంతా కన్నీళ్లు పెట్టుకొని పడుకొంటే వచ్చిన అలజడివల్లో, ఆమె కంఠం ఏదో బరువుగా బాధాకరంగా ఉంది. మామూలుగా, నిండుగా, చాలాశాంతంగా, ఆత్మనర్మ నిర్వహణం మూర్తీభవించినట్లు, నెమ్మదిగా కనబడే దివోనీ ఏదో మనోవ్యధతో కలగిపోయినట్లు కనబడుతూంది.

'అబ్బాయి ఎందుకు వెళ్ళిపోయాడో, అంత అకస్మాత్తుగా ఎందుకు బయలుదేరాడో ఏమన్నా తెలుసా?' అని అడిగింది. ఆఫీసువాళ్ళు తిరిగి రమ్మన్నారన్న జీన్‌మాటలు ఆమె నమ్మలేదు. తమ బిడ్డను కుటుంబంనుంచి దూరస్థంచేస్తూ అక్కడికి లాగేస్తూన్న దుష్ప్రభావం ఏదో ఉండిఉండాలని ఆమె అనుమానించింది. ఆ భీకర నగరంలో, పారిస్‌లో, ఎన్నెన్ని అపాయాలున్నాయి? మనిషి వినాశనానికి దోవతీసే దుర్మార్గాలెన్నిఉన్నాయో!

ఆవిడ దగ్గర సిజేర్ రహస్యం దాచలేదు. నిజానికి జీన్ జీవితంలో ఒక స్త్రీ ప్రవేశించిందని ఒప్పుకొన్నాడు. కాని ఆ మనిషి చాలా మంచిది. అతన్ని అతని ప్రియబంధువులనుంచి వేరు చెయ్యాలని కలలోనైనా అనుకోదు. అతనంటే ఆమె కెంత భక్తి తాత్పర్యాలున్నాయో చెప్పాడు. ఆవిడ వ్రాసే ఉత్తరాల మాధుర్యం వివరించాడు. ఆమెకూడా కష్టించి పనిచేయటానికి ఎల్లా సాహసించిందో అదంతా పొగడ్తూ చెప్పాడు. కాని కష్టించి పని చేయటం అంతిపొగడ్త అవసరంలేని సహజగుణంగానే ఆ పల్లెటి పడుచుకు తోచింది. "ఏమైనా, మనుష్యులు బ్రతకాలంటే ఏదో పనిచేసుకోవద్దా" అంది.

"ఉహూ! అల్లాంటిస్త్రీ కాదు!" అన్నాడు సిజేర్. "అయితే ఎవర్తో చెడిపెతోనా జీన్ ఉంటూంది! అక్కడికేనా నువ్వు వెళ్ళింది?"

"ఒట్టేసి చెపుతున్నాను. దివోనీ, వీడిని ఎరిగున్నప్పటినుంచి ఆవిడికన్న మర్యాదస్థురాలుగాని, పతివ్రతగానీ, మరెవరూ లేరనుకో, ప్రేమ ఆస్త్రీని పునీతురాల్ని చేసింది."

ఈ పెద్ద పెద్ద కబుర్లూ ఈ ధోరణీ దివోనీకి అర్థంకావు. ఆవిడకు తెలిసిందొక్కటే. జీన్ ఉంచుకొన్న స్త్రీ, సంఘబహిష్కృతురాలు. అల్లాంటి వాళ్ళను "కులట"లనే తను అంటుంది. తన బిడ్డ జీన్, అల్లాంటి ఆడదాని ఉచ్చులోపడి దానికి ఎర అయిపోతున్నాడంటే ఆవిడకు కోపం ముంచుకొచ్చింది. కౌన్సల్‌గారికి ఈ విషయం ఆమాత్రమైనా తెలిస్తే, ఇంకేమన్నా ఉందీ!

సిజేర్ ఆవిడను శాంతింపచేయటానికి శాయశక్తులా ప్రయత్నించాడు. అబ్బాయి ఈడున ఉన్న కుఱ్ఱవాడెవడూ ఆడది లేకుండా ఉండలేడని బుంగమూగం ముడతలు పడేసుకొంటూ, నచ్చచెప్ప చూచాడు.

"అల్లా అయితే, అబ్బాయి పెళ్లే చేసుకోరాదా!" అంటూ హృదయవిదారకమైన అమాయకత్వంతో అడిగింది.

"అసలు సంగతి ఏమిటంటే, ఇప్పుడు వాళ్లిద్దరూ కలిసిలేరు. అల్లాంటివాట్లల్లో ఎప్పుడూ అంతే" అన్నాడు సిజేర్.

దివోనీ తీవ్రంగా అంది. "చూడు, సిజేర్. మనవాళ్లు చెప్పే సామెత నీకు తెలుసుకదా! దురదృష్టాన్ని తీసుకొచ్చినవాడికంటే, ఆ దురదృష్టం ఎక్కువకాలం తిష్ట వేసుకుంటుందంటారు. నువ్వు చెప్పిందే నిజమయి, జీన్ ఆ అమ్మిని బురదలోనుంచి పైకితీసుకొచ్చాడంటే, ఆ పరిశ్రమకు తగ్గ ఫలితంగా అతని కీబురదఅంటే ఉంటుంది. నిజంగా కూడా ఆ మనిషిని అంతికన్నా మంచిదాన్ని, మర్యాదస్థురాలినీ చేసే ఉండవచ్చు. కాని ఆ మనిషిలోని చెడుతనం, మన పిల్లడిహృదయంలో కెక్కలేదని ఏమిటి నమ్మకం."

ఇద్దరూ వెనక్కి నడిచివచ్చి ఇంటిముందు చప్పరం కేసి కదిలారు. రాత్రి, మబ్బు మసకలేమీ లేకుండా, శాంతంగా, ఆ నిద్రపోతున్న కోన

కోనంతా ఆవరించుకొన్నట్లుంది. అమిత వేగంతో ప్రవహిస్తూన్న నదీ, అక్కడ నదిమీద మిలమిలా జారిపోతూన్న వెన్నెల వెలుగూ, అక్కడక్కడ వెండి తళుకుతో మెరుస్తున్న నీటిగుంటలు, ఇవే కాస్తమేలుకొని ఉన్నట్లున్నాయి. ప్రపంచానికి దూరంగా, వికలలూ లేని సుఖనిద్రలో మునిగున్నట్టున్న ఆ ప్రశాంత వాతావరణాన్ని గాఢంగా ఆశ్వాసిస్తూ నిలిచారు. ఇంతలో రోన్ నదిప్రక్కని కొండ ఎక్కుతూ ఆవిరి బలం అంతటితోటీ గట్టిగా రొప్పు కొంటూ వస్తూన్నట్లున్న రైలుమోత వినబడింది.

పల్లెటి జనం అందరూ శపించే పరమశత్రువైన నగరం దిక్కుకు తిరిగి, పిడికిలి బిగించి అదిలిస్తూ "ఆ! ఆ ఊరు, పారిస్, పారిస్! ఎన్ని ఎన్ని ఎన్ని దీని కర్పించుకొంటున్నాం! మా మొగాన తిరిగి ఎంత తుక్కుపారేస్తుందో తలచుకొంటే!" అంది దివోనే.

# 7

ఒక నడిశీతాకాలంనాటి సాయంత్రం, నాలుగు గంటలవేళ—పొగమంచు అంతటా క్రమ్మి పారిస్ అంతా మసకమసకగా, గుబులుగుబులుగా ఉంది. పారిస్‌లో పెద్దరాస్తా ఛాంప్స్ ఎలీసిస్ కూడా, అంతటి సందడితో బళ్ళు హడావిడిగా పోతున్నా, బళ్ళచక్రాల చప్పుళ్ళు, దూదిగుట్టల లోంచి వస్తున్నట్లు నొక్కుకుపోయి ఘన్నగా వినబడ్తూ ఓక్కు ఓక్కు మనిపిస్తూనే ఉంది. జీన్ ఒక చిన్నతోటగేటుముందర ఆగాడు. గేటు తలుపు తీసే ఉంది. ఇటూ అటూ పెద్ద భవనాలమధ్యలో మరుగుపడి కలిసిపోయినట్టున్న ఒక చిన్న మేడముందర చిన్నితోట. కాస్త సుఖసంపత్తులతో విరాజిల్లుతున్న ఇల్లులాగే ఉంది. ఆ మసకవెల్తురులో ఇంటిమీద చెక్కిన గిలాబు అక్షరాలు అతికష్టంమీద చదవగలిగాడు. "కుటుంబవసతిగృహము-అన్ని హంగులూ అమర్చిన వాటాలు" అని వ్రాసి ఉంది. గుమ్మం దగ్గిరే రోడ్డుమీద, ఒక గుఱ్ఱాల సార్టు నిలబడి ఉంది.

కచేరీచావడి తలుపు తోసుకొని లోపలికి అడుగెట్టటంలోనే తనకు కావలసినస్త్రీని చూశాడు. వెలుగు కనబడేందుకు కిటికీకి దగ్గిరగా కూర్చుని, ఒక పెద్ద అక్కౌంటు పుస్తకం పేజీలు తిరగేస్తూంది. ఎదురుగా, శుభ్రమైనదుస్తుల్లో ఉన్న మరొక పొడుగాటిస్త్రీ, చేతుల్లో జేబురుమాలుతో, ప్రక్కనే ఒకచిన్న సంచీ పెట్టుకొని, కూర్చుని ఉంది.

"దయచెయ్యండి, తమకుఏంకావాలి," అంటూ ఫానీ, ఇంతలోఅతన్ని గుర్తించి, తడబడుతూన్న చూపులతో, రెండవస్త్రీదగ్గిరకు చుట్టివెళ్తూ, ఆమెతో "నావాడు" అని గొణిగింది. ఆస్త్రీ విస్పృతానుభవదత్తమైనఅద్భుతనిదానంతో అతన్ని నఖశిఖపర్యంతం ఎగాదిగాచూచి, బిగ్గరగా, "ఒకళ్ళనొకళ్లు ముద్దెట్టుకోండి—నేను చూడటం లేదులే" అంది. అని, ఫానీ చోటులోకిపోయి కూర్చుని లెఖ్ఖలు తనిఖీచేసుకోటంలో నిమగ్నమైపోయింది.

ఒకళ్లచేతు లొకళ్లు పట్టుకొని కూర్చుని, అర్థం లేని సగంసగం వాక్యాలు, గుసగుసలాడుకొంటూ కూర్చున్నారు. "ఎల్లా ఉన్నావ్!" "ఉన్నాను ఏదో ఫరవాలేదు"—"నిన్న రాత్రి బయలుదేరావా?" వాళ్ళ కంఠస్వరాలలోని మార్పు, ఆ మాటల యథార్థ భావాలను స్ఫురింపచేస్తోంది. ఆ సోఫాలో చేరగిలి కూర్చుని కొంసేపటికి ఇద్దరూ, నెమ్మదిగా మన స్వాస్థ్యం చేకూర్చుకొన్నారు.

ఫానీ అతని చెవిలో నెమ్మదిగా అడిగింది. "నా యజమానురాలును గుర్తుపట్టలా! జ్ఞాపకం లేదూ? డెషిలెట్ ఇంటి విందులో చూశావ్, స్పానిష్ పెళ్ళికూతురువేషంలో! కొంచెం వాడిపోయిన పెళ్ళికూతురులాగే ఉందిలే."

"ఓహో! ఆ..."

"రోజారియో శాంచి, డీపాట్టర్ ప్రియురాలు!"

రోజారియో — అసలు పేరు రోజా. అర్ధరాత్రుల్లు తెరిచి ఉంచే పారిస్ చీకిలి హోటళ్ల అద్దాలమీద ఆపేరు గీసి ఉంచేది. పేరుకు ముందో, వెనుకో ఒకబూతుపదం ఎప్పుడూ కనబడేది—రోజా, హిప్పోడ్రోమ్‌లో, సర్కస్‌లో గుర్రపు రౌతుగా ఫీట్సు చేస్తూండేది. బాజారీ శృంగార ప్రపంచంలో ఆవిడకు మంచి పేరుప్రఖ్యాతులున్నాయి. ఏమాత్రం సిగ్గూ బిడియంలేని మగరాయుడుగా పేరు తెచ్చుకొంది. నోరు తెరిచిందంటే పచ్చిబూతులని అడలు. ఆ చేతిలో కొరడా కూడా అంత జోరుగానే వాడేది. ఆ జోరుకే, సర్కస్‌లో పురుషులు వ్యామోహితులై ఆమెవెంటబడేవారు. అమనుష్యులనూ గుఱ్ఱాలతోనే జతకట్టి కొరడాతో అకట్టి ఉంచేది.

ఓరాన్‌లో జన్మించింది. స్పానియార్డ్ యువతి. మొగంలో పెద్ద చక్కదనం లేకపోయినా కొంత నేత్రపర్వంగానే ఉండేది. ఇప్పటికీ కొస్త అనుకూలపరిసరాల్లో, ఆ నల్లని సుంద్రటికళ్ళూ, నొసట కలిసిపోయి ఏకరేఖగా ఉన్న ఆ కనుబొమలూ,

శృంగారంగా కదల్చి, ఆకర్షణ కల్పించ గల చేవ ఆమెలో ఉన్నట్లే ఉంది.

కాని ఈ గది వికృతపు వెలుగులో, ఏభైయేళ్ళ యీడూ పూర్తిగా మనిషిలో కనబడుతూంది. మొగం బండగా మొద్దుబారి, మొటిమలతో నిండి, పచ్చని రంగులో, నిమ్మపండు తోలులా ఉంది. ఫానీ లిగ్రాండ్‌కు ఆమెకు చాలా ఏళ్లనించీ స్నేహం ఉంది. ఫానీ ప్రేమకలాపాలన్నిటా, ఫానీకి వత్తాసు ఉంటూనే వచ్చింది. ఆమె పేరు చెప్తే చాలు, గాసిన్ ఘోరంగా కంపించిపోతాడు.

అతని చేతులు వణకటంలో అంతరార్థం గ్రహించింది ఫానీ. వెంటనే అతన్ని సమాధానపరచ ప్రయత్నించింది. పనికావాలంటూ, తను ఎవరి దగ్గరకు వెళ్లగలదు? నిజంగాకూడా చాలా ఇబ్బందులలో మునిగిపోయి ఉంది. అదీ కాకుండా, ఇప్పుడు రోజా అన్ని వ్యాసంగాలూ సంక్షేపించుకొంది. ఆమెకేం భాగ్యవంతురాలు! చాలా భాగ్యం ఉంది. అవిన్యూ డి విల్లీయర్స్‌లో ఆవిడ స్వంత హోటల్‌లోనో లేక పల్లెటిదిక్కున ఎన్‌ఘీన్‌లో ఆవిడ స్వంతవిల్లా, (భవనం) లోనో ఉంటూ గడుపుతూ ఉంటుంది. ఎవరో కొద్దిమంది పూర్వమిత్రులనుమాత్రమే చూస్తూ ఉంటుంది. కాని ఒక్కణ్ణి మాత్రమే, ఎప్పుడూ ఆ ఒక్కణ్ణే ప్రేమికునిగా దరిచేరనిస్తుంది. ఆ వాగ్గేయకారుణ్ణొ తణ్ణిమాత్రమే!

“డి పాట్టర్, నా? అతనికి పెళ్ళాం వుందనుకొన్నాను” అన్నాడు జీన్.

“ఔను, పెళ్ళి అయింది. పెళ్లాం, బిడ్డలూ కూడాఉన్నారు. పెళ్ళాంకూడా బాగానే ఉంటుందంటారు. కాని తన పూర్వప్రేయసిదగ్గిరకు రావటానికి అవేవీ అతనికి అడ్డు తగల్లేదు. ఇంక ఈమనిషి వాణ్ణెలాటిమాటలంటుందో చూశావు కాదు! వాణ్ణెంత నీచంగా చూస్తుందనీ! పాపం ఆ పిచ్చివాడు, మహా చెడ్డస్థితిలో పడిపోయాడు!” అని అతిమృదువుగా జీన్ చేయిపట్టుకొని, ఇన్నాళ్ళూ తన్నిల్లా చేసినందుకు అతిమృదువుగా ఆప్యాయంతో అతన్ని మందలిస్తూంది.

ఇంతలో ఆ రెండో స్త్రీ అక్కౌంటు పుస్తకాలు చూడటం ఆపి, ప్రక్కనున్న సంచీకేసి దృష్టి మరల్చింది. పట్టుతొడుగు చివర ఆ సంచీ దానంతట అదే ఎగురుతూంది. ఆమె సంచీవంక చూస్తూ, “ఏయ్! ఊర్కోమంటంలే! వినబడుతూందా” అనిఇటుతిరిగి, ఫానీతో ఆజ్ఞా స్వరంలో “ఇదిగో, బిచిటోకి పెట్టటానికి పటిక బెల్లం ముక్కొకటి తెచ్చిపెట్టు” అంది.

ఫానీ లేచి కలకండ తీసుకువచ్చి సంచీ మూతిదగ్గర పెట్టి, “బాబూ, తల్లీ” అంటూ పిల్లడినితిండి తినిపించటానికి బ్రతిమాలుతూన్నట్లు బుజ్జగిస్తోంది. ప్రియురాలివంక తిరిగి, “ఈ పెంపుడు జంతువుచూశావా” అంటూ సంచీలోనుంచి ఒక వికృతమైన ఊసరవిల్లిని తీసి చూపించింది. తల చర్మం బిరుసుదేరి నెత్తిమీద చూడం, కవచంలా బొరుసుకట్టి ఉంది. ఒళ్లు కంపిస్తున్న మాంసశకలంలా జిగటలు సాగుతూ, చుట్టూ దూదితొడుగుతో ఉంది. ఈ ఊసరవిల్లిని అల్జీరియా నుంచి ఎవరో రోజాకు పంపించారు. ఈ పారిస్ చలిలో చచ్చిపోకుండా దానికి వెచ్చగా దూదిచుట్టి, నిత్యం కనిపెట్టిచూస్తూ, ఆవిడ దాన్ని కాపాడుకొస్తూంది. దాన్ని ప్రేమించినంతగా ఆ మనిషి ఏనాడూ ఏ పురుషుణ్ణీకూడా ప్రేమించి ఉండలేదు. ఇక ఫానీ దానివిషయంలో చూపిస్తున్న మెరమెచ్చులు, ఆ ఇచ్చకాలు, బుజ్జగింపులూ అన్నీ చూసి, ఆ ఇంట్లో ఆ వికృత కీటకానికున్నస్థానమెంత గొప్పదో జీన్ గ్రహించగలిగాడు.

ఆ స్త్రీ పుస్తకాలుమూసి బైటికి బయలుదేరటానికి సిద్ధమయింది. “మొదటి నెలే, అని చూసుకొంటే ఈ చివరి పదిహేనురోజులూ అంత ఫర్వాలేదనే అనుకోవచ్చును. అయినా కొవ్వొత్తులు కాస్త కనిపెట్టిచూస్తూ ఉండు” అంది.

అని, ఒక్కసారి ఆ చిన్నగది అంతా, యాజమాన్యపుదృష్టితో కలయచూచింది. మెత్తమెత్తని దిళ్లసోఫాలు, కుర్చీలతో, గది శుభ్రంగా, అందంగానే ఉంది. ఆమె తన ప్రక్కనున్న చిన్నబల్లమీద పూలమొక్కమీది దుమ్ము ఊది, గదిమధ్యన లేసు తెరలలోకంత ఉందని వేలితో చూపించింది. ఆ పరిశీలనలన్నీ పూర్తిచేసికొని వాళ్లిద్దరివంకా సాభిప్రాయంగా చూసి అంది.

“ఇదిగో, పిల్లలూ, ఇక్కడేం అవకతవకపనులు పనికిరావు, తెలుసా! ఇది చాలా మర్యాదగలప్రదేశం” అని బైటికి పోయి, గుమ్మంబైట వేచిఉన్న గుఱ్ఱపు బగ్గీ ఎక్కి తన నిత్య సాయంవాహ్యాళికి బయలుదేరిపోయింది.

“అబ్బ, చిరాకెత్తటంలేదూ! ఈ విడో, ఈవిడ తల్లో ఇల్లా వారానికి రెండుమాట్లు, నా నెత్తిమీద పడతారు. ఆతల్లి ఇంతకన్నా అధ్వాన్నం; నీచంకూడా! చూడు, ఇల్లాటికూపంలో బ్రతకగల్గుతున్నానంటే, నిన్ను ఎంత ప్రేమించి ఉండాలో తెలియటంలేదా! ఏమయితేం, ఇప్పుడిక్కడికొచ్చావ్ గదా! నాకింక నువ్వే ఉన్నావ్! ఎంత భయమేసిందనుకొన్నావ్...” అంటూ నుల్చున్న

పళ్ళాన్నే అతని మెడచుట్టూ చేతులు గీలించి, అతన్ని గాఢంగా కౌగిలించుకొని ముద్దు పెట్టుకొంటూ చాలాసేపు అల్లాగే నిలిచింది. ఆ ముద్దులోని తీవ్ర ప్రకంపనం అతనింకా పూర్తిగా తనవాడేనని ఆమెకు ధైర్యమిస్తూంది. బైట వరండాలో జనం వస్తూపోతూ ఉండటంవల్ల వాళ్లు జాగ్రత్తపడాల్సి వచ్చింది. గదిలోకి దీపం తేగానే తన మామూలుచోట అల్లికసూదులు చేతుల్లో త్రిప్పుకొంటూ కూర్చుంది. ఆమెకు దగ్గరలోనే, ఎవరో చూడటానికి వచ్చినవానిలా, అతను విడిగా కూర్చున్నాడు.

"ఏం! నేనేమన్నా మారిపోయానా! నాలాగే అనిపిస్తున్నానా నీకు" అని అడుగుతూ చిరునవ్వునవ్వి, తను క్రోషానూదులు ఎంత అస్తవ్యస్తంగా పట్టుకొందో అతనికి చూపిస్తూంది. ఆమె కెప్పుడూ అల్లికపని అంటే అసహ్యమే. ఏదో పుస్తకం చదువుకొంటూనో, పియానో వాయించుకొంటూనో, లేక చేతులగౌను పైకి మడుచుకొని అతనికేదైనా పిండివంటలు వండిపెట్టూనో కాలం గడిపేది. అల్లాంటి కాలక్షేపాలే ఆమెకు నచ్చేవి. కాని ఇక్కడ ఆపనులేం చేస్తుంది? అస్తమానం ఆఫీసుగదిలో కూర్చోవలసి రావటంవల్ల వెనుకగదిలో ఉన్న పియానోమీద చెయ్యివేసేందుకే కుదరదు. ఇక్కడ సిగరెట్టు నిషేధం. ఇంక వాటికి బదులు ఈ అల్లికపని అంటూ ఒకటి పెట్టుకొంది. చేతులు ఏదో పనిలో మునిగి ఉంటాయి. ఆలోచించుకోనేందుకు కావలసినంత తీరుబడీ ఉంటుంది. తన కింత అసహ్యంగా కనిపించే ఈ అల్లికపని ఆడవాళ్లు ఇంతమంది ఎందుకు చేపట్టారో, ఇప్పుడామెకు తెలిసి వచ్చింది.

దారం క్రోషానూదితో పట్టటం సరిగ్గా చేతకాక, నేర్చుకొంటూన్న పసిపిల్లలాగే అల్లికమీదికి ముందుకు వంగి కూర్చుని ఏకాగ్రతతో ప్రయత్నిస్తూంది. జీన్ ఆమెవంక చూశాడు. దుస్తులు అతి సాధారణంగా నీటుగా ఉన్నాయి. మెడదగ్గిర చిన్న కాలరు బిగుతుగా మడతలులేక ఇస్త్రీ చేసి ఉంది. తీర్చి దిద్దినట్టున్న ఆ గుండ్రనితలమీద జుట్టు మెత్తగా నున్నగా వెనక్కు దువ్వి ఉంది. ఆ రూపంఅంతా, చాలా ఒద్దికగా, తగిన గరువతనంతో, అతి మర్యాదాస్పదంగా ఉన్నట్లుండి, అతనికి ఎంతో మనశ్శాంతి నిస్తూన్నట్లుంది. బైట వీధుల్లో భోగభాగ్యాలాలసలై, సర్వాలంకారభూషితలై, వేశ్యాశిఖామణులు జోడుగుఱ్ఱాల సార్టులలో నిక్కి కూర్చుని వైభవంగా ఒకరి తర్వాత ఒకరు వరుసగా పారిస్ విలాసవీధులకేసి పోతున్నారు. తానూ ఒక నాడనుభవించి, అతనికోసం విసర్జించిన ఆ భోగభాగ్యాలకోసంగాని, ఆ పాప వృత్తివైభవానికిగాని, ఫాన్నీ ఈషణ్మాత్రమైనా పరివేదన మనుభవిస్తూన్నట్లే కనబడలేదు.

అప్పుడప్పుడు తనను చూస్తూ ఉండటం మాత్రానికి అతను ఒప్పుకొన్నంతకాలమూ ఈ బానిసజీవితంతోనే తృప్తిపడి, అందులోఉన్న కాస్త ఉల్లాసాన్ని గ్రహించి ఆనందించేందుకే ప్రయత్నిస్తుంది.

ఆ వసతిగృహంలో నివసిస్తూన్న వాళ్లందరికీ కూడా ఫాన్నీ అంటే చాలా యిష్టం. అక్కడి స్త్రీలంతా విదేశీయులు. వాళ్లకు అందచందాల విషయం రవ్వంతైనా తెలియదు. తము కొనుక్కోవలసిన దుస్తులవిషయం, నిత్యం ఫాన్నీనే సంప్రదించేవారు. పెరూవియన్ కుటుంబంవాళ్ల పెద్దపిల్లకు రోజూ ప్రొద్దున్న ఫాన్నీ సంగీత పాఠాలు నేర్పుతుంది. ఆ విదేశీయ పురుషులందరికీ, అక్కడేమేం పుస్తకాలు చదవాలో, ఏయే నాటకాలు చూడతగినవున్నాయో తెలిపే పండితురాలు ఆమే! ఆ మగవాళ్లంతా ఆమె నతిగౌరవ మర్యాదలతో చూస్తారు. అందరికన్న రెండో అంతస్థులోఉన్న డచ్ అతను మరీనీ! "అక్కడే అల్లాగే, నువ్వు కూర్చున్నట్లే కూర్చుని నావంకే తేరి పారచూస్తూ కూర్చుంటాడు. "నాకు ఏమీ తోచకుండా చేస్తున్నారండీ" అనేదాకా కూర్చుంటాడు. అప్పుడు "మంచి"దని వెళ్ళిపోతాడు. ఈ చిన్ని పగడాల బ్రూచ్ అతనే నా కిచ్చాడు. ఫ్రాంకుకన్నా ఎక్కువ ఖరీదుండదు. అతన్ని కాస్త ఊరుకోబెట్టామని పుచ్చుకొన్నాను."

ఒక వైయిటర్ పళ్లెంలో, ఉన్న భోజనపదార్థాలన్నీ పెట్టుకొనివచ్చి అక్కడి చిన్న టేబిల్ మీద పళ్లెం ఆనించి, పూలకుండను ఒకమూలకు నెట్టి పళ్లెం బల్లమీదికి సర్దాడు. "ఇక్కడే నా భోజనం, యజమానురాలి భోజనం టైమ్‌కు ఒక గంటముందుగా ఇక్కడే ఒంటరిగా భోంచేస్తాను." అంటూ పళ్లెంలో రెండు ప్లేట్లకేసి చూపించింది. మేనేజరెస్‌కు హోటలువాళ్లిచ్చే భోజనం అంతే. పూటకు రెండు ప్లేట్లూ, రసమూ ఇస్తారు. "రోజారియో పీనాసితనం వదులుకోలేదు, తెలుసా! అయినా నాకిక్కడే ఇల్లా ఒంటరిగా భోంచెయ్యటమే బాగుంటుంది. ఎవళ్ళతోటీ మాట్లాడక్కరలేదు. నీ ఉత్తరాలే చదువుకొంటూ భోంచేస్తాను. వాట్లతోటే చక్కగా కాలం గడుస్తుంది."

టేబిల్ క్లాతూ, తువ్వాలూ తెచ్చుకోనేందుకు ఆమె యింతలో లేవవలసివచ్చింది. పొడుగునా ఆవిడ ఏదో పనిమీద లేవవలసే వస్తూంది. ఏదో బీర్వా తియ్యటానికో, ఎవళ్ళకో ఏదో పని చెప్ప

టానికో, ఎవళ్ళో ఏదో సరిగ్గా లేదంటే చూసి రావటానికో వెళ్ళాల్సి వస్తుంది. ఇంక ఆగితే ఆవిడపనులకు అభ్యంతరంగా ఉంటానని గ్రహించాడు జీన్.

ఇంతలో ఆమె భోజనం వచ్చింది. ఒక చిన్న గిన్నెలో వేడివేడి రసం, ఆవిరులు గ్రక్కుతూంది ఆ కొత్త రసమూ, ఆ తిండీ, చూసేటప్పటికే ఇద్దరికీ తాము తమయింట భోజనాలకు కూర్చున్న సంగతులన్నీ జ్ఞాపకంవచ్చి నిర్వేదం కల్గింది.

అతన్ని పంపిస్తూ "ఆదివారందాకా—ఆదివారం!" అంటూ రహస్యంగా అతని చెవిలో గొణిగింది. అక్కడ నౌకర్లముందరా, మెట్లు దిగుతూన్న జనం మధ్యా, ఇద్దరూ ముద్దుపెట్టుకోనేందుకు వీలు లేకపోయింది. అతని చేయితీసుకొని తన గుండెల కానించుకొంటూ, ఆ స్పర్శను హృదయంలో నిక్షిప్తమొనర్చుకొంటూన్నట్లు గట్టిగా నొక్కుకొంది.

ఆ సాయంత్రమూ, ఆ రాత్రీ, అంతా ఆమెను గురించే ఆలోచిస్తున్నాడు. ఆముండకీ, దాని కొవ్విన తొండకీ, నీచపుబానిసత్వం చేస్తూ మగ్గుతూన్న ఆమె దీనస్థితిని తలచుకొని బాధపడ్డాడు. డచ్చివాని విషయంకూడా మనస్సును కొంత కలచింది. ఆదివారందాకా ఆగటం గగనంగా ఉంది. ముందు చేసుకోగల తెగతెంపులు భీభత్సంగా తయారవక్కరలేకుండా సులభమైన రాజమార్గం ఏర్పరుస్తుందనిపించిన, ఈ కలహమూ, వియోగమూ-అనుకొన్న రీతిగా కాకుండా ఎదురుతిరిగింది. వడిలిపోతూన్న చెట్టు ఎండుకొమ్మలనునరికేస్తే, చెట్టు మళ్ళీ కొత్తగా చిగిర్చి, చేవ అందుకొన్నట్లు, ఈ ప్రణయబంధం మరింత గాఢమయింది. ఒకళ్ళకొకళ్లు, విప్రలంభ ప్రేమికులలాగా, రోజూరోజూ ప్రణయలేఖలు వ్రాసుకొనేవారు లేదా ఒక్కొక్కనాడు, మినిస్ట్రీఆఫీసులో పని అయిపోగానే, ఫాన్నీ హోటల్ ఆఫీసుకు అతను వెళ్ళేవాడు. ఆమె అల్లిక అల్లుకుంటూ కూర్చుంటే ప్రక్కనే ఆమెతో శాంతంగా కబుర్లు చెప్పుకొంటూ కూర్చునేవాడు.

వసతిగృహంలో తక్కిన నివాసులందరికీ, తన "బంధువంటూ" అతన్ని పరిచయం చేసింది. ఆ అనిర్ణీత "బంధుత్వ" విశేషణాచ్ఛాదంలోనే ఒక్కొక్కసాయంత్రమంతా ఆవిడ ఆఫీసుగదిలోనే కూర్చుండిపోయి, పారిస్ నగరానికి వేలమైళ్ళ దూరంలో ఉన్నట్టు శాంతంగా ఉండిపోయేవాడు.

పెరూవియన్ కుటుంబం, వాళ్ళ గంపెడు బిడ్డలూ, అందరితోటీ పరిచయం చేసుకోకతప్పలేదు. కొట్టవచ్చినట్టున్న పక్కా రంగుల బట్టలూ వాళ్ళూ గదినిండా, చెట్టుకొమ్మలనిండా పిట్టలుకూర్చున్నట్లు, గలభాగా కూర్చుని ఉండేవారు.

ఫ్రాలిన్ మిన్నా వోజెల్ వాయిద్యంవిన్నాడు. ఆవిడ జంత్రం మట్టూ, రిబ్బన్లు చుట్టి ఉంచేది. ఆవిడ జబ్బు తమ్ముడినీ చూశాడు. నీరసంవల్ల దాదాపు కంఠం పూర్తిగా పోయిందేమో, ఆతగాడు అక్కగారు వాయిస్తూంటే నాగస్వరం ఊదుతున్నాననుకొంటూన్నట్లు వేళ్ళు నోటిముందర గాలిలో వాయించుకొంటూ, పాటకు తల తిప్పుతో తాళం వేస్తూ, గానంలో నిమగ్నుడైపోయేవాడు. (అతను నిజంగా సన్నాయి వాయించటానికి వైద్యులు అభ్యంతరం చెప్పారు) ఫాన్నీ చెప్పిన షెప్ మనిషితో పేకాట ఒకఆట ఆడాడు. ఆ డచ్చివాడు స్థూలకాయుడు. బట్టతల. మనిషి చాలా బండగా ఉంటాడు. అతగాడు సప్తసముద్రాలూ, సప్తద్వీపాలూ పర్యటించి వచ్చిన మహాపురుషుడు. ఈమధ్యనే ఆస్ట్రేలియా వెళ్ళి వచ్చాడు. ఆస్ట్రేలియావిషయం ఏదో కదిలించేటప్పటికి, గుక్కమిటకరి "మెల్బోర్న్‌లో బంగాళాదుంపలు ఎంత ఖరీదనుకొన్నారు?" అంటూ మొదలు పెట్టేవాడు. ఇంతటి భూప్రపంచ పర్యటన పర్యవసానంగా అతనికి తెలిసిందల్లా ఒక్కటే! తను తిరిగిన చోట్లల్లో, ఏయేదేశాల్లో బంగాళాదుంపలు ఖరీదు ఎంతెంతో మాత్రమే!

ఈ సమావేశాలన్నిటికీ ఫాన్నీయే ప్రాణం పోసేది. అందరితో కులాసాగా కబుర్లుచెప్తూ, పాటలు పాడుతూ, మంచి లోకజ్ఞురాలైన పారిస్ ప్రౌఢయువతిగా చలామణీ అయేది. కళాకారుల సాన్నిహిత్యాలలో గడపిన విశృంఖల జీవితచ్ఛాయ లేమైనా మిగిలి ఉన్నా ఈ విదేశీయుల కొ విభేదం ఏమీ తెలియక, అవన్నీ, పారిస్ కులస్త్రీల అచ్చపు లక్షణాలుగానే లెక్కకు తీసికొని గౌరవించేవారు. ఫ్రెంచి సాహిత్య కళారంగాలలో మహాపురుషులతో తన పరిచయాలను ఆమె వివరిస్తూ, వాళ్ళనుగురించి చెపుతూంటే, ఆ శ్రోతలంతా విభ్రాంతులైపోయి చెవులు దోరపెట్టుకొని వింటూండేవారు. రష్యన్ యువతికి డిజోయ్‌సవలిలంటే మహాభిమానం. అతను ఎల్లా రచన సాగించేవాడో, రాత్రిళ్లు ఎన్నెన్ని కప్పులు కాఫీ త్రాగేవాడో, అతని ఉత్తమనవల సెండెరిసెట్టెకీ ప్రచురణకర్తలు ఎంత స్వల్ప మొత్తం ఇచ్చారో, ఆ పుస్తకంతో వాళ్లెంత డబ్బు దోచుకోగలిగారో, అన్నీ ఫాన్నీ చెపుతూంటే, ఆ రష్యన్ యువతి, అతి ఔత్సుక్యంతో వింటూ కూర్చుండిపోయేది. తన ప్రియురాలు పొందుతున్న సాంఘిక మర్యాద కూడా గాసిన్‌కు ప్రీతిజనకంగానే ఉండేది. ఆ ఉల్లా

సంలో ఆమె మాటలు ఎవరన్నా శంకిస్తున్నారని తోస్తే తనకున్న పూర్వపు ఈర్ష్యలన్నీ మర్చిపోయి, ఆమె చెప్పింది నిజమనేందుకు సాక్ష్యంకూడా పలికి ఉండేవాడు.

ఇక్కడ ఈ ప్రశాంత వాతావరణంలో ఈ చిన్న గదిలో వసతిజనానికి అతిథిమర్యాదలన్నీ చూస్తూ, కూర్చున్న వారందరికీ ఒక్కొక్కరికీ టీ అందిస్తూ, ఆ ఆడపిల్లల పాటలకు తాళం కలుపుతూ, వాళ్ళకు పెద్ద అక్కగారిలాగా ఆదరణ వాత్సల్యాలు చూపిస్తూ అంతటి ఇల్లాలుగా కనిపిస్తున్న ఆవిడను చూస్తూంటే గాసిన్‌కు ఆమె అంటే గౌరవం కలిగేది. ఈ పరిస్థితుల్లో ఉన్న ఆమె రూపాన్ని—ఆదివారాల ప్రొద్దుట మంచువానలో తడిసి, ముద్దయి, వణకుతూ తన గదికివచ్చి ఆమె కోసమే పొయ్యి రాజేసిన నిప్పుదగ్గిర చలి కాచుకోటానికైనా ప్రయత్నించకుండా అడావుడిగా ఆ బట్టలన్నీ అటు విప్పి పారేసి, ఆ పెద్దమంచంమీద తన ప్రక్కకుజేర ఆత్రం చూపించే—ఆమెరూపంతో మనస్సులో ఊహించి పోల్చుకొంటూ, అనిర్వచనీయ రహస్యధామాధుర్య మనుభవిస్తూండేవాడు. అక్కడ ఏమిగాటపు కౌగిలింతలు! ఎంతటి దీర్ఘ ఆనందోన్మత్తతలు! ఏడురోజుల ఎడబాటుతో తీవ్రంగా ప్రజ్వలించిన మోహాన్ని తమ ప్రేమకు జీవమైన ఆ కాంక్షను కసిదీరా దీర్చుకొనేవారు.

ఒకగంటలో మరొకగంట ఇమిడిపోతూ అల్లాగే సాయంత్రందాకా ప్రక్కమీద పడుకొనే గడిపివేసేవారు. అంతకు మించిన ఇతరవాంఛలు, ఆనందాలూ ఏవీ, కోరుకోదగ్గవి, మురిపించేవీ, కనిపించేవే కావు. ఎవర్నీ చూడ నిచ్చగించేవారు కారు. హెట్టెమాలనుకూడా చూడాలనిపించేది కాదు. (హెట్టెమాలు, ఇంకా పొదుపుగా జీవితం గడుపుకోదలచుకొని, పారిస్ పరిసరాల పల్లెటిపట్టున నివసింపసాగారు) ప్రక్కనే చిన్న బల్లమీద ఇద్దరికీ భోజనం అమర్చి ఉండేది. వీధుల జనం సందడ్లూ, గుర్రపుబళ్ళ కూతలూ, ఆదివారపు సెలవు జనం సమ్మర్దమూ అంతా ఏదో లీలగా వినబడుతూండేవి. బాల్కనీ జింకురేకులమీద వాన జోరుగా మద్దెలలు వాయిస్తూండేది. ఆ హాయిలో సర్వప్రపంచాన్నీ మరిచిపోయి గుండెలు వేగంగా కొట్టుకొంటూ ఒకరి కౌగిలిలో ఒకరు ఆదమరిచి కాలాన్నీ, విశ్వాన్నీ సర్వాన్నీ మరిచిపోయి చీకటిపడేదాకా అల్లాగే ఉండిపోయేవారు.

వీధిలో గ్యాస్ లైట్లు వెలిగి, ఆ వెలుగు ఇంటి కప్పులోనుంచి బిక్కుబిక్కుమంటూ లోపలికి చిమ్మేది. ఇక ఇద్దరూ లేవక తప్పదు. ఫాన్నీ ఏడు గంటలకల్లా మళ్ళా పనిలోకి వెళ్ళిపోవాలి. ఆ పడక గది మసకవెలుతురులో మళ్ళీ లేచేటప్పటికి, ఆ నైరాశ్యమూ నిస్త్రాణా అంతా మళ్ళీ ఆమె నావరించుకొనేవి. ఇక్కడికి రాకపూర్వంకంటేకూడా మరింత బాధాకరంగా, బరువుగా అనిపించేది హృదయానికి. ప్రొద్దుటి మంచు తడి ఇంకా ఆరని ఆ తడి బూట్సులే అల్లాగే తొడుక్కొని, బీదస్త్రీలందరకు సాధారణమైన ఆ నల్లటి ఉద్యోగపు ఉడుపులే వేసుకొని, నీరసంగా తను పనిచేసేహోటలుకు బయలుదేరేది.

అన్నిటికన్న అక్కడ ఆ గదిలో తన సౌఖ్యానుభూతుల నాటి ఆ సామాన్లూ, ఆ చిన్న మేజా, అన్నీ చూస్తూన్నకొద్దీ ఆమె మనసుకు అంతకంతకు చేదు మింగుతూన్నట్లు బాధ కలిగి హృదయవిదారకంగా ఉండి అక్కడినుంచి కదలటానికే యమయాతనగా అనిపించేది. చివరి కెల్లాగో చింపుకొని బైటపడుతూ "పదా పోదాం" అంటూ బైటికి వచ్చేసేది. సాధ్యమైనంత ఎక్కువకాలం ఆవిడతోటే ఉండాలన్న కోరికలో అతనామెను హోటలుదాకా సాగనంపి వచ్చేవాడు. షాంప్స్ ఎలీసిస్ దోవంటే చెట్టపట్టాలేసుకొని ఒకళ్ళనొకళ్లు ఆనుకొని నడుచుకొంటూపోయేవారు. రోడ్డుకు రెండువైపులా ఉన్న వీధిలాంతర్లు రోడ్డు మలుపుతో ఆర్క్ డి ట్రియోంఫ్ కేసి తిరిగేవి. తాము ఆ చీకటిలోనే ఒంటరిగా ఒకరినొకరు ఆనుకొని, ఆకాశపు చీకటి తెరలలో మబ్బులమధ్య స్వల్పనీలిమములో తళతళలాడుతూన్న, ఒకటి రెండు నక్షత్రాల మినుకుమినుకుమన్న వెలుగు తోడుగా, ఆ చీకటిలో నడిచి పోతూండేవారు. రూ పెర్గోలీస్ సందు మొగకు వచ్చేటప్పటికి ఆమె హోటల్ పది అడుగుల్లో ఉండేది. ఆమె తన మేలిముసుగు తొలగించి అతనికి తుదిముద్దు ప్రసాదించి వెళ్ళిపోయేది. అకస్మాత్తుగా అతనికి పిచ్చెత్తిపోయినట్లుగా, తను దిక్కులేనిపక్షి అయిపోయినట్లుగా అనిపించేది. గదికి ఆలస్యంగా చేరుకొనేవాడు. తన దారిద్ర్యాన్ని నిందించుకొనేవాడు. కాసిలెట్ తన వాళ్ళందర్నీ తిట్టుకొనేవాడు. వాళ్ళకోసమే తను ఈ మహాత్యాగం చేయవలసి వచ్చిందిగదా అని దాదాపు వాళ్ళంటే ద్వేషంతో మండిపోతున్నట్లై అయిపోయేవాడు.

రెండుమూడు నెలలు ఈమాదిరిగా ఈడ్చుకొచ్చారు కాని ఇల్లాగ జీవితం గడపటం మరీ దుర్భరం అనిపించసాగింది. ఫాన్నీ హోటల్ నౌకర్లలో గుసగుసలు బయలుదేరేటప్పటికి జీన్ ఆ హోటలుకు తన రాకపోకలు తగ్గించుకోవలసి వచ్చింది. తన యజమానురాళ్ళ, తల్లీ కూతుళ్ళ, పీనాసితనం చూస్తూంటే ఫాన్నీకి అంతకంతకూ మండుకొని

రాసాగింది. వేరే ఎక్కడన్నా చిన్నగదిలో ఇద్దరు కలిసి నివసించాలని ఆమె లోలోన కాంక్షిస్తూంది. తన ప్రియునికికూడా ఈ పరిస్థితి దుర్భరంగానే ఉందనీ ఆమెకు తెలుసును. కాని అతనే ముందు బైటపడి ఆ ప్రస్తావన తేవాలని వేచి ఉంది.

* * *

ఏప్రిల్ నెలలో ఒక ఆదివారం నాడు ప్రొద్దున్న, ఫానీ మామూలుకంటేకూడా చక్కగా అలంకరించుకొని వచ్చింది. తలమీద హేటూ, ఒంటిని పల్చని వసంతకాలపు దుస్తులూ ధరించి ఉంది. దుస్తులు చాలా సాధారణపు ధరవే. ధర పెట్టి కొనేందుకు ఆమెదగ్గర డబ్బూ లేదు. కాని ఆ దుస్తులతీరు, ఆమె దేహసౌష్టవాన్ని ఆకారరేఖా సౌమ్యతను ఇనుమడింపచేస్తూ అందాన్నిస్తూంది.

"త్వరగా లే. ఇవాళ పల్లెటిపట్టున మనకు విందు"

"పల్లెటిపట్టునా!"

"ఔను, ఎంఘీన్‌పల్లెలో రోజామందిరంలో! మనిద్దర్నీ భోజనానికి పిలిచింది"

ముందు రానన్నాడు. కాని ఆమె బలవంతం చేసింది. పిలిచినప్పుడు వెళ్లకపోతే రోజా జన్మలో క్షమించదు. "నాకోసమన్నా నువ్వు రావాలి. నేను ఎంత భరించటంలేదుగనుకా!"

ఎన్ఘీన్‌పల్లెలో ఒక సరస్సు ప్రక్కనే ఆ భవనం. భవనం ముందుభాగం విశాలమైన పచ్చికస్థలంతో సరస్సు అంచుదాకా ఆక్రమించుకొని ఉంది. అక్కడ ఒక నౌకాగృహముంది. తెడ్లపడవలూ, చిన్న తెప్పలూ గట్టున కొయ్యలకి కట్టివేయబడి చెరువునీటి అలలకు మందంగా కదులుతున్నాయి.

భవనం చాలా పెద్దది. హాలు గోడలనిండా చూరుదాకా పొడుగుపాటి నిలువుటద్దాలు అమర్చి ఉన్నాయి. ఆ అద్దాలలోనూ, గోడల మెరుపులోనూ చుట్టూ తోటా, అప్పుడప్పుడే పుష్పిస్తున్న పూల మొక్కలూ, పచ్చని ఆవరణా, చెరువులో నీటి తళతళలూ అన్నీ ప్రతిబింబిస్తున్నాయి. నౌకర్లందరూ మంచిపకడైన డ్రెస్సులలో ఉన్నారు. ఆరామం దోవలుకూడా అతిశుభ్రంగా ఊడ్చి, ఎండుపుల్లయినా దోవలో లేకుండా నీటుగా ఉంచారు. ఆ శుభ్రత రోజారిమో, ఆవిడ తల్లి పిలార్ లిద్దరియాజమాన్య ప్రాశస్త్యాన్ని పొగడ్తున్నట్లుంది.

వీళ్ళిద్దరూ అక్కడికి వెళ్ళేటప్పటికి తక్కిన అందరూ భోజనాలకు సిద్ధంగా కూర్చుని వేచి ఉన్నారు. అక్కడికి రావటానికి దోవ తెలియక ఆ తోటల చెట్లబార్లమధ్య ద్రోవలు చుట్టి రావటంవల్ల వాళ్ళకు ఆలస్యమయింది. తమనందర్నీ ఇంతసేపు వాళ్ళకోసం కనిపెట్టుకొని కూర్చునేట్టు చేసినందుకు రోజేరిమోకు చాలా కోపం వచ్చింది. ఆ చిట్లుబుస్సు మొగంతోనే ఆమె వాళ్లనాహ్వానించేటప్పటికి జీన్‌కు అక్కడ ఉండటానికే మొగం చెల్లనట్లనిపించింది. అందుకు తోడు అక్కడ కూర్చున్న ముసలి తొక్కల విపరీతరూపాలు చూడడంతో మరీ దుర్భరమైపోయింది. రోజా బొంగురు గొంతుకతో వాళ్ళను జీన్‌కు పరిచయం చేసింది. ఆ ముగ్గురూ, శాకినీ ఢాకినీ యక్షిణీశక్తుల ముమ్మూర్తుల్లా ఉన్నారు. ముగ్గురూ 'కళావంతులు'. పారిస్‌లో బాగా ఎక్కువ వెల పుచ్చుకొనే భోగస్త్రీలు, తమ్ము "కళావంతులు" అని చెప్పుకోటం అలవాటు. ఆ ముగ్గురూ పురాతనపు లంజెలు. "ద్వితీయ సామ్రాజ్యపు" (నెపోలియన్ కుమారుని సామ్రాజ్య కాలం) రోజుల్లో, మహోజ్జ్వల వైభవంతో నలిగారు. ఆ రోజుల్లో వాళ్ళకున్న కీర్తి ప్రతిష్ఠలు, ఏ మహాకవికీ, దిగ్విజయాలొనర్చినా ఏ మహాసేనానికీ కూడా లేవు. అంతటి ప్రశస్తిగాంచిన పేర్లు— విల్కీ కాబ్, సోంబ్రూజ్, క్లారాడీఫన్.

ఆ "కళావంతుల" అలంకరణలూ, ఇప్పటికీ మహాసుతారంగానే ఉన్నాయి. అతి నవీనమైన విధానంలోనే వసంతకాలానుకూలమైన లేతరంగు పట్టు వలువలు ధరించారు. వాట్లనిండా జరీలూ లేసులూ, ఎక్కడికక్కడ రిబ్బన్లూ, అలంకరించి ఉన్నాయి. కాని మనుష్యులుమాత్రం ఎంత వడిలిపోయి, వగ్గలై, ముడతలుపడి ఉన్నారో! సోంబ్రూజ్‌కు కనురెప్పవెంట్రుకలే లేవు. క్రింద పెదవి వేలాడుతూంది. కళాకాంతులు లేకుండా తెల్లమొగం వేసుకొని కూర్చుని ఉంది. లా డీఫన్, కుళ్ళి విచ్చిన గుమ్మడికాయలా గరుసుబారిన స్థూల దేహంతో ఉంది. కాళ్ళదగ్గిర వెచ్చదనానికి వేడినీళ్ళ సీసా పెట్టుకొంది. కొంకిరలుపోయిన చేతివేళ్ళ అన్నిటా తళతళలాడ్తూన్న రాళ్ళ ఉంగరాలు కనబర్చుకొనేందుకు చేతులు బల్లమీద పరుచుకొని ఉంది. ఆ కొంకిరిపోయిన వేళ్లకు ఆ ఉంగరాలు పెట్టడం తియ్యటంకూడా సమస్యేనేమో అనిపిస్తుంది. కాబ్, మనిషి సన్నగానే ఉంది. కాని, ఆ సన్నని శరీరంవల్ల, నెత్తురూ కండా, లేకుండా డొక్కుపోయిన ఆ మొగం మరింత వికృతంగా కనిపిస్తూంది. నెత్తిమీది బొచ్చుకూడా ఎండుగడ్డి వెంటితాళ్లు పేనినట్లుంది. ఉన్నదంతా నాశనమయిపోగా, ఎల్లాగైనా డబ్బు చేసికోవాలన్న ఆర్తితో, మాంటికార్లో జూదాలకుపోయి, చివరిపణంగా ఉన్న కాస్తా ధార

పోసుకొని, చిల్లికానీ లేకుండా తిరిగి వచ్చింది. పైపెచ్చు అక్కడి జూదరులలో ఒక అందగాడిని మోహించి, వెంటబడ చూచింది. అతగాడు ఈమని షితో ఏవిధమైన సంబంధమూ పెట్టుకోకుండా తరిమి కొట్టేశాడు. అంతటితో రోజా ఆమెను తన రక్షణ లోకి తీసుకొని తిండి పడేస్తూ, తన దాతృత్వాన్ని ఘనంగా వల్లడించుకొంటూంది.

ఆ ముగ్గురూ ఫాన్నీ నెరుగుదురు. "ఏమే, అమ్మాయి, పరిస్థితులెల్లా ఉన్నాయి" అంటూ, కొస్త గడితేరినసానులు, పిల్ల భోగందా న్నాదరిస్తూన్న రీతిలో అడిగారు.

ఎన్నో మదనకదనాలలో ఆరితేరి, ఎన్నో విజయపతాకాలు ఏనాడో సంపాదించుకొని, ఈ భోగ వాతావరణ విపరీతపు కాంతులలో కామినీ ఘూతాలను తలపిస్తూన్న ఆ గడితేరిన వృద్ధసానుల మధ్య ఫాన్నీ, చిన్న బ్రూచ్ తప్ప ఇతరాభర ణాలు లేకుండా, ఆ చౌక దుస్తులలో, భోగపు వృత్తిలో కొత్తగా చేరిన పసిదానిలా కనబడు తూంది.

రోజా వృద్ధమాత పిలార్ కూడా అక్కడే ఉంది. సగం ఫ్రెంచిలోనూ, సగం "స్పానిష్" భాషలోనూ మాట్లాడుతూంది. తనకు తనే "కోతి" అని పేరు పెట్టుకొంది. ఒళ్ళంతా వదులుగా ముడ్డు బారిన తోలు వేలాడుతున్నట్లు ఆ రూపమూ, నిత్యం కొరకొరలాడ్తూ, కోపంతో ఇకిలిస్తూన్నట్లున్న ఆ మొగమూ, మొగవాడిలాగ క్రాపింగ్ చేసుకొన్న నెరిసిన జుట్టూ, అంతా అచ్చు పండు కోతిలాగే ఉంది.

"ఇంక చివరికి అందరికన్నా ముఖ్యులైన ఓ చిటో గారు" అంటూ రోజారియో, ఎఱ్ఱ బూర్నీసు గుడ్డలో చుట్టిపెట్టినట్లున్న తన పెంపుడుతొండను గాసిన్ కు పరిచయం చేసింది. ఆ తొండ ఆ గుడ్డ మాటలో నే వణికిపోతూంది.

"అరే! నా సంగతి ఏమిటి, నన్ను పరిచయం చేయవా" అంటూ తెచ్చిపెట్టుకొన్న ఉల్లాసంతో, ఒక స్థూలకాయుడు అడిగాడు. అతని మీసాలు గుబురుగా బొద్దుగా ఉన్నాయి. అతని దుస్తులు అతి నీటుగా, అతి సాంప్రదాయికంగా ఉన్నాయి.

"ఔనౌను. నిజమే. టాటావ్ సంగతేమిటి" అంటూ ఆడవాళ్లు గొల్లున నవ్వారు.

టాటాప్ ఎవరూ కాదు. మహా వాగ్గేయ కారుడు డీ పాటర్! అతని "క్లాడియా," "సావా నరోలా" గీతకావ్యాలు, చాలా ప్రఖ్యాతిలోకి వచ్చాయి. డెషిలెట్ ఇంటి విందులో, జీన్ అతన్ని ఒక్కసారి చూచాడు. ఈ మహాపురుషునిలో ఆనాటి సంతోషం ఏమాత్రమూ మొగంలో లేదు. మొగ మంతా గిటకబారిపోయి, ఏభావమూ బైట పెట్టని కొయ్యమొగంలా ఉంది. కళ్లు వాడిపోయిఉన్నాయి. ఈ బాజారి లంజ అంటే ఇరవైఏళ్లుగా పడిచస్తూ, ఆలుబిడ్డలను త్యజించి, వాగ్గేయకారుడుగా సంపా దించిన ధనరాసులన్నీ దాని కర్పణం చేసి, తన డబ్బు తోనే సంపాదించిన దాని ఈ ఇంట్లో నౌకరుకన్నా అథమంగా చూడబడ్తూ, దాని చీర చెఱగు పట్టుకొని ఇక్కడే వేలాడ్తున్నాడు. అంతులేని ఆ పిచ్చ వ్యామోహమంతా ఆ కన్నులలో కనబడ్తూంది. అతనేదో కథ చెప్పటం ప్రారంభించేటప్పటికి రోజా, అతి చిరాకుతో, అతన్ని మహా నీచంగా అదలిస్తూ, మాట్లాడె కూరుకోమని ఆజ్ఞాపించింది. అది చూసి జీన్ బిత్తరపోయాడు. ఇక వృద్ధ పిలార్ కూతురు కన్నా మిన్న అనిపిస్తూ నోరు ముయ్యరా, నా బుల్లోడా!" అంటూ అతన్నదిలిస్తూంది.

జీన్ ముసిల్దాని ప్రక్కనే కూర్చున్నాడు. నోరు చప్పరించుకొంటూ, గురకలు పెడ్తూ, పంది తింటూ న్నట్లు పదార్థాలు మెక్కుకుంటూ, మధ్యమధ్య జీన్ పళ్లెంకేసి, ఏమేమున్నవో అన్నట్లు ఆ ముసిల్ది ఆత్రంతో చూస్తుంటే, అతనికి ముళ్ళమీద కూర్చు న్నట్టుగా ఉంది. అసలే, రోజా అతి పెద్దరికంతో, ఫాన్నీని నికృష్టంగా చూస్తూ, హోటలులో ఆమె సాయంత్రపు సంగీతాలు, విదేశీయులు ఫాన్నీని, బ్రతికి చెడ్డకుటుంబపు ఇల్లాలనుకొని గౌరవించటం, ఆ విష యాలు ఎత్తి ఎత్తిపొడుస్తూ, వెటకారం చేస్తూంటే అతనికి బాధగా ఉంది. ఒకనాడు సర్కస్ రాణీగా వెలిగిన ఈ మనిషి, దొంపబారిన దేహంతో లావుగా, అసహ్యంగా కనబడుతూంది. రెండు చెవులా పదిపది వేల ఫ్రాంకుల విలువ గల వజ్రాలకమ్మలు వేలాడు తున్నాయి. ఈ యువ ప్రేమికుని సహచర్యంలో ఫాన్నీ పూర్వ యౌవన సౌందర్యాలను పునరుజ్జీవిత మొనర్చుకొన్నందుకు రోజా ఈర్ష్యపడుతూన్న ట్లనిపించింది. కానీ ఫాన్ని ఏమీ తొణకకుండా ఆ సంగతులే మరింత వింతగా చెప్తూ, హోటల్ వ్యక్తులనందరినీ ఆక్షేపిస్తూ, హాస్యం చేస్తూ వాళ్ళను నవ్విస్తూంది.

పేరూవియన్ పెద్దమనిషి తెల్లగుడ్డు బైలు పెట్టుకొంటూ ఆమెతో రహస్యంగా నివేదించు కొన్నాట్ట "అచ్చమైన మంచి బోగందా న్నెవత నైనా చూడాలని ఉంద"ని—ఆ డచ్ వాడు, ముంగి మీసాలేసుకొని మూగప్రేమ కలాపం నడుపుతూ, తన కుర్చీమీదికి వంగి, ఆవిడ చెవిలో రహస్యంగా "బటేవియాలో బంగాళా దుంపల ధర ఎంతో

తెలుసా" అంటాడట. అంతా ఫకాలున నవ్వుతున్నారు.

గాసిన్‌మాత్రం నవ్వటంలేదు. "కోతి" పిలార్ కూడా నవ్వటంలేదు. కూతురు వెండిసామానులన్నీ బల్లమీద భద్రంగా ఉన్నాయో లేదో మాస్తూ, తన ప్లేటులోనూ, పక్కవాళ్ళమీదా, వాలుతూన్న ఈగలను లటక్‌ను పట్టుకుంటూ, పెంపుడు తొండ కందిస్తూ, "తినే! అమ్మ, తినే, వరాలముద్ద" అంటూ ముద్దుపేర్లతో తినిపిస్తుంది. ఆ వికారపు జంతువు వడిలిపోయి, ముడుతలుపడి, డీఫస్ చేతివేళ్ళలాగే వంకరలుతిరిగి, బల్లమీద చచ్చుగాపడి ఉంది.

ఇక్కడి ఈగలన్నీ ఆఖరయ్యాక, తలుపు అద్దాలమీదో ఎక్కడో ఒక ఈగ కనపడేటప్పటికి పిలార్ మెల్లిగా అటుపోయి ఆ యీగను పట్టుకొని విజయోల్లాసంతో వచ్చి కూర్చునేది. మాటిమాటికీ తల్లి ఇల్లా లేస్తుంటే, రోజాకు చాలా మండుకొచ్చింది. అసలే పొద్దుటినుంచి ఎందుకో బహు చిరాకుగా ఉంది.

"నిమిషనిమిషానికి అల్లా లేవకు. నాకు విసుగొస్తుంది" అంటూ తల్లిని కోప్పడింది.

అచ్చు అదే కంఠంలో, ఇంకొంచెం ఘాటైన విదేశీయాసతో ఆ తల్లి జవాబిస్తుంది.

"మీరంతా తింటంలేదా! పాపం పసిపిల్ల అది తినకూడదేం?"

"ఊరొక్క కూర్చోలేకపోతే అవతలికి పదా. అందరికీ అసహ్యమేసుకొస్తూంది"

ముసిల్ది దమ్ము చూపించింది. ఇక ఇద్దరూ, తమ స్పానిష్, గ్రామ్యభాషలో, అనర్గళభాషా పాండిత్యంతో అచ్చపు బూతులు తిట్టుకోటం ప్రారంభించారు.

జీన్ అడిలిపోతూ ఆ యిద్దరివంకా తెల్లపోయి మాస్తున్నాడు. తక్కినవాళ్లందరికీ ఆ కుటుంబ కలహాలు సుపరిచితాలేమో, మాట్లాడకుండా తమ ఫలహారాలు సాగించుకొంటున్నారు. నూతన అతిథియందలి గౌరవంతో డి పాట్టర్‌మాత్రం కలగజేసికొన్నాడు.

"ఇదిగో, మాపండి, దబ్బలాపకండి"అన్నాడు. రోజా, మండిపడ్తూ ఛట్టున అతనిమీదికి తిరిగింది. "నీ కెందుకూ! ఇందులో కలగచేసుకొంటున్నావే! మర్యాద బాగా తెలుసే! నేను మాట్లాడటానికి నీయిష్టమేగాబోలేం? అంత ఉండలేకపోతే,నీ పెళ్లాం దగ్గరకే ఇంటికేపో! తుపానులో చస్తున్న బాతులాగ తేరకల్లేసుకొని, ఎక్కడపడితే అక్కడ ఆ బట్ట తలతో తయారవుతుంటే చూడలేక చస్తున్నాం. ఫో, తిరిగి ఫో! ఆ కొక్కిరాయి పెళ్ళాం దగ్గరకే ఫో"

డి పాట్టర్ వెలవెలబోతూ నే తెచ్చిపెట్టుకొన్న చిరునవ్వుతో. "ఇల్లాంటిదాంతో ఎల్లా బతకటం"అని ఆ బొద్దుమీసాలలోంచి గొణిగాడు.

రోజా అతనివైపుకు బల్లమీదికి వంగి అరుస్తోంది. "నీ మొహానికింతకంటే ఏం విసవదు. ఫో ముందు బైటికి నడు—"

డి పాట్టర్ జాలిగామాస్తూ దీనంగా బతిమాలుతున్నాడు. "ఇదిగో చూడు! రోజా!—" అప్పటికప్పుడే మళ్ళీ ఏదో నములుతున్న పిలార్ "నోరుముయ్యరా! బుల్లోడా", అంటూ అతితీవ్రంగా బహు హాస్యాస్పదంగా అనేటప్పటికీ, అందరూ ఫక్కున నవ్వారు. రోజా, డి పాట్టర్ కూడా నవ్వారు. డి పాట్టర్ రోజాను ముద్దుపెట్టుకొని, ఇంకా ఏదో కోపంతో గొణుగుతున్నదాన్ని బుజ్జగిస్తూ సముదాయించి, పాపపరిహారార్థం తనుకూడా ఒక ఈగను పట్టుకొని, పెంపుడుతొండకు ఆహారం చేకూర్చిపెట్టాడు.

ఇతడన్నమాట డి పాట్టర్! మహా వాగ్గేయకారుడు! ఫ్రెంచి సంగీతానికి శిరోభూషణము! ఈ ఆడది ఇతన్ని ఇల్లా ఎల్లా కట్టేసి ఉంచగలిగింది? లంజరికంలోనే మోటుబారి వృద్ధురాలైన ఈ చెడిపె, ఏం మందుమాకులు, మంత్రాలుపెట్టి, ఇతన్ని వల చిక్కించుకొంది? ఆతల్లి ఈ నైచ్యానికంతకూ దీనికి తోడౌతూంది. ఇక ఇరవై ఏళ్ళల్లో, ఆ కూతురిరూపం ఎల్లా ఉంటుందో భూతఅద్దంలో చూపిస్తున్నట్లు తల్లిరూపం ప్రత్యక్షమొనరిస్తుంది.

కాఫీ అందరికి సరస్సుప్రక్కనేఉన్న కేళీమంటపంలో ఏర్పరిచారు. మంటపం అంతా ముత్యపు చిప్పలతో అలంకరించి ఉంది. మంటపం లోకప్పున అద్దాలు అమర్చి ఉన్నాయి. ఈ శాకినుల వివిధ రూపాలు ఆ అద్దంలో ప్రతిఫలిస్తున్నాయి. చెరువు నీటి అలల తళతళల భ్రమకొల్పుతూ సిల్కు తెరలు చుట్టూ వేలాడుతున్నాయి. అక్కడి పెద్దసోఫాలలో అందరూ వెన్నులువాల్చినట్లు జేరగిలబడి తీరుబడిగా విస్తరించుకొని కూర్చున్నారు. రోజా, ఫేస్‌పౌడరు రంగులో మొగం మరింత ఎఱ్ఱబడి, తన చేతులు వెనక్కుచాచి తన వెనుకనున్న సరసుణ్ణి కౌగలించుకొంటూ "ఓ! నా ప్రియమైన టాటెవ్! నాముద్దు టాటేవ్" అంటూ చిలకపలుకులు పలుకుతూంది.

ఇంతలో ఎవరో నౌకావిహారం చేద్దామని ప్రోత్సహించారు. ఆ కాగిలి వెచ్చదనం అంతలోనే నిమ్మళకుపోయింది. పోయి పడవలు చూసి రమ్మంటూ రోజా డి పాట్టర్‌ను పంపిస్తూంది. "తెప్పలుకాదు, పడవలు తెలిసిందా?" అంది.

"పోనీ నౌకరుతో చెప్పనా?"

"వాడు తిండికి పోయాడు"

"పడవనిండా నీళ్లున్నాయి. అన్నీ బైటికి తోడాలి, పనిపట్టుంది."

మళ్ళీ ఏదో ముసుగుతుందని భయపడి, "జీన్ కూడా మీతో వస్తాడు" అంటూ పాట్టర్ వెంట జీన్‌ను పంపించింది, ఫాన్నీ.

ఇద్దరూ పడవ అడ్డచెక్కలమీదకూర్చుని గూడు వేసుకొని పడవలో నీళ్లు బైటికి తోడ్తున్నారు. ఇద్దరూ పనిలో నిమగ్నులైపోయి, నీళ్ళ చేదుడు శబ్దం లయలో లీనమై పోయారు. ఎండలో మిలమిల లాడ్తున్న చెరువుప్రక్కనే పెద్ద చెట్టునీడలో గట్టున పడవలో కూర్చుని ఉన్నారు.

ఉండిఉండి డీ పాట్టర్ అకస్మాత్తుగా జీన్‌ను పలకరించాడు.

"ఫాన్నితో చాల నాళ్ళబట్టే ఉంటు న్నావా?"

"రెండేళ్ళనుంచీ!" అన్నాడు జీన్ విభ్రమంతో.

"రెండేళ్ళనా! అయితే ఇవాళ నీకళ్లముందు జరిగిన విషయాలు నీకు అనుభవానికి అక్కర కొస్తాయి. ఈ రోజాతో ఇరవైఏళ్లబట్టే ఉంటు న్నాను. ఇటలీనుంచి వచ్చినప్పటినుంచీ! అప్పటికి మూడేళ్ళనుంచీ ఇటలీలో ప్రఖ్యాతి తెచ్చుకొని ఉన్నాను. ఇక్కడకు రాగానే ఒకనాడురాత్రి హిప్పొడ్రోమ్ సర్కస్‌కు వెళ్ళాను. అక్కడ రథం మీద నిల్చునిరథం తోలుతూన్న ఈస్త్రీని చూచాను. దోవమలుపు తిరుగుతూ గుఱ్ఱాలను సూటిగా నామీదికే తోలుతూన్నట్లు కొరడా గాలిలో అదిలిస్తూంది. తలమీద మెలికలు తిరిగిన పాముల పడిగెల కిరీటం ఉంది. తొడల నడుమదాకా ఒంటి నంటుకొని మిలమిలలాడ్తున్న బంగారు పూత కవచం ఉంది. అబ్బా! ఆనాడు ఎవరన్నా ఇల్లా ఔతుం దని చెప్పి ఉంటే........."

తల ముందుకువాల్చి, గూడ వేస్తూ తన కథ అంతా చెప్పుకొంటున్నాడు: తన కుటుంబం,ముందర ఇది ఏదో తమాషా అనుకొని నవ్వుకున్నారు. తరువాత తర్వాత ముదిరిందని తెలిశాక కాళ్లా వేళ్లాబడి ప్రబతిమాలుకొన్నారు. దాన్ని వదిలేస్తే, అతనికోసం ఏ త్యాగంబడితే ఆ త్యాగం చేస్తామన్నారు. రెండు మూడుసార్లు ఎక్కువ డబ్బిచ్చి ఆమెను కైవసం చేసుకొన్నారు. కాని తను ఎప్పుడూ ఆమెను వెంటాడుతూనే ఉన్నాడు. "పోనీ రెండేళ్ళు దేశా టనంచేసి వద్దా"మంది అతనితల్లి. రెండేళ్లూ తిరిగి వచ్చాడు. తీరా వచ్చాక మళ్ళీ దాన్ని జేరుకొన్నాడు. తరువాత తల్లి తనకు ఒక చక్కని అమ్మాయినితెచ్చి పెద్దకట్నంతో పెళ్లిచేసింది. సంగీత పరిషత్తుల సభ్యత్వంకూడా కట్నంగానే ఇప్పించారు. పెళ్లయిన మూడునెల్లకు మళ్ళీ మునుపటి ఉంపుడు కత్తెదగ్గిరకే వచ్చేశాడు.

అతను ఆకథంతా, ఏ కదలికలూ లేకుండా, కొయ్యబారిన మొగంతో, ఏదో సోది చెప్పుకొని పోతున్నట్లే చెప్పుకొని పోతున్నాడు. సరస్సులో పడవలనిండా విద్యార్థులు, యువతీ యువకులు కలిసి కూర్చుని, ఉత్సాహ కోలాహలాల్తో వసంతగీతాలు పాడుకొంటూ, కేరింతలు కొట్టుకుంటూ, పడవలు నడుపుకొనిపోతున్నారు. కాస్త ఆగి ఈ దుస్సహానుభవాల్ని విని గుణపాఠం నేర్చుకొనేందుకు అందులో ఏ ఒక్కరైనా ఉద్యుక్తు లవగలిగితే!

ఈలోగా అక్కడ తోటలో, "కళావంతులు" ముగ్గురూ ఫాన్నీ లిగ్రాండ్‌ను కూర్చోబెట్టి హితబోధ చేస్తున్నారు. ఈ కుఱ్ఱాడితో వ్యవహారం ఆమె అంతంచేసుకొనేందుకు అంపెహూ అంగీకరించేసినట్లు, ఎవళ్లకు తోచిన సాయం వాళ్లుచేసేందుకు సిద్ధమయి ఉన్నట్లూ, మాట్లాడుతున్నారు.

"మంచివాడే అనుకో! కాని చేత దమ్మిడీలేదు కదా—ఆమె గతి ఏంకాను"

"అదికాదు. నే నతని ప్రేమిస్తున్నాను" అంది ఫాన్నీ.

రోజా నిస్సాకారంగా బుజాలు ఎగరవేసింది. "దాని మానాన్న దాన్ని పోనియ్యండే! చెప్తే వినదు. అదిగో, ఆ, పిచ్చివాడినీ అల్లాగే చెయ్యి జార్చుకొంటుంది. నే నెరగను గనుకనా! ఎన్నిమాట్లు ఇది ఇల్లా మంచి అవకాశాలన్నీ చేతులారా తగలేసుకోలేదు! ఫ్లామంట్ వ్యవహారమయాక కాస్త బుద్ధి గలిగి దోవలో కొచ్చిందనుకున్నాను. కాని మళ్ళీ మొదటికన్నా మరింత పిచ్చిగా తయారయింది"

"పైత్తెకారి" అన్నట్టు పిలార్ మాత గొణిగింది.

"ప్రేమను ప్రేమించటం గొప్ప విషయమే నే అమ్మాయీ! కాని డబ్బునుకూడా ప్రేమించాలికదా!

వా సంగతి చూడు. నాకే డబ్బుంటే మాంటి కార్లోలో ఆ జూదపుఇంటి కట్టాడు, అనాకారిగా ఉన్నానని నన్ను తోసెయ్యగలిగేవాడే! ఏమంటావ్" అంటూ మాంటికార్లో వెళ్ళివచ్చిన విలాసవతి విల్క్కాబ్, హితబోధ సాగించింది. ఇంతలో ఆ ఘట్టం అంతా జ్ఞాపకంవచ్చి కోపంతో గొంతుక స్థాయి హెచ్చించి. "అబ్బబ్బ ఘోరం! పరిస్థితు లెల్లా ఘోరంగా మారిపోతాయా! ఎంతెంత కీర్తి ప్రతిష్ఠలు తెచ్చుకొన్నాను! దేశంలో నాపేరు తెలియనివా డెవడన్నా ఉండేవాడా—ఏ జట్కా బండీవాడినడిగినా, విల్క్కాబ్, ఇంటికంటే ఇట్టే పరాసరి తీసికెళ్ళగలిగేవాడే! ఎల్లాంటివాళ్లు వచ్చే వారు! మహారాజులు నా కాళ్ళదగ్గిర పడిగాపులుకాచి, ఉమ్మేస్తే అమరామృతమని మురిసిపోయేవారే! ఇన్నీ అయాక, అక్కడ ఈ దరిద్రుడు, నన్ను అనాకారి అని తోసేస్తాడా! ఒక్క రాత్రికి వాడి నుంచుకొనేందుకుకూడా నావగ్గిర డబ్బు లేకపోయింది."

అంటూ తను అనాకారి అని ఎవరో అన్నా రనుకొన్నందుకే ఒళ్లు మండిపోయి, చర్రున బట్ట లూడదీస్తూ,

"మొగం బాగుళ్ళేదట! సరే ఒప్పుకొన్నాను. కాని రొమ్ములు! బుజాలూ! ఈ తెల్లదనం! తెల్లగా లేదూ! ఒళ్ళు గట్టి ఏమన్నా సడిలిందా?"

ఏ సిగ్గూ లేకుండా తన దేహపు కండల గట్టి తనం కనపర్చుకొంటూంది. ముప్పైఏళ్ళ స్వైరిణీ జీవితం గడిపినా, విచిత్రం, ఆమె ఒంటిపొంకము ఏమీ తగ్గలేదు. మెడదాకా పైన మొగంమాత్రం, ముడుతలుపడి, వగ్గయిపోయి ముసలికోతి రూపంలో ఉంది.

"మహిళామణులారా! బోట్లు తయారయాయి" అంటూ డి పాట్టర్ కేక వేశాడు. ఆ వేశ్య మళ్ళీ తన దుస్తులు సర్దుకొంటూ వికృతంగా నవ్వి, "మరి కర్మ, బట్టలు విప్పుకొని రోడ్డుమీద నడవటానికి వీల్లేదాయెను" అంటూ అందరితో బయలుదేరింది.

జీన్ పడవ తెడ్లు వేస్తున్నాడు. ఎట్ట ఎదురుగా ఫాన్నీ లెగ్రాండ్ చుక్కాని కివతలగా అడ్డ చెక్క మీదకూర్చుని ఉంది. చుక్కాని డి పాట్టర్ పట్టాడు. ఈ వృద్ధవేశ్యలమధ్య ఫాన్నీ మరింత యౌవనంలో విరాజిల్లుతూ, చిరునవ్వు చిందించుకొంటూ కనబడి, ఈ భీభత్సాన్నంతనీ మరిచి పోగొట్టి అతని హృదయాన్ని సేద దేరుస్తూంది.

ఏమన్నా పాటలు పాడమని ఫాన్నీని డీఘస్ అడిగింది.

ఫాన్నీ "క్లాడియా"లోంచి గీతాలు మెత్తగా ఆలాపిస్తుంది. ఆ గీతాలు డీ పాట్టర్‌కు ప్రథమంగా ప్రతిష్ఠ చేకూర్చిన గీతాలేమో, అతనుకూడా గొంతు కలిపాడు. ఆ పాట వింటూ ప్రియురాలిని చూస్తుంటే జీన్ కక్కడి కక్కడే ఆ పాడుతూన్న పెదవుల నప్పళించుకోవాలనిపించింది.

కాని డీ పాట్టర్, ఫాన్నీల జంట గాత్రం రోజా ఎక్కువసేపు భరించలేకపోయింది.

"ఏడిసినట్టుంది లెండి పాట! ఇద్దరికీ ఒకళ్ళ మొగాలు ఒకళ్ళకు ఇంకా మొగమొత్తిలే! ఈ చావు బాజా వింటూ కూర్చోటమేనా మాకు పని! ఇదంతా విని సంతోషిస్తున్నామనే అనుకొంటున్నారులా గుంది. చాలుగాని ఆపండి! ఇప్పటికే బాగా ఆలస్య మయింది. ఫాన్నీ పనిలోకి పోవాల్సినవేళ అయింది" అంటూ కోపంతో డి పాట్టర్‌కేసి చెయ్యి తిప్పుతూ, "పడవ అక్కడ ఒడ్డుకు చేర్చు, వాళ్ళు స్టేషను కెళ్ళటానికి అక్కడినుంచే సులువు" అని ఆజ్ఞ యిచ్చింది.

ఆ పంపించేయ్యటం అతిమోటుగా పశుతుల్యం గానే ఉంది. కాని సర్కస్ రాణి మోటవ్యవహారాల కలవాటయిన తక్కినవాళ్ళు ఏమీ అనలేదు. ఒడ్డున దిగపెట్టగానే, ఫాన్నీకే వోపనులు పురమాయించి జీన్‌కు లాంఛనంగా సెలవిచ్చి, పడవసాగిపోనిచ్చింది. ఇంకా వాళ్లు వెనుక దిరగకముందే, పడవలో అంతా వెటకారంగా పకపకా నవ్వసాగారు.

"వింటున్నావా! వింటున్నావా! మనను చూసే నవ్వుతూంది!" అంటూ నిలువెల్లా దహించేస్తున్న కోపంతో పాలిపోయి పెదవులు కొరుక్కొంటూ అంది ఫాన్నీ జీన్‌తో.

ఈ అవమానంతో, ఇన్నాళ్ళూ ఉగ్గబట్టుకొని ఉంచిన క్రోధం పెల్లుబికింది. తను ఇన్నాళ్లూపడ్డ నీచ అవమానాలన్నీ, అతనికిచెప్పకుండా ఇన్నాళ్లూ దాచినవన్నీ, చెప్పసాగింది. "ఆ పిచ్చివాడినుంచుకో మంటూ చేసినబోధంతా విని వుండాల్సింది! అబ్బ! అందరూ ఇందాకంతా నన్ను ఎల్లా వేపుకు తినేశారనీ! నాకు నువ్వంటే అమితప్రేమ. ఆ కులటకూ, దానికున్న దుర్వ్యసనాలకూ, ప్రేమ అంటే గిట్టదు. అబ్బ! ప్రపంచంలోఉన్న నీచకామాలు, దుర్వ్యసనాలు, నీచాతినీచమైనవన్నీ దానిదగ్గిరే ఉన్నాయి. నేను తనలాటి తప్పుడు బ్రతుకింక బ్రతకనన్నానని నామీద మంట"

అతను వెలవెల పాలిపోతున్నాడు. ఆనాడు ఆ ఉత్తరాల పేడకుప్పను కెలికినవాటిలాగే పెదవులు కంపించిపోతున్నాయి. అదిచూసి గబుక్కున మాట మార్చింది.

"ఏం భయపడకు. నీ ప్రేమ నాలో ఆకల్మషాలన్నీ కాల్చేసి నన్ను శుద్ధిచేసింది. అదన్నా దాని తొంటెన్నా నాకు మండిపోతూంది. అబ్బ ఇద్దరూ అసహ్యం పుట్టిస్తున్నారు."

జీన్‌లో ఈర్ష్యాక్రోధాలు రగుల్కొన్నాయి. "నువ్వింక అక్కడుండటం నా కొంతమాత్రం ఇష్టం లేదు. ఆపాసిపోయినకూటికి అక్కడ కూలిచెయ్యటం అనవసరం. నా దగ్గిరకొచ్చెయ్యి. ఎల్లాగో గడుపుకొద్దాం." అన్నాడు.

అతనివంచి ఆ ఆక్రోశం రావాలనే, తెప్పించాలనే, ఇన్నాళ్లుగా ప్రయత్నిస్తుంది. కానీ అభ్యంతరాలు చెప్పసాగింది. ఇద్దరూ చాలకష్టపడాల్సివస్తుంది. అతని మూడుకందల ఫ్రాంకులూ ఇద్దరికీ చాలవు. అంతతో మళ్ళీ ఇద్దరూ విడిపోవాల్సి వస్తూంది. అప్పుడసలే భరించలేదు. తమ యిల్లు కదిలి అల్లా రావలిసి వచ్చినప్పుడు బ్రతుకు దుర్భర మనిపించింది.

అక్కడే రోడ్డుప్రక్కన తుమ్మచెట్ల నీడలో చేతులు పట్టుకొని కూర్చుని సావధానంగా చర్చించుకొంటున్నారు.

"నెలకు మూడువందల ఫ్రాంకులు! అయితే మరి హొట్టేమాలు ఎల్లా గడుపుకొంటున్నారు. వాళ్ళకు నెలకు రెండు వందల ఏభైయ్యే కదా వచ్చేది."

"వాళ్ళు ఏడాది పొడుగునా పల్లెటిదిక్కునే ఉంటారు"

"మనమూ అల్లాగే ఉందామ్, నాకేం, పారిస్సే కావాలని లేదు!" అన్నాడు.

"నిజమా! నిజంగా ఉండగలవా! ఓహ్! ప్రియతమా, ప్రియతమా!"

రోడ్డుమీద ఒక గుంపు వస్తున్నారు. ఎవళ్ళో పెళ్ళివారు తిరిగివస్తూ గాడిదలమీద సామాన్లు వేసి పరుగెత్తిస్తున్నారు.

అప్పుడు ముద్దు పెట్టుకోనేందుకు వీలులేక ఒకళ్ళనొకళ్లు దగ్గరగా అనుకొని, కదలకుండా కూర్చుని—పల్లెటిపట్టున, వేసంగి సాయంత్రాలలో, హాయిగా కూర్చుని మారస్థ జానపద నృత్యగీతాలాలకిస్తూ ఆనందంగా గడపగల—ముందు రోజుల కలలు గంటూ నిశ్శబ్దంగా అల్లే కూర్చుండిపోయారు.






వేముల వేంకట అప్పారావు



ఓసి విలాసినీ ! హృదయమూరక తొందరపాటు చెంద నా
యాసముతోడ వ్యస్తపదవై, శ్రమవారి కణాలు మోముపై
వేసరి బిందులాడ బరువెత్తెద వెచ్చటి కీవు? నిండుజ్యో
త్స్నసుమ మా మనోజ్ఞ వదనంబున నూర్పులు సందడింపగన్

అన్నుల మిన్న ! నీయెడదయందలి పొంగులు జాలువారి నీ
కన్నులలో దళత్తళలుగా మధురంబుగ బాహిరించె, నీ
చిన్నెలలో ఝషధ్వజుని శ్రీకర మార్గణనిస్వనాలు కు
ల్క, న్నడలందు సాగరునికై చను వాహిని తీరు తోచెడున్

ప్రణయావేశ ముహుర్ముహుశ్చలిత భావావేగవై నీదు ప్ర
త్యణుజాతస్తవనీయ మార్దవ సుధాంధారా ప్రవాహోల్ హృదం
గణమందున్ నినదింప మన్మథు ప్రఘూణంబున్ వడిన్ జేరు వా
రణయానా ! నను నుద్ధరించుటకు ధీరాధీరవై వచ్చితే !

ఆగుము ! నీ శ్రమన్ గనినయంతన చిత్తము పొంగిపోయి యు
ద్వేగము చెందిపోయినది, దేవి ! భవచ్ఛ్రమ కేమి కారణం
బో గుఱుతించి నాడను ! ప్రభూత్తముడై చను మన్మథుండె సం
యోగము చేసినా డిచట, నూరకపోవునె దైవచింతనల్!

రన సామ్రాజ్య మహాభిషిక్తుడను ! సామ్రాజ్ఞీత్వభారంబు సా
హసమున్ బూని వహింపు మింక—గత జన్మానేక పుణ్యప్రభా
వ సమానీత మనోజ్ఞ సౌఖ్యనిచయ ప్రాలంబ హర్షప్ర ఫు
ల్ల సముద్వేగ హృదబ్జవై నను నిరాలంబున్ గటాక్షించవే !

ఒకకంట జూడవే! మా
మక విరహానలము మాయమై పోవును; మా
మక హృదయ కార్శ్య మడపగ
సుకుమారాశ్లేష చాలు చేసియగదే!

రావే! నాబహు జన్మపుణ్య ఫలమా! రావే! జలేజాక్షి! వా
ణీ వీణా మృదు గీతికామధుర తంత్రీ నాదముల్ నీదు కం
ఠావిర్భూతము లట్లు తోచు – ప్రణయ వ్యాపార పాండిత్యముల్
'నీవే నే' నను మూలసూత్రముపయిన్ నిల్పెంగదే, ప్రేయసీ!

నా సాహిత్య వినూత్నవీథుల ననంతంబైన యాశోభ నీ
శ్రీ సంగీత భవంబు; నీ కనుల రాశీభూతమై యొప్పు వాం
ఛాసారస్యము చూచి చూచి మధురాశావేశ చిత్తంబుతో
నీ సాన్నిధ్యమునన్ రచింతు గలకంఠీ! నవ్యకావ్యావళుల్

నీలో నేను ధ్వనించిపోయెదను రాణీ! నీ తనూపావన
శ్రీలన్ సర్వము కొల్లవెట్టెదను; నీ శృంగార రంగత్కలా
పాలన్ లోకమె విస్మరించెదను; నీపై గేయముల్ చెప్పి, నీ
వ్యాలోలత్ కలకంఠ గీతులకు వీణారావ మందిచ్చెదన్!

ఈ విషాద మషీరసప్లావితాస్మ
దీయ హృదయాననీరాక తీయనైన
కలల వెలుగుల సృజియించె—గనులలోన
వత్తులిడుకొని నాకయి వచ్చినావె!



# నీతి.. అవినీతి



శ్రీ బలివాడ కాంతారావు

ఆరు నెలల క్రితం గోవిందరావు యింటివద్ద ప్రతి రోజూ సాయంత్రం జరిగే చర్చల్లో ప్రసన్న కుమారి పెళ్లి విషయం ప్రస్తావనకు వచ్చింది.

అక్కడ కూడిన సభ్యులలో రిటైర్డు లెక్చరర్ రంగనాథం ఒకప్పుడు తన విద్యార్థియైన సత్యనారాయణ ఇలా ప్రవర్తిస్తాడని అనుకోలేదన్నాడు. "ఉద్రేకాలని అణచుకోలేని మనిషి వీధిలో కుక్కతో సమానం. యౌవ్వనం మనిషి జీవితంలో ఒక దశ. కామం మనిషి అనుభూతుల్లో ఒకటి. ఈ దశలో యీ అనుభూతిని పట్టపగ్గాలు లేకండా విడిచిపెడితే మిగతాదశలు, అనుభూతులు కాల్చినవారవుతారు"

ప్రక్కనున్న సాంఘిక సేవాతత్పరుడైన గోపాలం యీయనతో ఏకీభవిస్తూ యీ మారుతున్న ప్రజల్ని చూసి విచారిస్తున్నానన్నాడు. ఈ చర్చల్లో పాల్గొనకుండా కూర్చున్న సోమసుందరం మెల్లగా అన్నాడు "సత్యన్నారాయణ సుందరమును వేశాడంటాను." ఈ హైనలియరు మెడికల్ విద్యార్థివైపు వయసుమళ్లిన యిద్దరూ చూశారు. గోవిందరావు చివరకు చర్చను ముగిస్తూ "కన్నతండ్రినే నా కూతురు కాదన్నప్పుడు మావాడు కనికరించాడు. మా పెద్దన్నయ్యకు పెళ్లీడుకొచ్చిన పిల్లలున్నారు. వీడిలా చేశాడు కదా సాంప్రదాయకులెవరొస్తారండీ. వీడిని లోబరచుకోడానికి ఆమె యెన్ని పన్నాగాలు పన్నిందో!"

ఈ చర్చ జరిగిన వారంలోనే సత్యన్నారాయణ విజయవాడనుంచి వుత్తరం వ్రాశాడు.

"నేనేదో ఆలోచించని పని చేశానని, మన కుటుంబ గౌరవప్రతిష్ఠలు గంగలో కలిపానని, నా పాపిష్టిముఖాన్ని జీవితకాలంలో చూడనని యిలా వాళ్లకోపాలు సంతుష్టించే భాషలో యిద్దరు అన్నయ్యలూ వ్రాశారు. ఈ వుత్తరాలు నా ప్రసన్న చదివింది. ఇంకో అన్నయ్య వూరుకున్నారేం? పెరపకాన్నా వెళిపోయాముకదా, బహుశః, నాకెందుకని వూరుకున్నారా అని అడిగింది. నేను వెంటనే జవాబు చెప్పలేకపోయాను. తరువాత ఆ అన్నయ్య పవిత్రమైన జీవితాన్ని చెప్పాను. వదిన పిచ్చాసుపత్రిలో వుందనగానే చాలాగింజుకుంది. నేను ఆలోచించని పనిచెయ్యలేదని తృప్తిపడ్డాను, ఒకప్పుడు యీ జీవితంలో యెవరిదగ్గరికైనా వెళ్లే అవసరం నాకు వస్తే మా అన్నయ్య అని కాకండా ఒక సహృదయుడైన మనిషని నీ దగ్గిరికే వస్తాను"

ఉత్తరం చదివాక అలాకూర్చొనే ఆలోచనలో పడ్డాడు. ఆమె ఒకడితో లేచివచ్చింది. వాడామెను ఒంటిగా విడిచివెళ్లిపోయాడు. వీడు వుద్ధరిస్తున్నట్లు ఆమెను పెళ్లిచేసుకున్నాడు. విభిన్నత్వంలో యేకత్వం యీ జాతులు యిస్తాయని తను చెప్పుకున్నాడు. ఈ జాతులమధ్య సంబంధాలకు అంత మనసీయలేకపోయాడు. ఆ మాత్రం మనసు కట్టలేకపోవటంవల్ల తన బ్రతుకు కాల్చుకున్నాడు. ఒకప్పుడు ఆమె వీధిలో కొన్నాళ్లువుంటే—తన పిల్లల జీవితం?

"నీ వుత్తరం చేరింది. నివ్వొక యింటివాడివైనందుకు సంతోషం" అని రెండేముక్కలు జవాబు వ్రాశాడు.

ఈ వుత్తరం వ్రాసిన ఆరునెలలనాడు ప్రసన్న యిచ్చిన టెలిగ్రాం వచ్చింది. సంశయంలో పడినా తనొక సహృదయుడైన మనిషినని గుర్తుకురావటంవల్ల బయలుదేరాడు. తను వెళ్లటానికి యెందుకు సంశయించాడో అంతపనీ జరిగింది. అన్నయ్యకోసమే ఆ చివరి ప్రాణంతో వున్నాడు. ప్రసన్నను తనెంత ప్రాణతుల్యంగా చూసుకున్నాడో చెప్తూ ఒక పెద్దమనిషిని ఆమె జీవితకాలం సంరక్షకుడుగా వుంచాననే సంతృప్తిని వెల్లబుచ్చి కళ్లుమూశాడు.

అక్కడవున్న నాలుగు రోజుల్లోనూ ప్రసన్న తనతో ఒక్కసారే మాట్లాడింది. ఈ తమ్మునితో యిలాను తెగతెంపులు చేసుకున్నారు కాబట్టి మిగతా యిద్దరి పెద్దవారికీ యీ కబురు అప్పట్లో తెలియపర్చవద్దని చెప్పింది. గోవిందరావు సంశయిస్తుంటే

"ఆ శేరం నామీద వెయ్యండి" ని నొక్కి చెప్పింది. ఈ నాలుగు రోజుల్లోనూ ఒక పెద్ద సమస్య తనను పీక్కు తిన్నది. తను జీవితంలో యేదో పెద్ద పొరపాటుచేస్తున్నానని బాధపడ్డాడు. ఇద్దరన్నయ్యలు తన యింటిమీద పడి యెంతగా పీక్కు తింటారో! ఈమెను తీసుకవెళ్లకపోతే వాళ్ల సంతోషానికి సరిహద్దులుండవు. మచ్చమూసిపోతోందని సంతోషిస్తారు. తను తీసుకవెళ్తేలోకం యింకేమచ్చ పెట్టుతుందేమో! ఆవూర్లోనే వుంచి నెలనెలా యేమైనా పంపిద్దామనుకున్నాడు. కానీ యీమె, సంఘానికీ, సాంప్రదాయాలకీ అతీతుడై త్యాగంచేసిన తన తమ్ముని జీవితాంతం తలుచుకొని వుండకపోతే యింతకంటె అపవిత్రురాలు యింకొకర్తె వుండదు. ఇక్కడవుంటే ఆమె అలా వుంటుందా? తీసుకవెళ్టమే మంచిది. పిచ్చి మరిది భార్య యింటికి వస్తే యేమనుకుంటుంది? లెక్చరరు, గోపాలం వూరుకుంటారా? మీరిక్కడే వుండండి డబ్బు పంపిస్తానని చెప్దామని లేచాడు. ఆ దుఃఖితవదనాన్ని చూచి మాటాడలేకపోయాడు. తమ్ముడు యిక్కడ యీమెను విడిచిపెట్టడానికి తనను పిలిపించలేదని గుర్తుకువచ్చి తనతో తీసుకొనివెళ్లి వేరే యింట్లో పెట్టవచ్చునని బయలుదేరాడు.

ఇంటికి వచ్చిన వారంరోజులవరకూ ప్రసన్న తన వేపే చూడలేదు. ఆమె దుఃఖాన్ని చూసి దగ్గరకు వెళ్లటానికే జంకాడు. గోపాలంకు ప్రసన్న యీ యింట్లో వుండటం యిష్టంలేకపోయినా "సజ్జనుల యింట్లో పాపులు పతితులు కావటం సహజం" అన్నాడు. ఈ మాటలు ప్రసన్న వినకపోలేదు. గోవిందరావు రోజంతా తనేదో తప్పుచేశానని, లోకం తన గురించి యేమనుకుంటుందోనని భయంతో కూర్చున్నా లోలోన యేదో వుత్సాహం మెల్లగా అల్లుకుంటోంది. మూడుసార్లు మీకోసం వేరేయిల్లు చూశానని చెప్దామని దగ్గరగా వెళ్లాడు చెప్పలేక తిరిగివచ్చాడు.

తరవాత ఆమె కొద్దిగా లేచి యింట్లోనే తిరుగాడుతోంది. నాలుగురోజులు పోయాక చెప్దామనుకున్నాడు. ఆమె అప్పట్లో చిందరవందరగా పడున్న పుస్తకాలు సామాన్లు సర్దుతుండటం గమనించాడు. ఆ మరుచటిరోజు ప్రసన్న కోరి మాట్లాడటంతో గోవిందరావు తను వేరే యిల్లు చూశానని చెప్పటానికి సంకోచించాడు. "హోటలు భోజనాలు మనుషులని పిప్పిచేస్తాయ్. నాకు వండటానికి అభ్యంతరంలేదు. కానీ..."

గోవిందరావు జవాబీయకుండా మేడమీదకు వెళిపోయాడు. తను మర్యాదగా ప్రవర్తించలేదని గుర్తుకు వచ్చింది. తన మానం అఖ్ఖర్లేదని జవాబిచ్చినట్లే అనుకున్నా ఆమె తనని గురించి యేమనుకుంటుందోనని న్యూనతచెందాడు. ఆమె యేమనుకుంటే తనకేం? ఎందుకో ఆమె మనసులో తను చెడ్డగా యెప్పుడూ వుండకూడదనే కోరిక తనని ప్రతి నిమిషం పీక్కుతింటోంది.

క్రిందికి వెళ్ళాడు. ప్రసన్న యేదో పుస్తకం చదువుతోంది. సహజమైన సిగ్గు, మర్యాదను ఆమె మూర్తీభవింపచేసింది. తను చెప్దామనుకున్నదొకటి చెప్పిందొకటి వద్దులెండి, అన్న బదులు, మీ కెందుకు శ్రమ అన్నాడు. ఆమె వెనువెంటనే "ఆయన మీలానే భోజనం తృప్తిగా వుండఖ్ఖర్లేదనుకొనే వారట. ఆరోగ్యం విషయంలో ఆధ్యాత్మికదృక్పథం వదలుకోవాలి"

ఈ మాటలు వినగానే గోవిందరావు అక్కడ నిల్చోలేకపోయాడు. తన దృక్పథాన్ని సమర్థించుకోడానికి మాటలు దొరక్కపోవటమే తనను కదలనిచ్చింది. ఈమె తనతమ్ముని మరచిపోలేదు. అయితే తన ఆరోగ్యంకోసం ఆమె యెందుకిలా ఆతృతజెందాలె? ఆలోచనలో పడిన కొద్దీ తెగసురుగా త్రెంచి యే విషయమైనా యెందుకు మాట్లాడకపోవాలి? నీ వంట నాకిష్టంలేదని చెప్తే సరిపోయేదిగా. ఆమెను వేరె యింటికి పంపిస్తే యీగొడవంతా లేకపోయేదిగా!

ఆ వేళ సాయంత్రం మాటల్లో గోపాలం అన్నాడు. "ఆడదానికి తగినకట్టు బొట్లని పెద్దలు వట్టివాళ్ళే పెట్టారా? ఈ రోజుల్లో చదువుకున్న అమ్మాయిలకు యెంతగర్వమో అంత వేగిరంగా యే విషయంలోనైనా లొంగిపోతారు. చూడండి మా వీధిలో ఒకమ్మాయి బి. ఎస్. సి చదువుతూ లేచిపోయింది. ఆ పిల్ల తండ్రి ఆ కూతురు పుట్టలేదే అనుకుంటాను అన్నాడు"

లెక్చరర్, కాలగతిలో మన హైందవ సాంప్రదాయాలు బుగ్గయిపోతూ, మన ఆదర్శనారీ రత్నాలలోని పవిత్రతను తెలుసుకొని యెందరు అమ్మాయిలు యీ రోజుల్లో వున్నారో వివరిస్తూ విచారాన్ని వెళ్లబుచ్చాడు. గోవిందరావు ప్రసన్న యీ మాటలు, లోనుంచి వింటూ బాధపడ్తూ వుంటుందేమో నన్న ధ్యాసలో మనసులో చిరాకుగావున్నా వీళ్ల వాగ్ధాటి ఆగలేదు. మళ్ళీ అనుకున్నాడు ఆమె కష్టపడితే తనకేం? పిచ్చి నిజం అనేటప్పుడు తన పాపానికి పశ్చాత్తాప పడుతుంది.

ఆ రాత్రి కేరియరు విప్పి భోజనంచేస్తుండగా ప్రక్కగది తలుపుచాటున నిల్చొని ప్రసన్న ప్రశ్నించింది. "మీరూ వాళ్ళతో యేకీభవిస్తారా?"

గోవిందరావు ఆమె మనసులో యేముందో తెలియక, తను యింకో అభిప్రాయం యిస్తే యేమనుకుంటుందోనని జవాబుకు తటపటాయించాడు. ఆమె అభిప్రాయం కోసం తనెందుకు ప్రాకులాడాలి? తనకున్న అభిప్రాయం చెప్పొచ్చుగా. కానీ యీ లోగానే ప్రసన్న మళ్ళీ అందుకుంది. "ఆదర్శాలవెనువెంటనే పనులెప్పుడూ సాగవు. ఉదాహరణకి లోకచరిత్రే మీయెదరగా వుంది. సంఘం కట్నాల మోజులో పడి కుళ్ళిపోతోందని మీరూ ఒప్పుకుంటారనుకుంటాను. ఆ అమ్మాయి లేచిపోయిందంటే - ఆమె చదువుకుందని కొద్దిపాటైనా ఆలోచించే జ్ఞానంవుంటుందని ఒప్పుకుంటారనుకుంటాను. అలాంటప్పుడు ఆమె ఆ పని యే పరిస్థితుల్లో చేసిందో—అంటే ఆమె ఆదర్శాలకంటే పొందే బాధకే ప్రాధాన్యం యిచ్చివుంటుందని మీకు తట్టలేదా? బాధపడేవాళ్ళమీద సానుభూతి చూపించటం సంస్కారంకాదా? పాపం! ఆ తండ్రీ లోకానికి జడిసే కూతురు పుట్టలేదని అన్నాడే కానీ— అభిమానం లేదంటారా?"

గోవిందరావు అన్నం కలుపుతున్నవాడల్లా యింత పెద్ద సమర్థన వస్తుందంటే వుండివుండి ఆమెవేపు చూడబోయాడు. మళ్ళీ ప్రయత్నించినా నోటిలోనికి ముద్ద వెళ్ళలేదు. ఆమెవేపు చూడాలని మనసు ముందుకులాగుతున్నా ఆమె యేమనుకుంటుందోనని బలవంతాన నోటిలో ముద్దపెట్టి నమలలేక-నములుతూ తనెప్పుడూ యిలా ఆలోచించలేదే-ఎప్పుడూ ఆదర్శాల కొలబద్దతో మనుషుల బ్రతుకుల్ని కొలవటానికి ప్రయత్నించాడు. ఈమె కష్టాల కొలబద్దతో మనుషుల జీవితాన్ని కొలుస్తోంది.

అన్నం విడిచిలేస్తే బాగుండదని కష్టపడి తిన్నాడు. మేడమీదకు వెళ్ళిపోతూ ప్రతీ చిన్న విషయంలోనూ ఆమె యేమనుకుంటుందోనని యెందుకు భయపడాలనిఅనుకున్నా భయపడకూడదని మాత్రం గట్టిగా నొక్కి చెప్పుకోలేకపోయాడు. టెర్రస్ మీద కుర్చీ వేసుకొని నక్షత్రాలవేపు చూస్తున్నాడు. మిణుకుమిణుకుమనే చుక్క సూర్యగోళంకంటె పెద్దదని తలపుకువచ్చింది!

ఆ రాత్రి ఆలస్యంగా నిద్దరపోయినా వేగిరంగానే తెలివివచ్చింది. తన ముప్ఫయి యేళ్ళ వయసుగల నరాలు పీకినట్లనిపించినయ్. అలా పరుపుమీద నుంచే ప్రసన్నను మనఃఫలకంమీద చిత్రించుకున్నాడు. ఒక్కసారిగా తన మార్పును తను గుర్తించుకున్నట్లనిపించి పిచ్చివాడినని నవ్వుకున్నాడు. నవ్వుతూనే అబ్బే! ఆమైనా అసందర్భంగా అనలేదే! అంటికలుగజేసుకొని మాట్లాడిన ఆమెలో సంస్కారం మూర్తీభవించలేదా? తనలా ఆమె లొంగలేదు, బెణకలేదు. ఆమెలా తనూ యెందుకుండకూడదు? ఆమెనే ఆదర్శంగా యెందుకు పెట్టుకోవాలి? తనంత చచ్చుగా వున్నాడా? ఆమె చెప్పినదానిలో నీతి యేమాత్రం వుంది? కష్టాల్లో సహనాన్ని చూపించనివాళ్ళ జీవితాలూ జీవితాలే! కష్టాలను సాకుగా పెట్టుకొని కోరికలకు లొంగిపోయి చరిత్రలేని మనిషిగా బ్రతకటం హేయంకాదా? ఆమె అన్నదాంట్లో అర్థంలేదు. అయినా ఆమె గురించి తనెందుకాలోచించాలి? సరే - ఆమె అలావుంటుంది - నేనిలావుంటాను. కానీ తన గుండెలోని లోలోపల తనెందుకామె గురించి ఆలోచిస్తున్నాడో చప్పునతట్టినా కాదు కాదని గట్టిగా అరవబోయాడు. అది నిజమనే ఆత్మ సమర్థన తన నోటిని పెగలనీయలేదు— అవును—బిగియౌవ్వనంలో వున్న ప్రసన్న బంగారు ఛాయ ముఖంలో, కనీకనిపించని కాటుకరేఖ దిద్దినట్లున్న ఆకళ్ళల్లోని తళుకు! తను యిదివరకెప్పుడూ చూడలేదు.

ఆ కళ్ళను తన కంటిముందునుంచి తుడిచిపెట్టాలని కళ్ళు గట్టిగా మూసుకున్నాడు. ఆమె తొంగి తొంగి చూస్తున్నట్లనిపించింది. చప్పునలేచి ఒళ్ళు విరుచుకున్నాడు, జుత్తుపీక్కుని ఛా అంతా పీడకల అనుకుంటూ మేడదిగాడు. ఆమెవేపు పొరపాటునైనా చూడకూడదని భీష్మించుకున్నాడేమో అటువేపు తల తిప్పలేదు. కాఫీకని హోటలుకు బయలుదేరుతుంటే ప్రసన్నమాటలు విన్నాడు "ఈ వేళనుంచీ నాకు హోటలు నుంచి యేమీ అఖ్ఖర్లేదు. ఏపనీ లేకండా యింట్లో కూర్చోవటంకూడా కష్టంగానే వుంది. నాగురించి నేనే వంటచేసుకుంటాను"

వద్దని అందామనుకున్నా ఆమె కెందుకు జవాబివ్వాలని తలవూపి వెళ్ళిపోయాడు. నడుస్తూనే ఆమె అంత మర్యాదగా అంటే తను "మీ యిష్టం" అనైనా అనలేదే. మా తమ్ముడు పవిత్రుడని చెప్పాడు కదా—తను పవిత్రుడు కాడా? తన నీతి యుక్తమైన జీవితం తలపుకురావటంలో ఆ తరహా మనుషులు సంతుష్టిపడ్డట్లేతనూ పడ్డాడు.

హోటలునుంచి తెచ్చిన పార్సెలు ఆమె దగ్గరగా పెట్టినప్పుడు ఆమెవేపు చూడకండా వుండలేకపోయాడు. ఆమె తెల్లని చీరకట్టి నల్లని బ్లౌజు వేసింది. ముఖం బొట్టులేకపోయినా తళ తళ మెరుస్తున్న ఆ కలువకళ్ళల్లో - ఆకళ్ళు - అలా గంటల తరబడిచూడాలనే కోరికను బలవంతాన చంపుకొని ఒక్కసారి చూసి తిరిగిపోతుంటే ప్రసన్న గొంతుక

వినిపించింది. ఆగాదు ఆమె అలా చాటుగానిల్చొనే "మీరు చిక్కిపోతున్నారు— అక్కయ్య వచ్చాక నామీద నిష్ఠూరం వెయ్యదూ? నేను వండితే అభ్యంతరం వుంటుంది. పోనీ యెవరితోనైనా..." చప్పున "అబ్బే నాకటువంటి అభ్యంతరమేమీ లేదు" నాన్చుతూ అన్నాడు. ప్రసన్న "సంతోషం" అని పెరటకు వెళ్ళిపోతోంది వెళ్ళిపోతున్న ఆమె వేపు చూశాడు. సర్వాంగసుందరమైన ఆమె, అడుగు వేస్తుంటే హృదయంలో ఒక్కొక్క మెరుపు మెరుస్తోంది. ఆమె వెనువెంటనే మెల్లమెల్లగా వెళ్ళి—ఆ చీరకొంగుపట్టుకుంటే - ఆమె చప్పున తిరిగితే...ఆ కళ్లు!!

తిరిగి ఆమె తనవేపు వస్తున్నట్లు గమనించి సిగ్గుపడి మెల్లగా మేడమెట్లవేపు నడిచాడు. మళ్ళీ ఆమెవేపు తొంగిచూద్దామనుకున్నా చప్పున ఆ కోరికను, ఆత్మజ్ఞానం కలగటంచేత, బంధించి మనసులో తెంపులు వేసుకున్నాడు. తన యీగానుండె నిబ్బరంలేని పనికి విసుక్కున్నాడు. ఆమెకు తను రక్షకుడు. ఆమె బాగోగులను చూసి, తన తమ్ముని ఆమె తలచుకొని ప్రశాంతంగా బ్రతికే వాతావరణాన్ని తను సృష్టించాలి కానీ, తనుయిలా నిముషమాత్రమైన కోరికల్లోపడి ఆత్మను కోల్పుకొని బ్రతకటం యెంత హేయం! ఈ నిముషంనుంచి తను ఆమె అందం గురించి తలపుకు తెచ్చుకోకూడదు. ఏముంది? ఆ యెముకలగూడుకు అంటుకొని బింకంగావుండే కండరాలమీద పొందికగావుండే ఆ చర్మం - అది యెంత కాలం అలా వుండిపోతుంది? క్షీణించి బుగ్గిలో కలసే యీ అవయవాలపొందిక నుచూసి కామోద్రేకంతో వక్రమార్గాన్ని త్రొక్కడ మెందుకు?

ఆవేళ యిల్లు కదిలాడు. తనకు పెద్ద బజారులో పెద్ద ప్రింటింగ్ ప్రెస్ వుంది. ఎప్పుడూ మేనేజరే చూస్తున్నాడు. ప్రెస్‌లోనూ యెంతసేపూ వుండలేక గోపాలం యింటికి వెళ్లాడు. గోపాలం వండు కుంటూనే మాట్లాడుతున్నాడు. తన యౌవనంలో భార్యతో మాటామాటావచ్చి ఆమెను విడిచిపెట్టాడు. అప్పటినుంచీ యింకో పెళ్లిచేసుకోకుండా తనేవండు కుంటూ బ్రతుకుతున్నాడు. ఎంత గట్టిగుండె! గోవిందరావు ఆయన చరిత్రతో తన చరిత్రపోల్చుకుంటూ ఆయనచెప్తున్న విషయాలకి వూఁ కొడుతున్నాడు. చివరికి ఆయన ప్రసన్న విషయంలోకి దిగాడు. "నేనైతే - నీ గురించి తెలుసును కాబట్టి అల్లా అనుకోను. కానీ లోకులు యేమైనా అనటానికి అవకాశం యిచ్చావు. నీ అన్నయ్య లిద్దరూ గొడవచేస్తున్నారుగా. అంచేత ఆమెను యెక్కడకైనా పంపించి యేమైనా ధిరణంకిందంటే పంపించు" ఆయన తొందరగా నేమీ జబాబు చెప్పలేక నడిచిపోతూంటే అప్పుడే ఆమెను పంపించివేయటం జరిగేపని కాదని తట్టింది. ఇంటికి వెళ్ళేసరికి ప్రసన్న తనకోసమే కాచుకొని కూర్చుంది. గోవిందరావుకు యిష్టంలేకపోయినా తను తొట్రుపాటులో యిచ్చిన జబాబు జ్ఞప్తికివచ్చి భోజనానికి కూర్చున్నాడు. ఇంటి భోజనం చాలా కాలానికి అనుకున్నా తను యీమె చేతి వంట తింటున్నానని తెలిస్తే—భోజనం చేస్తుండగా "ఇన్నాళ్లూ నేను వద్దామనుకున్నా రాలేకపోయాను నన్నూ ఒకసారి అక్కయ్యను చూడనివ్వండి" అంది.

గోవిందరావు మాటాడలేదు. ఎందుకో యీ కోర్కె తీర్చలేనిదని వుద్దేశపడ్డాడు. తింటున్నంతసేపూ యెదురుగా ఒకపంచు ముదుపలివున్నట్లే కోరి కోరి భావించాడు. కానీ లేచేముందు తలెత్తే సరికి లేనగవుతో మిసమిసలాడే యౌవ్వనంతో ఒళ్లంతా పులకరింపజేసిన అంగన నిల్చుంది?

ఆ వేళ సాయంత్రం మామూళ్లుగా నలుగురూ కూడారు. సోమసుందరం యిదివరలా కాకుండా రోజూవస్తున్నాడు. రఘురాను యీ చర్చలో పాల్గొంటున్నాడు. ఈ వేళ పాపపుణ్యాల గురించి వచ్చిన ప్రస్తావనలో సోమసుందరం చివరకు ప్రశ్నించాడు "ఒకమ్మాయిని దగాచేసి భర్త వెళ్లిపోతాడు. మళ్లీ ఆమె పెళ్లిచేసుకుంటే పాపమా?" ఈ ప్రశ్నకు వెంటనే జబాబురాలేదు. ఎంచేతంటే ముగ్గురి మనస్సుల్లోనూ యీయన ప్రసన్న ప్రసక్తే తెచ్చాడని స్ఫురించటంవల్ల. గోవిందరావుకు యీ ప్రశ్న చిరాకెత్తించింది అంతలో వూరుకోక సోమసుందరం మళ్లీ అన్నాడు "అది అవినీతి అంటారా?"

గోవిందరావు మనసు యీర్ష్యతో నిండిపోయింది. ప్రసన్న విషయం యెత్తడానికి వీడికేం అధికారం వుంది. బలవంతాన కోపం ఆపుకున్నాడు. గోపాలం తరవాత జబాబు చెప్పాడు "ఎందుకులే. అది నీతో, అవి నీతో. పాపమో పుణ్యమో తరవాత తెలిసివస్తుంది. రక్తం బింకంగావున్నప్పుడు యేదీ తెలిసిరాదు!"

ఆవేళ రాత్రిభోజనం దగ్గర ప్రసన్న మాటలకోసం యెంత మెల్లగా వింటున్నా వినిపించలేదు. బహుశః ఆవేళ చర్చ ఆమెకు కష్టాన్ని కలిగించిందేమో? లేక తన మౌనం ఆమెకు నచ్చలేదేమో? ఆ తియ్యనిమాటలకోసం యెదురుచూసి విసిగెత్తి తలెత్తాడు. కినుక చెందిన చిహ్నాలేమీ కనపడలేదు. ఇక ఆమె మబ్బువిడిచిన చందమామ — మెరుగుపెట్టిన బంగారం — ఆమె నడకలో వయ్యారం మళ్లీ యీ

నాటికి పూర్తిగా వచ్చింది. తన నరాలన్నీ పుచ్చుతున్నా అణచుకొనే శక్తి కృశిస్తోంది. తనవునికిని మరచిపోయి మళ్లీమళ్లీ ఆమె వేపు చూసిపోయాడు. లేచేటప్పుడు యెదురుగా ప్రసన్న లేదు.

మెల్లెక్కుతూ యింతవరకూ తనేంచేశాననే తలపురాగా మేడమీదకు వచ్చి కుర్చీలో కూలబడిపోయాడు. వెలుగుతున్న లైటువేపు చూడలేక ఆర్పి టెర్రస్ మీద కుర్చీలో కూర్చున్నాడు. రాను రాను ఆలోచనలు క్రుమ్మరించటంవల్ల మెదడు వేడెక్కింది. చప్పున తనెంతగా మారిపోయాననే స్పృహ తెచ్చుకున్నాడు. తను మారిపోయాడు. పూర్తిగా మారిపోయాడు.

అప్పుడే చందమామమీదికి లేస్తున్నాడు. ఆలే వెలుగులో యెదురుగావున్న చిగిర్చినచెట్టు, చిన్న గాలికి ఆడే ఆకులు - హృద్యమైన ఆదృశ్యంవైపు మనసు పరుగులెత్తింది. రానురాను చల్లని కాంతులను కొల్లలుగా విరజల్లుతున్న చందమామను చూస్తున్నాడే గానీ...అలా చూస్తుంటే తను చూస్తున్నది చందమామను కాదు - ప్రసన్న ముఖారవిందాన్ని !

లేచిపోయాడు. మెట్లవరకు నడిచాడు. ఎటు వేపుచూసినా ఆ సౌందర్యరాసే ప్రత్యక్షమౌతూంది. ఏదో ఘోష వినిపిస్తున్నా వినిపించుకోక మేడ దిగాడు. పరుపుమీద చారబడి ప్రసన్న యేవో చదువుకుంటోంది. స్తంభంచాటున నిల్చొని రెప్పవెయ్యకుండా చూశాడు. తను యిదివరకు వూహించని అందం - అంగులో ఆమె వయ్యారమంతా వలబోసుకొని స్వేచ్ఛగా వుంది.

కళ్లుమూసుకుందామని ప్రయత్నించాననుకున్నాడు. కానీ ఆమె కాస్తసర్దుకోగానే భయం వేసింది. ధైర్యం తెచ్చుకొని రెండడుగులు వేశాడు. ఆమె పుస్తకం ప్రక్కకు పెట్టి చూసిచప్పున సర్దుకొని లేచి తలుపుచాటుకు వెళ్లిపోయింది. చెంపపెట్టు నడివీధిలో తగిలినట్లు బాధపడ్డాడు. ఆ క్షణంలోనే ధైర్యాన్నంతా కూడగట్టుకొని సగం బెణుకుతో "సాయంత్రం వాళ్ళేదో అన్నారని బాధపడ్డారేమో ? రేపటినుంచీ వాళ్లలా అనకుండా వుండేటట్లు చూస్తాను."

ప్రసన్న కొద్దిగా ముందుకువచ్చి "చర్చలిని మాత్రం ఆపకండి. వాటివల్ల నా మెదడుకుకూడా కొంతమేత దొరుకుతుంది. ఒకరు యేదో అన్నారని లేక అనుకుంటారని నేనెప్పుడూ బాధపడను. దుఃఖంలోనూ సుఖపడటమెలానో నాకొంత తెలుసు"

గోవిందరావు ఆ చివరి మాటలతో తన పరిస్థితికి చివుక్కుమని తిరుగుముఖం పట్టాడు. పరుపుమీద పడి గట్టిగా యేడవాలనుకున్నాడు. బ్రహ్మాండమైన చిరాకుతో యిటూ అటూ పొర్లుతూ తలగడ మీద తలకొట్టుకుంటూ కొంతసేపు బాధపడ్డాడు. రాత్రి దొర్లుకుపోతోంది. గంటల తరబడిగింజుకొని కర్తవ్య విమూఢునిలా లేచాడు. ప్రకృతి నిదురిస్తోంది. వెన్నెల యిప్పుడేదో ప్రశాంతతని తెచ్చిపెట్టింది. ఆకాశంవేపు చూశాడు. నక్షత్రాలు అక్కడక్కడ మిణుకుమిణుకు మంటున్నాయ్. ఏవో తెలియని, తెలుసుకోలేని అనుభూతులతో మనసు నిండిపోయింది. ఈ ఆకాశం - చుక్కలు - ఈ మనుషులూ, ఆరాటాలూ, సంతోషాలూ, చావు పుట్టుకలూ - ఈ జగన్నాటకానికి కారకమైన పవిత్రాతిపవిత్రమైనదీ, సర్వవ్యాప్తమైనదీయైన ఆ శక్తి-చేతులు మనసునింపుగా జోడించుకున్నాడు. "ఆమెను ఆరూపంతో మనసులో పెట్టుకోకండా వుండే గట్టిమనసు నియ్యితండ్రీ !"

భక్తితో నిండిన మనసుతో వచ్చి పరుపుమీద పడ్డాక నిద్రవస్తుందనుకున్నా రాలేదు. కోరికతో యీ వేళ దేవుని పేరెత్తి, భక్తి అని మురిసిపోయి ఆ శక్తికి అపచారం చేశానని తనలోనున్న జ్ఞానమేదో తనమీద దాడిసలిపింది. తనలో ఆ ప్రయత్నంలేనిదే దేముడేం చేస్తాడని మనసుకు తట్టడంవల్ల నిద్దరపట్ట లేదు. లేచి లైటు వెలిగించాడు. తెల్లని కాగితం మీద ఒక బొమ్మవేశాడు. అడుగున పెద్ద అక్షరాలతో ఆ బొమ్మపేరు వ్రాశాడు. శాంతించి నిద్రపోయేవరకు ఆ బొమ్మవేపు చూస్తూనే వున్నాడు.

తెల్లవారేసరికి పని మనిషి గదితుడుస్తోంది. "మామ్మా! రాత్రీపగలు యిక్కడేవుండిపోకూడదూ ? మీవాళ్లని చూడాలనివుంటే అప్పుడప్పుడూ యింటికి వెళ్లివచ్చు" అన్నాడు. మామ్మ యింట్లో కనుక్కొని చెప్తానంది. ప్రొద్దున్న కాఫీ టిఫిన్ అయ్యేటప్పుడు మనిషి చెక్కు చెదరలేదు. తరవాత అలా ప్రెస్ వేపు వెళ్లిపోయాడు. శరీరాన్ని కష్టించకపోవటంవల్ల వచ్చే అనర్థమిదని స్ఫురించటంవల్ల ప్రెస్‌లో కూలీచేసిన పనికూడా చేశాడు. చేస్తున్నప్పుడు యెంతో గర్వించాడు. రోజూ దీనికి అలవాటుపడ్తున్న కొద్దీ తనలో ఆమెవేపు జూడకూడదన్న పంతం హెచ్చుతోంది. కానీ ఆ పంతంలో ప్రతినిముషం ఆమెనే తలుస్తున్నాడు. రాత్రుళ్లు యిదివరలా కల్పనా సాహిత్యాన్ని కాకుండా వేదాంత గ్రంథాల్ని తెచ్చి చదువుతున్నాడు. ఇంట్లో ఒంటరిగా వున్నప్పుడు ఆమెకళ్లకుకట్టే

యెదురుగా ఆ బొమ్మ పెట్టుకొని శాంతించావని చిరునగవు తెచ్చుకొనేవాడు.

నెలరోజులు గడిచాయి. అప్పుడప్పుడూ ప్రసన్న అక్కను జూడాలని వుందని అంటున్నా విననట్లే వూరుకొనేవాడు. ఒక్కొక్కసారి తొందరేం కాస్త నయమయ్యాక జూడవచ్చని యిలా మాటలతోనే గానిచ్చాడు. ఈ రోజు ప్రసన్న నిర్బంధించినట్లు మాట్లాడింది. ఇంట్లో పని మనిషి లేకపోవటంవల్ల తాళం వేసి బయలుదేరారు. టాక్సీలో కూర్చొని కదులుతున్నా తను యీమె మనసు కష్టపెట్టకూడదనే కనికరంవల్ల తీసుకవెళ్తున్నానని అనుకున్నా మళ్లీ యెందుకు వెళ్తున్నానని బాధపడుతూనే వున్నాడు.

ఇద్దరూ రావటంజూసి భార్య ముందుకొచ్చి కటకటాలనుంచి జూసింది. ఒక క్షణం అలా చిల్లంగి పెట్టినట్లు యిద్దరి ముఖాలవేపు జూసి పకపకా నవ్వింది. ఆగి యిద్దరికళ్లల్లోనికి జూడబోయింది. గోవిందరావు అప్పటికే ముఖంత్రిప్పేశాడు. ఆమె భర్తను జూపిస్తూ "చూడండీ అహహా - అ ముఖం చూడండీ!" వికటాట్టహాసం చేసింది. వెనువెంటనే కళ్లల్లో నీరుకారుకొచ్చినయ్. అలా కన్నీరు కారుస్తూ గజాలకు ఆన్చిన భర్తచేతిని పట్టుకొని యేడుస్తూ "మీరు యేమన్నారు? ఈ జీవితంలో ఒక మనిషికి ఒక స్త్రీకే సంబంధం. రేపు నేను చచ్చిపోతేనువ్వు, నువ్వుచచ్చిపోతే నేను-వచ్చే జన్మలో కలసిపోడానికి అలా వుండవలసిందే నన్నారు - జ్ఞాపకం తెచ్చుకోండి."

ఆమె అక్కడనుంచి చరచరా వెళిపోయింది మళ్లీ "ఊహు. ఊహు, - వెట్టిలోకం!" నవ్వుకుంది. ముఖం ముడుచుకొని మళ్లీ యేడ్చింది. ఇంతివరకు తలెత్తకండా నిల్చున్న గోవిందరావు తలెత్తేసరికి ప్రసన్నకళ్లు ఒత్తుకోవటం జూశాడు. భార్య ఒక్కసారి గట్టిగా గసిరింది "నివ్వెందుకేడుస్తావ్? నా వారిని నీవారిని చేసుకున్నావ్ గా? హాయిగా వుండండి"

గోవిందరావు చప్పున కదలగానే ప్రసన్న కొద్దిగా ఆగి యేదో అందామన్నా అనలేక మెల్లగా కదిలింది. "నర్స్ నర్స్!" అని అరుస్తూ వెళిపోతున్న భర్తవేపు జూపిస్తూ "ఆయన యెంత మంచివారు - యీ నాటికి...!" అంటూ గట్టిగాయేడుస్తోంది. కారు వెళిపోతున్నా యేడుపు వెంటనే వస్తున్నట్లుండటంచేత ప్రసన్న కళ్లలో నీరు చిమ్ముతూనే వుంది.

కారు సముద్రతీరానికి అంటుకొనివున్న రోడ్డుమీద పోతోంది. ఇద్దరూ వెనుక సీటులో రెండు చివరల్లో కూర్చొన్నారు. హాయినిచ్చే గాలివీస్తోంటే గోవిందరావు వుండివుండి ఆమెవేపు జూస్తున్నాడు ప్రసన్న అప్పుడప్పుడు దుఃఖితవదనాన్ని తనవేపు త్రిప్పుతోంది. క్షణక్షణాకి హెచ్చుతున్న వుద్రేకాన్ని అణచే ప్రయత్నంలోనే వున్నాడు. ఆమె దగ్గరగా జరిగి ఓదార్చాలనే కోరికకోరికలానే వుండిపోయింది.

కారు దిగి మేడమీదకు వెళ్లిపోయాడు. కొంతసేపయ్యాక టెర్రెస్ మీదకు వచ్చేసరికి సోమసుందరం యింటినుంచి వెళిపోవటం గమనించి ప్రసన్న తన పరిస్థితిచూసి లేరని జవాబు చెప్పివుంటుందని మళ్ళీ గదిలోనికి వెళిపోయాడు.

రాత్రి భోజనందగ్గర ఆ మూర్తి అంత సౌందర్యాన్ని రెట్టించుకున్నట్లగపడింది. సిగ్గువిడచి పదేపదే చూడాలనుకున్నా మనసు మళ్ళీ వెనుకకు లాగింది. ప్రసన్న ఒక్కమాటైనా అనలేదు. ఆనీలైన ముక్కు దిగువగా తేనెలొలుకు పూవుకత్తులనిపించే ఆ పెదాలవేపు లేచిపోతూ కదలలేక కదిలిపోతూ చూశాడు.

ఒంటిగా కూర్చున్న కాలమంతా ఆమె అందాన్ని ఆకళించుకున్న మధురక్షణాలయ్యాయ్. మళ్లీ నిస్పృహతో బరువెక్కిన మనసుతో గదిలోనికి వెళ్లి పరుపుమీద వ్రాలాడు. ఆమె కనురెప్పలు తన కళ్ళల్లో కదులుతున్నాయి. కోరికను ఆపలేని మనసులో యిదివరకు పెట్టుకున్న పాపభీతి అంతా యేదో స్వలాభంతోనే పెట్టుకున్నట్లనిపించింది అవును కాకపోతే నలుగురూ తను పవిత్రుడనుకోవాలనే వుబలాటేకదూ యిదంతా! తన కెందుకీ మనోవ్యధ? ప్రసన్నలోని మధురాన్నంతా తనెందుకు గ్రోలకూడదు? విపత్తులతో నిండిన యీ జగత్తులో యీ నమ్మకాలన్నీ పాతబడిపోయాయి. ఇన్ని కోట్ల ప్రజల్లో నీతిగా బ్రతికేవాళ్లెందరు? వాళ్లల్లో నేనొక్కడిని కాలేకపోతే నేం? తనకెందుకీ నీతి? లెక్చరరు గోపాలం తనను చిన్నప్పటినుంచీ కాళ్లు చేతులు కట్టేశారు. బోనులో పెట్టి సర్కస్ మాష్టర్లా ఆడిస్తున్నారు. గోపాలం యౌవనంలో కోరికల్ని కట్టుబాట్లు చేసుకొని వుంచగలిగాడా? ఆయనదంతా అబద్ధంతో కూడిన స్వంతడబ్బా. లోకం కళ్ళల్లో దుమ్ము కొట్టడానికే యివన్నీని. తను యీ తేనెను యెందుకు గ్రోలకూడదు?

కిటికీగుండా వెన్నెల పరుపుమీద పడుతోంది. లేచిపోయాడు పెరట ఓ క్రేన్ వేపు కాలు కదిపాడు. అప్పుడే చిన్నచిన్న మబ్బుముక్కలు చంద్రుని దాటి వెళిపోతున్నయ్. కారులో ప్రసన్నను జూస్తున్నట్లనిపించింది. అనుకోకుండా తలవంచాడు. పెరట తామరాకుల మధ్యతలెత్తి వికసించిన ఒంటరి తెల్లకలువలా వుంది ప్రసన్న!

మెరుపులాంటి తలపుతో గదిలోనికి వచ్చాడు. ఆమె తనలాంటి మనిషే. ఆమెదీ తనలా యౌవ్వనపు దశే. తనకుండే కోరికలు ఆమెలోనూ వుండాలి. లేదా అంటే కారులో - తన్మయమూ ముగ్ధమూ చేసే ఆ చూపూ - ఆ శక్తీ...మళ్ళీ మెల్లగా తొంగి చూశాడు. ఈసారి ఆమె కదలుతోంది - ప్రియుని కోసం వెన్నెల్లో వెదకే ఉజ్వలాభిసారికలా...!

నరాలిప్పుడు తన స్వాధీనంలో లేవు. గబగబ గదిలోనుంచి మెట్లవేపు నడిచాడు. ఎదురుగా చటుక్కున యెవరో కనిపించాగు. ముఖంమీద జుత్తు వ్రాలింది. అయినా దాటుకొని వెళ్ళినట్లు రెండడుగులు వేసేసరికి "అన్నయ్యా! ఇదేనా నీ పెద్ద మనిషి తరహా... నేనెంతో సంతృప్తితో చచ్చిపోయాను - కానీ నివ్వింత...!" వెళ్తూనే ఆగిపోయి వెనుతిరిగి జూశాడు. ఆ కనిపించిన వ్యక్తి తన గుండెల్లోనే బాధతో మూలుగుతున్నట్లనిపించింది. సాహసించి కాళ్లు కదుపుదామన్నా విరిగిపోయినట్లున్నాయి. పెద్ద నిట్టూర్పు విడిచాడు. తనకళ్లయెదుట తను వ్రాసుకున్న బొమ్మ వుంది అలా కళ్లు నిలబెట్టే ఒక్కొక్క అడుగూ మీదికి వేసాడు. ఇంకా మనసు ఆ వుద్రేకపు గుఱ్ఱం కళ్లెం లాగటానికే ప్రయత్నిస్తోంది. ముడతలుపడ్డ ముఖం యెముకలపోగు - యిదే ప్రసన్న - మళ్లీమళ్లీ అనుకున్నాడు. మనిషి రానురాను చిక్కిపోతున్నట్లనిపించింది. ఉద్రేకాలని అణచుకున్న మనుషుల జీవితాలే శాశ్వతంగా నిల్చిపోయాయి. తనొక రాజమార్గాన్ని వీడి క్షణికమైన ఆనందం, తృప్తికోసం త్రాగుబోతులా కాబోయానని తన్నుతాను దూషించుకోసాగాడు. ఆ యెముకలపోగును మనసులో దీక్షగా పెట్టుకుంటేనే గానీ నిద్దరరాలేదు.

తెల్లవారింది. లేవగానే పెరటవువల్లి తోటలోనికి జూశాడు. రాత్రివుండే ఆహ్లాదకరమైన వాతావరణం యేమీలేదు. అయ్యో! తనెంత తెలివిమాలిన పనిచేశాడు. మళ్లీ అటువంటి మధురక్షణాలు వస్తాయా?

కాఫీ త్రాగుతూ ప్రసన్న వేపు చూడబోతుంటే తమ్ముణ్ణిగురించి వస్తున్న తలపులను యేవగించుకున్నాడు. పోయినవాడు పోయాడు. వాడి గురించి తనెందుకంతగా తలచుకోవాలి? బలవంతాన తన ఆనందానికి అంతరాయం తెస్తున్న తలపులను ప్రక్కకు నెట్టగలుగుతున్నాడు. ఇదివరకు తనలోనున్న శక్తి తన నీతిని కాపాడుకోడానికే వుపయోగించేవాడు. తన కాలాన్ని యింకోలా వినియోగించటం నేర్చుకోలేదు. ఇప్పుడు ఆమె అందాన్ని గురించి కోరికతో కూడిన తలపుతో తప్పించి కాలాన్ని ప్రయత్నించినా యింకోలా వినియోగించలేక పోతున్నాడు.

ఆ వేళంతా యిల్లుకదల్లేదు. అప్పుడే చీకటిపడుతోంది. లైటు వెలిగించి క్రింద హాలులో ఒంటిగా కూర్చున్నాడు. ప్రసన్నగురించి అల్లుకుంటున్న భావాలు ఆనందోన్మీలనము కలిగిస్తునాయ్ సోమసుందరం ఆ సమయంలో వచ్చి యీ ఆలోచనలకు అడ్డుపడి చిరాకెత్తించాడు. కాస్సేపు మౌనంగా వుండి "గోవిందం!" అన్నాడు గోవిందరావు ముఖం తనవేపు త్రిప్పకముందే "నేనూ ప్రసన్న పెళ్లి చేసుకోడానికి నిశ్చయించుకున్నాం. ఆమెకు నివ్వు సంరక్షకుడవట నిన్ను చూడమని చెప్పింది"

గోవిందరావు చుట్టూ మంటలు లేచినయ్. సోమసుందరం మళ్ళీ అన్నాడు. "పెళ్లికి ఆమె యింత తొందరపడేది కాదు. పాపం! ఆమెనుంచి నీ భార్య నీ శీలాన్ని శంకించిందట. నన్ను తీసుకవెళ్లి యిదిగో యీయన నా భర్త అని చెప్తామని తొందరపడుతోంది" ఈ మాట లేవీ సరిగా గోవిందరావు చెవికెక్క లేదు. మంటల్లో ఒళ్ళంతా కాలిపోతోన్నట్లే బాధపడుతూనే "లేపురా" అని మూలిగాడు. సోమసుందరం కదిలాక నెత్తికొట్టుకొని యేడవాలనిపించింది. ప్రేవులన్నీ కవలిపోయినట్లు, హృదయం దిగజారిపోతున్నట్లు గింజుకుపోయాడు.

లేచి లోనికివళ్ళే సరికి ప్రసన్న చప్పున లేచి నిల్చుంది. ప్రతి కణంనుంచి పొంగుతున్న దుఃఖం, కోపం యీర్ష్య, అవమానం అన్నీ తనను నలిపివేస్తున్నయ్. ముఖం దించి పళ్ళతో దిగువ పెదిమను కఱచిపట్టాడు. నడుస్తూనే "ఒకసారిరండి" అన్నాడు' వేస్తున్న అడుగులు గుండెల్లో ప్రతిధ్వనిస్తున్నయ్. ఆమె ఆ వినీలపు చీర చెంగు నెత్తిన వేసుకొని వెంట నెమ్మదిగా నడచింది.

మేడమీద గదిలో లైటు వేశాడు. ఆమె తల వంచుకొని వెనుకనే నిల్చుంది. తిరిగి చూసేసరికి యెన్ని మాటలు ఆడాలనుకున్నాడో ఒక్కమాటా దొరకలేదు. శరీరమంతా బాధతో బరువెక్కిపోయింది. అర్థనిమీలిత నేత్రాలతోవున్న ఆ మూర్తి

వేపు చూస్తుండగానే నరాలన్నీ పట్టు తప్పి విజృంభించసాగినయ్. ఆ విజృంభణని అరికట్టలేదు - అరికట్టాలని ప్రయత్నించలేదు. డ్రాయరులోని బొమ్మతీసి ఆమె చేత పెట్టాడు. ఆమె దీక్షగా ఆ బొమ్మవేపు చూస్తోంది. ఉలకదు పలకదు. అంత చేరువగా ఆమె నిదివరకు చూడలేదు. ఆమెలోవున్న పెదాలతీపి, కళ్ళల్లోని తళుకు, ముఖంలోని మోదం అంతా కూడ క్షణక్షణానికి హెచ్చిపోయి తనను దగ్గరదగ్గరగా అయస్కాంతంలా ఆకర్షించుకుంటున్నయ్. ఒక్కసారి ఆమె అజంతాలోని అప్సరసకన్యలా ఆ యెత్తినతల చూసిన చూపు అలావుంచే చలనంలేకండా నిల్చుండిపోయింది గోవిందరావు ఆపలేని తలపు యేకాపు యేకంచేసి ఆ శిల్పాన్ని తల నుంచి కాళ్ళవరకూ నలిపివేశాడు. ఆమె అరవాలనుకుంది. గట్టిగా యేడవాలనుకుంది, చచ్చిపోయానే అనుకుంది కాని పెద్ద నిట్టూర్పైనా విడువలేకపోయింది. ఇన్నాళ్లూ యీ శువమీద వుంచే గౌరవం, నమ్మకం ఆ క్షణంలో ఆమెను అణచిపెట్టేశాయి.

గాలి వుడిగిన బంతిలా ఆమె కాళ్ళదగ్గర పడి వున్నాడు. ఒకరాతిని వుద్రేకంలో కౌగలించుకొని వున్నత శిఖరంనుంచి గడగడా క్రిందికి దొర్లి బురదగుంటలో పడ్డవానియట్లే చూస్తున్నాడు. ప్రసన్న ఆ నలిగిన బొమ్మతో కళ్లు కప్పుకొని వెక్కి వెక్కి యేడుస్తోంది. ఆ బొమ్మను అక్కడే పారవేసి కదలిపోయింది. క్రిందపడున్న బొమ్మ కన్నీటితో తడిసినా యెర్రటి మచ్చలతో వున్నట్లు కనపడింది. ఈ బొమ్మ వేసిన యిన్నాళ్ళకి యీ వేళ దానిలో ముసితలుపడ్డ శరీరం, యెముకలపోగు నిజంగా చూశాడు.



# ప్రీరేఫియలటిజము



**శ్రీ మొక్కపాటి కృష్ణమూర్తి**

ఫ్రాంసులో ఇంప్రెషనిజమునీ, పోస్టు ఇంప్రెషనిజమునీ యువచిత్రకారులు గతానుగతికమైన కళారీతులమీద దాడి సాగించిన ముప్పది సంవత్సరాలకు ఇంగ్లండులో ప్రీరేఫియలిటిజమనే వెల్లువవచ్చింది. ఆంగ్లకళా ప్రపంచంలో క్రొంగొత్త కళాలక్ష్యాలతో దిగ్విజయంగా సాగిన ఆ మహోద్యమమూ - దాన్ని నిర్వహించిన ప్రీరాఫియలైట్ సోదరులగూర్చీ మనవి జేస్తాను.

ఆరోజుల్లో, కింగ్సు కాలేజీ స్కూలులో ప్రసిద్ధుడైన జాన్ సెల్ కాట్ మన్ శిల్పాచార్యుడుగా ప్రవాసంలో ఉండేవాడు. ఆయన ఛాత్రవర్గంలో వైదేశిక వైలక్షణ్యముతో ఒకవింత బాలుడుండేవాడు. లండనులో ఉన్న దేశభక్తుడైన ఒక ఇటాలియన్ కవి అనుగు కుర్ర ఆ బాలకుడు. అతనే తరువాత మిలియాసు, హోల్మనుహంటుతో కలిసి ప్రీరేఫియలైట్ సోదర సమితి స్థాపించాడు—డాంటే గేబ్రియల్ రోజెట్టి!

ప్రీరేఫియలిటిజము తీసుకువచ్చింది రోజెట్టి అని కొందరు, హోల్మను హంటని కొందరు, మిలియాసని కొందరు నిరూపిస్తూ అనేక గ్రంథాలు రాశారు, కాని ఈ ముగ్గురు 1848 లో ఒకరినొకరు కలుసుకునేదాకా ఇంగ్లాండులో ఏకళాసందలనము రాలేదు. సుప్రతిభులైన ఈ ముగ్గురి విశిష్ట కళాప్రాభవోన్మేషమే ప్రీరాఫియలిటిజము. దాన్ని సమర్థంగా తీవ్ర ప్రతివిమర్శలకు తట్టుకొని విజయవంతంగా నిర్వహించింది వారి ప్రత్యేకోపజ్ఞా సమంచితమైన సంఘటిత కళా ధౌరంధర్యమే అనాలి.

రస్కిను దృష్టిలో రోజెట్టి ఆ ముగ్గురిలో ముఖ్యమైన మేధానిధి. అతనిలో ఉన్న దీప్తి, ఆవేగము, కవితాశీలత సమితికి అమూల్యమైన ప్రాభవాన్ని గడించిపెట్టినాయి. కాని, తద్వృత్తి విధానంలో మిగతా ఇద్దరికన్నా చాల వెనుకబడి ఉండేవాడు. అతనికి, భావాలకు లోటులేదు. అయితే వాటిని చిత్రాలుగా రూపించడంలో రోజెట్టి అసమర్థతవ్యక్తమవుతూ ఉంటుంది. రచనా ప్రాభవాన్ని పెంపొందించుకోటానికైన శిక్షణ అతనికి సవ్యంగా లోపించి.

మరి మిలియాసు అట్లాగాదు. అతను ఎప్పుడూ స్వతంత్ర భావాలకు కాక రచనాపాటవానికే ప్రసిద్ధుడు. చాల చిన్న వయస్సులోనే అద్భుతకళా ప్రభుత చెలాయించేవాడు. అతని ఆరితేరిన చేతికి కష్టాక్లిష్ట ప్రసంగాలు ఒక సమస్యగా ఉండేవి కావు.

ఇక హోల్మను హంటుకు, మిలియాసు రచనా సౌలభ్యముగాని, రోజెట్టి తాలూకు విశృంఖల రసావేశము గాని లేవు. అతనిలో ప్రస్ఫుటమైయ్యే విశేషము, ఉదాత్తమైన కార్యదీక్ష, కళాలక్ష్యాల్లో సునిశ్చితమైన మనోధృతి. దీనితోనే హోల్మను హంటు మిగతా ఇద్దరిని పట్టిఉంచి, ఉన్నతాదర్శాల వైపు ఉన్ముఖుల్ని చేశాడు.

ప్రీరేఫియలిటిజము అంటేగాని, అది పొందిన పరిణామం గాని వివరించేముందు దాన్ని స్థాపించిన ఆ ముగ్గురు చిత్రకారుల పుట్టుపూర్వోత్తరాలు కొంచెము చెప్పాలి. విలియమ్ హోల్మనుహంటు ముగ్గురిలో పెద్దవాడు. ఛీప్సైడులో 1827 లో జన్మించాడు. తండ్రి ఒక ఖాయిదా కొట్టునడిపేవాడు. కొడుకు చిత్రకారుడవటము ఆయన కిష్టము లేదు. ఒక ఎస్టేటు ఆఫీసులో గుమాస్తాగా ప్రవేశపెట్టాడు. హంటుకు అప్పుడు పన్నెండేండ్లు. అక్కడ ఉన్న అధికారి కుర్రవాడిలో ప్రస్ఫుటమైన కళాతృష్ణ గ్రహించి ప్రోత్సహించాడు. ఇక తండ్రి గత్యంతరములేక అతనికివచ్చే జీతము కళాసముపార్జనకు ఖర్చుపెట్టుకోడానికి ఒప్పుకున్నాడు. హోల్మనుహంటు ఒక రూపచిత్రకారునివద్ద చిత్రవిద్య ప్రారంభించాడు. చివరకు తండ్రి తన బాధ్యత ఏమీలేని పద్ధతిని పూర్తిగ కళాజీవనము స్వీకరించడానికి

హోల్మనుకు అనుమతి ఇచ్చాడు. ఈ విధముగా హోల్మను హంటు తన పదహారవఏట బ్రిటిషు మ్యూజియములో వారంలో సగము కళాసాధన చేస్తూ, మిగతా కాలంలో తాను రచించిన రూపచిత్రాలద్వారా మనుగడ గడుపుకుంటూ ధైర్యంగా కళాదీక్ష స్వీకరించాడు. క్రమేణా ఎకాడమీ స్కూళ్ళలో ప్రాథమిక శిక్షణకు అనుమతిపొందాడు. ఇక్కడే మిలియాసు పరిచయం అయింది హంటుకు.

జాను ఎవరెట్టు మిలియాసు సౌతాంప్టన్‌లో 1829 లో పుట్టాడు. ఇతని తండ్రి కొంచెము ప్రసిద్ధమై వ్యుత్పన్నత, కళాభిరుచిగలవాడు. కుర్రవాడిలో మొలకెత్తిన కళాబీజములకు మొదటినుంచీ దోహదము చేశాడు. మిలియాసుకు ఎనిమిదవఏడు వచ్చేప్పటికే లండనులో మకాం పెట్టి అప్పుడు రాయలెకాడమీ ప్రెసిడెంటు అయిన మార్టిను ఆర్థరుషి సలహామీద ఒక ఆర్టు స్కూలులో చేర్చాడు, మిలియాసు కళా ప్రజ్ఞ ఆశ్చర్యకరంగా ఉండేది తొమ్మిదవఏటనే అతని చిత్రానికి ఆర్ట్సు సంఘమువాళ్ళ రజతపతకం బహూకరింపబడింది. రెండేళ్ళ తరువాత రాయల్ ఎకాడమీ స్కూళ్ళలోకి ప్రవేశంపొందాడు. ఆ పసిప్రాయంలో ఆ స్కూళ్ళలో ప్రవేశంపొందినవాళ్లు నభూతో నభవిష్యతి! అప్పటికే ప్రసిద్ధుడైన యువ చిత్రకారుడు, థామసు లారెన్సు కళానైదగ్ధ్యము తలపుకు తెచ్చేవాడు.

మిలియాసుకు పన్నెండవ ఏటనే, నూనెరంగులలో అతని మొదటి త్రివర్ణ చిత్రం తయారయింది. పదహారేళ్ళకల్లా సంవత్సరానికి వంద పౌనులు బొమ్మలమీద సంపాయించాడు. ఆ రోజుల్లోనే రెండు పెద్ద చిత్రాలు తయారుచేశాడు. ఒకటి చారిత్రికచిత్రం. పెరు రాజును పట్టుకుంటున్న పిజారో చిత్రం. అది ఈనాడు సౌత్ కెన్సింగుటన్ ఆల్బర్టు మ్యూజియమ్‌లో ఉంది. రెండో చిత్రం "వరాన్వేషణ"కు స్వర్ణపతకం బహూకృతి లభ్యమయింది. అయితే ఈ చిత్రాలు వేటిలోనూ ఆ కాలం చిత్రాలమీద విప్లవంతీసుకువచ్చే సూచనలేవీ కనిపించవు. హోల్మను హంటూ, తనూ, ఆనాటి కళారీతులమీద చర్చలు జరుపుకుంటూ ఉండేవాళ్లు పాతపద్ధతులమీద అసంతృప్తికూడా ఉండేది. కాని రోజెట్టితో పరిచయమయేదాకా కళాలక్ష్యాలలో ఒక దృక్పథమంటూ ఏర్పడలేదు.

కింగ్సు కాలేజీ స్కూలులోను, ఇతరత్రా కొంత సాధనచేసి రోజెట్టీకూడా రాయల్ ఎకాడమీ లైఫ్ క్లాసులోకి కాకపోయినా- యాంటిక్ స్కూళ్ళలోకి ప్రవేశం సంపాయించాడు.

రోజెట్టి లండనులో 1828 లో జన్మించాడు. ఇతను మిలియాసుకన్న ఒక ఏడు పెద్ద హంటుకన్న ఒక సంవత్సరము చిన్న. మొత్తానికి వాళ్ళతో సమవయస్కుడే అయినా కళాదేశికుల దృష్టిలో చూస్తే చాలలోజ్జు. అందుకనే హోల్మను, మిలియాసు అప్పటికే సజీవ మానవాకృతుల్ని రంగుల్లో రేఖల్లో చిత్రించుకుంటుంటే - రోజెట్టి నిర్జీవశిలా ప్రతికృతులనుంచి రచనలు చేస్తూ ఉండవలసివచ్చింది ఈ దుర్భరయాతన రసోన్మాదియైన రోజెట్టి భరించలేకపోయాడు

ఒక ప్రదర్శనంలో ఫోర్డుమెడాక్సు బ్రౌను చిత్రం చూసి సమ్మోహితుడై అతనికి శిష్యుడయ్యాడు రోజెట్టీకి రంగులు, తూలికలు పట్టుకోడానికి అనుమతి వచ్చింది. కాని అచేతనమైనవస్తు సముదాయమే ముందు సాధనచేయాలని ఆదేశించాడు బ్రౌను. రోజెట్టి అక్కడ నాలుగు నెలలుండి కుండలు మూకుళ్లు తను చిత్రించలేనని తప్పుకున్నాడు.

అపురూపమైన అతని మనోవీధిని తరళితమయ్యే కలల్లో, రసనిమ్నగలైన అంగనలు, వాళ్ళను రక్షించడానికి ప్రాణాలు తృణప్రాయంగా ఒడ్డే వీరాధివీరులు. ఆ అమరగాథలూ తరంగితమయ్యేవి!

ఫోర్డుమెడాక్సు బ్రౌను ఎప్పుడూ ప్రీరేఫియలైట్ సోదరసమితిలో సభ్యుడుకాదు. కాని వాళ్ళ భావాలతో, చిత్రలక్ష్యాలతో సన్నిహిత సంబంధం ఉండటంవల్ల ప్రీరేఫియలిటిజమ్ అన్నప్పుడు అతని ప్రసక్తి వస్తుంది.

మెడాక్సు బ్రౌను హోల్మను హంటుకన్న ఆరేళ్లు పెద్ద. అతను కాలైలో, డేవిడ్ మొదలైన క్లాసిక్ చిత్రకారులు ఫ్రాంసులో ఒక క్రొత్త కళాదర్శము రూపొందిస్తున్న రోజుల్లో జన్మించాడు. మళ్ళీ బ్రౌను కుంచెపట్టేనాటికి, ఆ క్లాసిసిజమును, తరువాత వచ్చిన, రొమాంటిక్ మువుమెంటు ఎదుర్కొన్నది. ఆ ఉద్యమంతో బ్రౌను ఏకీభవించాడు. ఈ విధంగా మెడాక్సు బ్రౌనుకు యూరపు అంతర్జా

తీయ చిత్రకళా విధానాలతో పరిచయముంది. ఆ అవకాశం చాలమంది ఆంగ్లచిత్రకారులకు లేదు. విశాలయూరపులో బ్రూజెల్సు, ఘెంటు, ఏంటి వర్పుల్లో కళాసాధనలు చేసి, చివరకు ఫ్రాంసులో మూడు సంవత్సరములు ఉన్నాడు.

ఇదిగాక అతని కళాజీవనంలో ఇంకొక అపురూపమైన సంపర్కం వచ్చి పడింది 1844 లో ఇంగ్లండు వచ్చేసినాక మళ్లా రోముకెళ్లాడు. అక్కడ ఇద్దరు జర్మను చిత్రకారులతో పరిచయమయింది. కార్లీనియసు, ఒవర్ బెక్కు అనే ఆ చిత్రకారులు భిక్షుక జీవనము గడుపుతూ, రాఫియలుకు పూర్వీకులైన ఇటాలియను ప్రిమిటివు చిత్రకారుల మానసికవృత్తి అలవరచుకొని, వాళ్ళపవిత్ర స్వచ్ఛత తమ చిత్రాల్లో నిలుపుకోవాలని కృషిచేసిన మొదటి ప్రీరేపెయలైట్సు అని చెప్పవచ్చును. గుహల్లో, మఠాల్లో నివసిస్తూ కఠోరనియమములతో ఆత్మపారిశుధ్యంకో సంశరీరాన్ని కృశింపజేస్తూ చిత్రరచన చేశేవాళ్లు. తమ చిత్రాల్లో భౌతికఛాయలు వస్తాయని మానవరూపాల్ని కూడా నమూనా తీసుకునేవారు కారు.

వాళ్ళ కర్కశ జీవనంలో, కఠోరనియమాల్లో ప్రభవిల్లినకళ బ్రౌనును ఆకర్షించలేను గాని, అతని దృష్టిని పూర్వపు ఇటాలియన్ చిత్రకారులవైపు మరలించింది. ప్రకృతిని ఇంకో దృక్కోణంలోంచి చూడవచ్చని అతనికి కనువిప్పయింది.

ఇటలీ కళా మహాసాంప్రదాయము ఒక సుదీర్ఘ కాంతి వీచిక అనుకుంటే - రేఫియల్, మైకేల్ ఏంజిలో, లీనార్డో డావింసే ఆవీచిక తునిపెలుగులని మనం ఈనాడు అనుకుంటున్నాము. కాని ఆ రోజుల్లో, రేఫియల్ తోనే ఒక మహావినూత్న కళాయుగం ప్రారంభం అయిందని నమ్మేవాళ్లు. దానితో అనేక అప్రసిద్ధులు పెద్ద చిత్రకారుల కోవలో చెలామణి అయినారు. కార్లీనియసున్నూ, ఒవర్ బెక్కున్నూ రాఫియల్ కు పూర్వపు చిత్రగారులనే ఆదర్శముగా తీసుకోటములో ఎంతైనా మార్గదర్శకులైనారు. కాని వాళ్ళను గుడ్డిగా అనుకరించి, రాఫియల్ తరువాత వాళ్లు తయారుచేసినట్లే, కళమీద ఆధారపడిన కళని తయారుచేశారు.

ఆ ఇటాలియను చిత్రకారులను చూసి మెడాక్సు బ్రౌను నేర్చుకున్నదేమంటే - వాళ్ళను అనుకరించడం కాదు, ఇటాలియన్ ప్రిమిటివులవలె తను కూడా ప్రకృతిని స్వంతంగా చూడటం! అల్లా చూస్తే పూర్వపు చిత్రాల్లోకన్న ప్రకృతిలో ప్రతిదీ ఉజ్వలకాంతిమయంగా కనపడసాగింది. రెయినాల్డ్సూ, సర్ జార్జి బియమాంటు నాటినుంచి చిత్రం బూడిదరంగులో ఉండాలనేది మహానిర్వచనమైపోయింది. ప్రకృతి చిత్రకారులు కొందరు ఎదురు తిరిగినా, మళ్లా మెడాక్సు బ్రౌను, ప్రీరేఫియలైట్సూ తేజోవంతంగా చిత్రాలు రచించి ప్రదర్శించేదాకా అనూచానపద్ధతి కాదన్నవాళ్లు లేకపోయినారు.

ఈ బూడిదరంగు చిత్రాల్లో ఎల్లావచ్చిందీ? అంటే - ప్రసిద్ధులైన, రెంబ్రాండ్టు, టిటియాన్, టింటరెట్టో మొదలైనవాళ్ళ చిత్రాలు బూడిదరంగులో ఉండేవి. అందుచేత తమ చిత్రాలుకూడా ప్రసిద్ధము కావాలంటే ఆ రంగుల్లోనే ఉండాలి. అందుకు ప్రతి చిత్రకారుడు బూడిదరంగు వాడేవాడు. మొదట ఆ చిత్రకారులు స్వచ్ఛమైన రంగులు వాడినా కాలంగడిచిన కొద్దీ ఆ రంగుమారి ఉండవచ్చు. అది గమనించక, ఎదురుగుండా ఉన్న ప్రకృతిని చూడక, కృత్రిమమైన ఆ బూడిదరంగు కోసం చిత్రాన్ని బ్రౌను క్యాన్వాసుమీద చిత్రించేవాళ్లు, కాని మెడాక్సు బ్రౌను ఆ ఆచారం తప్పించి స్వచ్ఛమైన తెల్లని భూమికమీద చిత్రణప్రారంభించి వర్ణస్వచ్ఛత, ప్రకృతి సహజత సమకూర్చాడు చిత్రాల్లో.

1846 లో ఫోర్డు మెడాక్సు బ్రౌను మళ్లా ఇంగ్లండులో అడుగుపెట్టేప్పటికి, హోల్మను హంటు, మిలియాసు, తాను స్వతంత్రంగా అల్లుకున్న అభిప్రాయాలే ఒకళ్ళొకళ్ళతో కూడబలుక్కుంటున్నారు. ఈ విధంగా ప్రీరేఫియలైట్ సోదరుల భావాలకు, తనకూ సాజాత్యత ఏర్పడినట్లయి, ఆ పద్ధతులలోనే చిత్రించుకుంటూండే వాడు మెడాక్సు బ్రౌను.

రోజెట్టికి, హోల్మను హంటుకు, ఒకళ్ళొకళ్ళకు తెలియకుండా, ఇద్దరకూకీట్సు కవిత అంటే అనురాగం ఉంది. ఆ అనురాగమే వాళ్ళిద్దరినీ దగ్గరకు చేర్చింది. 1848 లో రోజెట్టి మెడాక్సు బ్రౌనును, తన్ను శిష్యుణ్ణిగా అంగీకరించవల్సిందని ప్రాధేయపడ్డాడు. ఆ సంవత్సరమే ఎకాడమీ

ప్రదర్శనలకు హోల్మను హంటు కీట్సు పద్యము ఒకటి ఉపస్ఫూరకంగా రచించిన చిత్రము పంపించాడు. ఆ చిత్రమే రోజెట్టికి, హోల్మనుహంటుకు ఆ జన్మ స్నేహము కలిపింది. హోల్మను హంటు పెద్దవాడయాక తన పూర్వస్మృతులలో ఈ సంఘటన గూర్చి ఆప్యాయంగా వ్రాసుకున్నాడు. వారి ప్రథమ సమాగమము ప్రదర్శనశాలలో నే సంఘటిత మైంది. రోజెట్టి పట్టరాని ఉద్వేగంతో హోల్మను హంటువద్దకు వెళ్ళి అతని చిత్రము ఒక్కటే ప్రదర్శనము మొత్తానికి మహోత్కృష్టమైనదని చెప్పాడు. ఎబ్బెరికం లేకుండా హంటును తన యింటికి ఆహ్వానించాడు. అంతకు ముందు వాళ్ళకు ముఖపరిచయం మాత్రం ఉండేది. రోజెట్టి చాల అరుదుగ క్లాసులకు వస్తూ ఉండేవాడు. మిలిమాసు మట్టూ మాగి నట్టుగానే, రోజెట్టి చుట్టూకూడ సోత్సుకులైన విద్యార్థి బృందము పరివేష్టించి ఉండేవాళ్ళు. వాళ్ళకప్పటి కప్పుడు భావ చిత్రాలుగీచి యిచ్చేవాడు. మిలిమాసు చిత్రాల్లోలాగ కాక రోజెట్టి చిత్రాల్లో సుందర స్త్రీలు వాళ్ళని రక్షిస్తున్న వీరయోధులు ఉండేవాళ్ళు.

హోల్మను హంటతో పరిచయమైన కొద్ది రోజులకే, రోజెట్టి మేడాక్సు బ్రౌను దగ్గరనుంచి వచ్చేసి, హంటు స్టుడియోలో అతని ఆ సరాతో, తన మొదటి ప్రసిద్ధమైన చిత్రం "మేరీబాల్యం" చిత్రించాడు.

రోజెట్టికి, హోల్మను హంటు స్నేహితుడైన మిలియాసుతోకూడ గాఢమైత్రి ఏర్పడింది. దానితో సోదరబృందం తయారయింది. ఒక రోజు సాయంకాలం మిలియాసు ఇంట్లో కొన్ని ఇటాలియను చిత్రాల ప్రతికృతులు చూసిన మీదట జరిగిన చర్చల పర్యవసానంగా సమితిరూపొందింది. రాఫియల్ పూర్వికులంటే ఈ చిత్రకారులకున్న అభిమానాన్ని సూచనచేస్తూ "ప్రీరేఫియలైట్సు" అని ఎవరో అన్నారు. ఆ వాళ్ళ బృందానికి పేరుగా ఉంచుకున్నారు. ఈ విధంగా ప్రీరేఫియలైటు బ్రదర్ హుడ్ తయారయింది. వాళ్ళ ముఖ్య ఆదర్శాలు ఏమంటే - చిత్రాలు ప్రకృతికి చాల సన్నిహితంగా ఉండాలనీ, పూర్వపు ఇటాలియన్ చిత్రకారులలోవలె హృదయగ్రాహిత - నిజాయితీ కలిగి ఉండాలనీను - చిత్రాలు కవితామయాలుగా కూడా ఉండాలనీ రోజెట్టి అనుకున్నాడు.

ఈ ముగ్గురే కాక, సోదరబృందము విస్తరింప జేశారు. రోజెట్టి సోదరుడు విలియమ్ రోజెట్టి, అతని స్నేహితులు థామసు ఉల్నర నే శిల్పి, జేమ్సు కాలిన్సు, ఎఫ్. జి. స్టీఫెన్సు సోదర సభ్యులుగా చేరారు. కొన్నాళ్ళకు విలియమ్ రోజెట్టి, స్టీఫెన్సు చిత్రరచన విరమించుకొని కళావిమర్శకు లయ్యారు. వాళ్ళ ఉత్సాహకరమైన కళావ్యాసాలవల్ల జన బాహుళ్యంలో సోదర బృందము కృషి బహుళ ప్రచారం పొంది సమాదరణీయం అయింది.

కళా విద్యార్థులు, యువచిత్రకారులు కలిసి సమితులుగా ఏర్పడటం - కళాదర్శాలు, రచనా విధానాలు చర్చించుకోవడము - అదో కొత్త విషయం కాదు. తరుచు జరుగుతూనే ఉంటాయి. అయితే అవి అన్నీ చివరకు క్రియాశూన్యంగా పరిణమిస్తాయి. కాని మిలియాసు, హోల్మను హంటు విషయంలో ఒక కళా విప్లవంగా, రోజెట్టి విషయంలో మొదటి ప్రయత్నంలోనే ఒక మహోత్కృష్ట చిత్రంగా పర్యవసించింది అకలయిక !

1848 లో కూడా మిలియాసు తనచిత్రం పూర్వపు పద్ధతిలోనే చిత్రించాడు. కాని 1849 లో "లోరెంజా, ఇసబెల్లా" అనే చిత్రం పూర్తిగా ప్రీరేఫియలైటు సిద్ధాంతాను సారం తీర్చి దిద్దాడు. ఒక్క సంవత్సరంలో అంతమార్పు రావడానికి వాళ్ళ స్నేహమే కారణం. ఆ సంవత్సరమే హంటు తన ప్రథమ చిత్రానికి దీటయిన "రియన్జీ" అనే చిత్రం చిత్రించాడు, ఏమయితే నేం, వీటన్నిటిలోకీ రోజెట్టి రచించిన "మేరీబాల్య" మే గొప్ప చిత్రము, మిలియాసు చిత్రంతో పోల్చినప్పుడు అక్కడక్కడ కృత్రిమంగా కనిపించవచ్చును. కాని అదే అచ్చమైన ప్రీరేఫియలైటు చిత్రము అనాలి. అకృత్రిమమైన యదార్థరచనకు తార్కాణంగా తీసుకోవచ్చు. ఆ చిత్రంలో ప్రతివస్తువు తన పర్యవేక్షణ క్రింద ప్రకృతినుంచి చూసి చిత్రించబడిందని హంటు చెప్పాడు. సంఘము స్థాపించిన మొదటివిడతే అందరిలోకీ భావచిత్రకారుడైన రోజెట్టి అత్యుత్తమమైన ప్రకృతి సిద్ధమైన చిత్రం తయారు చేశాడంటే హోల్మను హంటు ప్రభావం రోజెట్టిపై ఎంత సమర్థకంగా పని చేసిందిద్యోతక మవుతుంది.

రోజెట్టితో వచ్చిన పేచీ ఏమంటే— ప్రతిదీ తన ఊహల్లోనించి చిత్రిస్తానంటాడు. హంటు చేసిన దేమంటే రోజెట్టిని తనకు వచ్చిన భావం చిత్రించ మన్నాడు. కాని అందులో వస్తుజాలం మాత్రం ప్రకృతినుంచి చూసి చిత్రించాలి. మెడాక్స్ బ్రౌనుదగ్గర మృణ్మయపాత్రిక చిత్రించడానికి వప్పుకోలేదు. అదే ఇప్పుడు సంతోషంతో చూసి చిత్రించాడు. ఎందుకంటే అందులో తన కిష్టమైన భావనకు వ్యంజకమైన తెల్లకలువ ఉన్నది గనుక. అతని జీవితంలో ప్రప్రథమంగా రోజెట్టి వస్తుజాలంలో ఆసక్తి చూపించాడు. ఏమంటే అవి తన భావాల్ని వ్యక్తం చెయ్యడానికి అవసరమయ్యాయి. తన తండ్రి దగ్గరనుంచి పెద్ద పెద్ద పుస్తకాలు తెచ్చాడు. ఇంటదగ్గరనుంచి కిటికీ తెరలు తెచ్చాడు. తన సోదరి క్రిస్టినా, మేరీగా కూర్చుంది. తల్లి సెయింట్ యాని. దేవదూత ఒక కీలుబొమ్మ. ఇల్లా ఇవన్నీ అతని ప్రసను ప్రయత్నంగా కూర్చి చిత్రించబడినా అతని భావనా బలంవల్ల ఆ చిత్రం లోకోత్తరంగా తయారయింది.

ఆ సంవత్సరము అకాడమీ ప్రదర్శనలకు "పియట్ట", "ఇసబెల్లా, లోరంజో" ఇచ్చి, హైడ్ పార్కు గ్యాలరీలో "మేరీబాల్యం" ప్రదర్శించారు. కాని కళాలోకంలో ఏమీ సంచలనం కలుగలేదు. రోజెట్టి బొమ్మమీద పి. ఆర్. బి. అక్షరాలు చూసి కూడా ఎవరూ మాట్లాడలేదు. అయినా నిస్పృహ చెందక సోదరబృందము క్రొత్త చిత్రాలద్వారా, స్వీయపత్రికా ముఖాన, వ్యాసాలద్వారా తమ కళాలక్ష్యాలు ద్విగుణీకృతంగా ప్రచారం చేశారు.

సొంత పత్రిక "జెరమ్" లోకి వ్యాసము కోసము ఆ వేసగిలో రోజెట్టి, హోల్మను హంటుకలిసి ఫ్రాంసు, బెల్జియము పర్యటించారు. వ్యాసం తయారయింది; కాని అది చాల ఆత్మపరంగా ఉండటమువల్ల ప్రచురించలేదు. తమ పర్యటనలో చూసిన కళాఖండాలను తీవ్రముగా విమర్శించారు. వేన్ అయిక్ మొదలైన తొలి చిత్రకారుల కృతులు చాల మెచ్చుకున్నారు. రెంబ్రాండ్టునుంచి, రూబెన్సు దాకా అంతా చెత్తకింద జమకట్టారు.

యూరపు యాత్ర తరువాత సోదరబృందము తమ చిత్రాలు ప్రకృతి సిద్ధంగా, నిజాయితీగా ఉండటమే కాకుండా ఉదాత్త భావ విలసితంగా కూడా ఉండాలని నిర్ణయించుకున్నారు. అందుకని ఆ సంవత్సరము చిత్రాల్లో ముఖ్యంగా పౌరాణిక విషయాలు తీసుకున్నారు. రోజెట్టి "ఎనన్సియేషను" అనే చిత్రం, మిలియాసు "క్రైస్తుబాల్యం", హోల్మను హంటు "డ్రూయిడ్సునుంచి తప్పించుకున్న క్రిష్టియన్ మిషనరీ" చిత్రించారు. ఈసారి మిలియాసు చిత్రం అచ్చంగా ఉద్యమ నియమాలన్నీ పుణికి పుచ్చుకుంది. ఆ విషయంలో హంటునికూడ మించిపోయాడు. ఇక రోజెట్టి చిత్రం, క్రితము ఏటిది, అన్ని విధాలా ప్రిరేఫియలైటు చిత్రం అయితే ఆ ఏటిది వాళ్ళ నియమాలన్నీ పూర్తిగా అతిక్రమించింది. అతిలోకం అయిన ఆ చిత్రం, చూసిన విషయాల కూర్పు కాదు. రసస్ఫూర్తిమైన ఊహాచిత్రం! అది ఒక మధురస్వప్నం! ఈ చిత్రంలోనూ, మేరీగా, సోదరి క్రిస్టినా కూర్చున్నది. ఉల్నరు దేవదూతగ నిల్చున్నాడు. అయినా ఆ చిత్రం భౌతిక వాసనా లేశం అంటని దేవమందారం!

మళ్ళీ అకాడమీ తెరిచేప్పటికి సోదరబృందము ఉనికి, వారి కళాలక్ష్యాలు ప్రస్ఫుటంగా వ్యాప్తిలోకి వచ్చాయి. ఆ సంవత్సరం పెద్ద సంచలనం కలుగజేసినాయి క్రొత్త చిత్రాలు. ప్రత్యేకము మిలియాసు చిత్రంమీద విరుచుకుపడింది విమర్శకలోకం. ప్రిరేఫియలైటు అనే పదానికి తప్పు అర్థంతీశారు. రాఫియల్ కన్న గొప్పవాళ్ళమనే అహంభావం, దురాశా, అవినయం ప్రదర్శిస్తున్నారని - ప్రసిద్ధి కోసం అపమార్గాలు చేపట్టటం యువకుల్లో సల్లక్షణం కాదనీ - ఒక పత్రికా విమర్శకుడు రాశాడు.

మిలియాసు చిత్రం వడ్రంగి కార్ఖానా అని నిందించారు. క్రీస్తు బాల్యం, తల్లిదండ్రులైన వడ్రంగుల కార్ఖానాలోనే గడచింది. ఆ వాతావరణం కోసం మిలియాసు చాలా ప్రయత్నించాడు. అందుకు డికెన్సు మొదలైన ఆ నాటి ప్రసిద్ధులే తిట్టిపోశారు. అతి లోకంగా చిత్రించిన ఆ బైబులుగాథ మన హృదయాలు కదిలిస్తుంది. కాని ఆ నాటి ప్రేక్షక లోకానికి వెర్రులెత్తించింది.

ఇంత జరిగినా ఒక సహృదయుడు "క్రైస్తు బాల్యం" నూట అరవయి పౌనులకు కొని దానిమీద వచ్చిన ప్రతికూల విమర్శలన్నీ ఆ బొమ్మ వెనుక

తటునే అతికించాడు. ఆ సంవత్సరాంతానికి హంటు చిత్రంకూడా అమ్ముడు పోయింది. ద్విగుణీకృతోత్సాహంతో నూత్న చిత్ర నిర్మాణానికి పూనుకున్నారు. హంటు "ఇద్దరు వెరోనా పెద్ద మనుష్యులు" అని, మిలియాసు "ఆటవికకన్య" అని చిత్రాలు రచించారు. ఈ చిత్రాల్లో అధికతరమైన వర్ణ సముజ్జ్వలత సాధించారు. తెల్లని తడియారని చిత్రఫలకంమీద బొమ్మవెయ్యటంవల్ల ఈ దీప్తి వచ్చిందనీ, అదే పూర్వపు ఇటాలియను చిత్రకారుల రచనా రహస్యమనీ గ్రహించుకుని మురిసిపోయారు. ఈ కిటుకు మెడాక్సు బ్రౌనుకు హంటు చెప్పాడు. అందుకనే ఆయన చిత్రాలు 1851 తరువాతవి ఎక్కువ వర్ణాత్మకంగాను, ప్రకాశమానంగాను తయారయినాయి.

రొజెట్టి ఆ సంవత్సరము నూనె రంగులతో ఒక చిత్రం ప్రారంభించాడు. అందులో విషయం బ్రౌనింగు పద్యంలో భావం. అది పూర్తికాలేదు. అందుకని మిలియాసు, హంటు మాత్రం ప్రదర్శనకు బొమ్మలు పంపారు. ఈసారికూడా విమర్శకులు 'దురుసుతనం' అనీ, అపక్వసిద్ధాంతాలనీ విమర్శించారు.

అనుకూల విమర్శలూ వచ్చినాయి. విలియము రొజెట్టి అప్పటికి కళావిమర్శకుడుగా జీవితంలో స్థిరపడిపోయాడు. అతని సుదీర్ఘ వ్యాసము "స్పెక్టేటరు" లో ప్రచురింపబడింది. "టైమ్సు" పత్రికలో ప్రశంసాత్మకమైన రెండు లేఖలు ఆక్సఫర్డు గ్రాడ్యుయేటు "అనే పేరుతో కనిపించినాయి. అవి రాసింది ప్రసిద్ధుడైన రస్కిన్ అని తెలిసిపోయింది. ఆ సంవత్సరమే "మోడరన్ పెయింటర్సు" కొత్త వాల్యూమ్ వచ్చింది. అందులో రస్కిను మిలియాసు, హంటుల గురించి రాశాడు. రాయల్ ఎకాడమీలోకల్లా హంటు, మిలియాసు చిత్రాలే గొప్పవనీ, అపూర్వమైన ఒక కళా సంప్రదాయానికి ప్రీరెఫీయలైటు సోదరులు స్థాపకులనీ రాశాడు.

ఆ రోజుల్లో కళా విషయాల్లో రస్కిను మాట వ్యాసప్రోక్తము. ఆయన కటాక్షవీక్షణ సోదరబృందము సంపాయించుకుంది. దానితో వారి చిత్రాలు విశేష ప్రచారంలోకి వచ్చాయి. కాని హోల్మను హంటుకు ధనాభావంవల్ల కళావ్యాసంగానికే భంగం వచ్చేట్టయింది. అప్పుడు మిలియాసు తన సొంత డబ్బుయిచ్చి నిలబెట్టాడు. ఈ విధంగా వాళ్ళ గాఢ మైత్రి మరీ గాఢతర మయింది. పల్లెసీమలకుపోయి చిత్రకల్పనకు అనుకూల వాతావరణము ఎన్నుకొని మిలియాసు "ఒఫీలియా" అని, హంటు "గొర్రెల కాపరి" అని రెండు చిత్రాలు తయారుచేశారు. హంటు చిత్రం ప్రీరేఫీయలైటు సిద్ధాంతసారభూతమయి ఉంది. అది ఆ సాంప్రదాయంలో సర్వోత్కృష్టరచన. గొర్రెలకాపరి ఒక ఎమ్మెలాడితో ప్రేమ కలాపం నడుపుతూంటె తోడేలు గొర్రెల్ని పొట్టపెట్టుకుంటోంది. నీతిదాయకమయిన విషయం. సూక్ష్మపరిశీలనారమ్యమైన పరిసర ప్రకృతి చిత్రణ. చిత్రమొక కడిగిన ముత్యం!

1852 లో ఆ బొమ్మ ప్రదర్శించేనాటికి ప్రీరేఫీయలిజముమీద వచ్చినదాడి సమసిపోయింది. ఒక పోటీస్పర్థ మిగిలిఉన్నా ప్రీరేఫీయలైటు చిత్రం ఒక సంప్రదాయంగా అంగీకృతమయింది. ఆ పద్ధతులు ఇతర సభ్యులు అంగీకరించారు కూడాను. పోరాటమయితే దిగ్విజంగా ముగిసింది. కాని సోదర బృందము విడిపోసాగారు. ఊల్నరు ఆస్ట్రేలియా వెళ్లాడు. కాలిన్సు మఠంలో చేరాడు. విలియమ్ రొజెట్టి, స్టీఫెన్సు పూర్తిగా రచయిత లయ్యారు. అన్నిటికంటె విచారకరమైన విషయం రొజెట్టి బృందమునుంచి దూరదూరమవటం. 1850 నుంచి 53 వరకు రొజెట్టి పెద్ద బొమ్మలు ఏమీ వెయ్యలేదు. ఏమంటే కవితావాహినిలో మునిగితేలుతూ అతని ఊహలన్నీ కవిత్వంతో నిండిపోయినాయి. అప్పుడప్పుడు చిన్నచిన్న నీటిరంగుల చిత్రాలు రచించేవాడు. రస్కిను అతన్ని అన్ని విధాలా ప్రోత్సహిస్తూ ఉండేవాడు.

"విమోచన" అనే చిత్రం చిత్రించి 1853 లో మిలియాసు రాయల్ ఎకాడమీ సభ్యుడయాడు. హోల్మను హంటు రచించిన "విశ్వం వెలుగు" అనే చిత్రం నాలుగువందల పౌనులకు అమ్ముడు పోయింది. ఆ డబ్బు పుచ్చుకుని హంటు క్రైస్తుగాథలు చిత్రించడానికి అతని జన్మస్థలమైన పాలస్తీనా వెళ్లాడు. హంటువెళ్ళాక మిలియాసు ప్రీరేఫీయలైటు భావాలకు నిలబడలేకపోయినాడు. తిరువాత వేసిన "శైశిర పత్రాలు", "అంధబాలిక" మాత్రము సమితిభావా

లోకప్రసిద్ధిపొందిన

# పి. వి. రాజన్

## అండ్ కంపెనివారి




శ్రేష్ఠమైన మదరాసు నశ్యం

**R. S.** సుగంధ ముక్కుపొడి

అన్నిటిలో సాటిలేనిది.

ధర వివరములకు వ్రాయుడు.

తయారుచేయువారు:—

**పి. వి. రాజన్ & కంపెని,**

అర్కోణం, Arkonam, N. A. Dt.

---

వేటూరి—

సుందరశాస్త్రిగారి

# వర్ణ సుందరరసము

సర్వప్రమేహములకుసంజీవి.

గుణము ప్రత్యేకము

అనుభవసిద్ధము. ఇంజెక్షన్లు అవసరం లేదు. ఎటువంటి ప్రమేహాలనైనా కుదుర్చును.

**50 మాత్రలు రు. 5.**

**ఆర్షరసాయనశాల, ముక్త్యాల**

---

# ఓహో అదేమిటామాట!

సంతానం కుళ్లి కృషిస్తూ ఉంటే తల్లికి క్షోభ కాదూ?

**భారతీ - భారతాంబ తన**

**కుష్ఠు, బొల్లి సంతానం**

**కోసం ఎంతని విచారిస్తూ ఉందో?**

ఇదుగో మా 32 సంవత్సరముల అనుభవంతో ఇస్తూ ఉన్న అభయం

మాకు నేడే వ్రాయండి

## రెడ్డి అండ్ కో.,

గోపాలపురం. (తూ. గో. జి)

---

# పాలసుగంధిలేహ్యం

ఇది రక్తవృద్ధినిచేయు విలువ గల వస్తువులచే తయారు చేయబడినది. మేహములు, నిశ్శక్తి నిస్సత్తువ, శుక్లనష్టము, అతిమూత్రము మొదలగు వాటిని ఖండించి, మంచిబలమును వీర్యపటుత్వమును కలిగించుటలో అద్భుతమయినది. అనేక సర్టిఫికెట్లు గలవు. 2 డబ్బీలు చాలును.

**20 తులముల డబ్బీ రు. 2/-**

పోస్టేజి ప్రత్యేకము.

**పి. సి. ఏ. అండ్ కంపెని**

ఆయుర్వేదసమాజం.

పెరిదేపి, (నెల్లూరు జిల్లా)

లకు నిలవగలవి. అనే రస్కిను ఆశీస్సులు అందుకున్నాయి. తరువాత చిత్రించినవి, జనామోదాన్ని పుష్కలంగా పొందినా - జీవితం పూలబాటలా గడిచిపోయినా, అతని చిత్రాలుమటుకు వెంటు త్రాలూకు ఉదాత్తభావనా గాఢతగాని, రోజెట్టి కవితావేశంగాని తలపుకన్నా తీసుకురావు, విషయం, విధానం లో దవకబారు చిత్రాలు తయారుచేశాడు. "బుడగలు" అనే ఒక చిత్రం సబ్బుల కంపెనీవాళ్ళు ప్రచారానికి ఉపయోగించుకున్నారు కాని ప్రసిద్ధి గౌరవం అతన్నే వరించినాయి. 1885 లో "బారొనెట్" చెయ్యబడ్డాడు. లెయిటన్ చనిపోయినాక రాయల్ అకాడమీ ప్రెసిడెంటుకూడ అయినాడు. కాని యెంతో కాలం ఆ పదవిలో లేడు అతని ఆరోగ్యముచెడి ఆ సంవత్సరమే మరణించాడు. తనలో సమశీర్షి అయిన సర్ జాషువా రెయనాల్డ్సు పక్కని, సెయింట్‌పాల్ కెతెడ్రల్‌లో శాశ్వత స్థాయి విగ్రహరుదుకున్నాడు.

రోజెట్టి దొక మార్గమయ్యిం దినుకున్నాము. హోల్మనుహంటు ప్రకృతి వాదంగాని, మిలియాసు విషయ దౌర్బల్యంగాని అతని కృతులలో కనపడవు. అతని చిత్రాలు అంతకంతకు వాస్తవికానికి దూరంగా స్వప్నప్రపంచంలో కలలుగా రూపొందసాగినాయి. మిలియాసుకు వస్తున్న జనామోదం అంటే అతనికి అసహ్యంగా ఉండేది. రస్కిను మొదలైన కొద్ది మంది ప్రోత్సాహకుల ఆదరాభిమానాలు ఆసరాగా అతను తన బొమ్మలు స్టుడియోలో తప్ప బయట ప్రదర్శించేవాడే కాదు.

1857 లో రోజెట్టి ఆక్స్‌ఫర్డు యూనియన్ సొసైటి ఉపన్యాసమందిరంలో భిత్తి చిత్రాలు వంత వించడానికి వెళ్లాడు. అతని కక్కడ ఉత్సాహవంతులైన శిష్యవర్గం తయారయింది. అందులో ఇద్దరు ఎక్సెటరు కళాశాలా విద్యార్థులు-ఎడ్వర్డు బరన్ జోన్సు, విలియమ్ మోరిసు—తరువాత ప్రసిద్ధులయ్యారు. ఆక్స్‌ఫర్డు చిత్రాలు చాలాకాలం మనలేదు. కాని అవి ప్రేరకములైటు సాంప్రదాయంలో ఒక క్రొత్తదారి తొక్కాయి. అలంకార ప్రధానంగా, మధ్యయుగాల రసావేశంతో అధిభౌతికంగా ఉంటూ సమితి చిత్రాలకు ఒక క్రొత్త మాధుర్యాన్ని చేకూర్చినాయి.

వదేళ్ళు రోజెట్టి చిత్రరచనకు ప్రోద్బలము ఇచ్చి, అతని హృదయాన్ని కలల్ని ఏలుకున్న ఎలీనార్ సిడ్డాల్ 1862 లో మరణించింది. దానితో రోజెట్టి నిర్వీర్యుడై, అప్రతిభుడై పోయాడు. రెండేళ్ల దాకా చిత్రరచన చేయలేకపోయాడు. తరువాత చిత్రించిన "లిలిత్" చిత్రంలో తన ఉదాత్తస్థాయి అందుకున్నాడు. ఇదిగాక "ప్రియుడు" అన్న చిత్రంలో స్త్రీ సౌందర్యం అవధులు దాటి బోటిసిల్లి చిత్రాల్లో కావ్యత్వము స్ఫురణకు తెస్తుంది. బోలి చిత్రాల్లో ఉన్న అమాయికమైన, నియమసీ మితమైన సౌందర్యానికీ, దీనికీ పోలిక లేదు, మనోహరభావ విలసితమైన ఒక రమణీయ కావ్యంలా రాగరంజితమై విలసిల్లుతుంది ఆ చిత్రం.

రోజెటి చిత్రకృషి మూడు అధ్యాయాలుగా విభజించవచ్చు. ఒకొక్క అధ్యాయానికి ఒకొక్క స్త్రీ మూర్తి అధిష్ఠానదేవత! మొదటి రోజుల్లో చెల్లెలు క్రిస్టినా రోజెట్టి. ఆమె అన్నగారి వలె కవయిత్రికూడాను. రెండవ భాగంలో భార్య ఎలినార్ సిడ్డాల్. మూడవ అధ్యాయానికి అతని శిష్యుడు మోరిసు భార్య. ఆమె సౌందర్యం, చాల చిత్రాలు రోజెట్టిచేత వేయించింది. వాటిల్లో అతి రమణీయకమైనది "పగటికల" అన్నది. అది ఇప్పుడు సౌత్ కెన్ సింగటన్ అయానైడ్సు సంకలనంలో ఉన్నది.

ఆమె ఎన్ని చిత్రాలకు రచనావేశం కలిగించినా "బియాట్రిసు" చిత్రం మాత్రం తన భార్య సిడ్డాల్‌కే అంకితమయింది. ఆ పవిత్రభావం భార్యాస్మృతి చిహ్నంగా 1863 లో ప్రారంభించి చాల కాలానికి పూర్తిచేశాడు చిత్రం. అది ఇప్పుడు టేట్ గ్యాలరీలో ఉన్నది.

రోజెట్టి 1882 లో చనిపోయినాడు. అయినా అతని శిష్యుడు బరన్‌జోన్సు రోజెట్టి ఆశయాలు కొనసాగించాడు. చర్చి ఉద్యోగంకోసము చదువుతున్న బరన్‌జోన్సు ఆక్స్‌ఫర్డులో రోజెట్టిని కలుసుకోటంతో చిత్రదీక్ష తీసుకున్నాడు. అప్పటి కతనికి గీతగీయటమన్నా చేతగాదు. కాని బుద్ధి చాల పరిణతమైనది. అందుకనే మొదటినుంచి గొప్ప బొమ్మలే వెయ్యగలిగాడు. అతని మొదటి చిత్రానికి, చిట్టచివరి బొమ్మకు భావనా విషయంలో

వ్యత్యాసంలేదు. లేడా అల్లా రచనా పాటవం లోనే! అతని జీవితమంతా మొండిపట్టుదలతో రచనా విధానాన్ని పరిణతం చేసుకోటానికే పాటు బడ్డాడు. అతని చిత్రాలన్నీ ఉన్నతభావ విలసితాలే! అతని ప్రసిద్ధమైన చిత్రము "కొఫెట్యువా రాజు, పేదపడుచు" అన్నది.

స్త్రీ సౌందర్యాదర్శాలలో రోజెట్టీకి, బరన్ జోన్సుకు వ్యత్యాసం ఉంది రోజెటి స్త్రీలు రసోన్మాదులైన ప్రణయమూర్తులు. బరన్ జోన్సు స్త్రీలు ఆత్మ సౌందర్య ప్రభాసితులయిన అతిలోకసుకుమార మూర్తులు! రోజెట్టి ఇటాలియను కనుక డాంటె కవితామూర్తిని ఆరాధించాడు. జోన్సు వెల్షు వాడు కనక ఆర్థరు కథలు చిత్రించాడు. "ప్రకృతి సహజత" అనే హాల్మను హంటు సిద్ధాంతము ఎంత వరకు వచ్చిందంటే - జోన్సు తన చిత్రాల్లో భూమి మీదగాని సముద్రంమీదగాని మెరయని కాంతిని చిత్రిస్తానన్నాడు.

ప్రీరేఫీయ లిటిజము అన్నప్పుడు విలియమ్ మోరిసు కృషియెన్నితీరాలి. ఆయన చిత్రకారుడే కాడు - శిల్పం, వాస్తు, చేతిపనులు - కవిత్వం వగై ఇవన్నీ గాక అతనే ఒక మహా ఉద్యమం. కళలన్నీ జనసామాన్యానికి అనుభవయోగ్యము వాలనే మహదాశయము కార్యరూపంలో పెట్టినవాడు. ఆర్ట్సు అండ్ క్రాఫ్ట్సు ఉద్యమం మొదట స్థాపించింది ఆయనే. మోరిస్ కోసం అనేకవస్తువులమీద అలంకారాలు డిజైన్లు, కిటికీ తలుపుల రంగు అద్దాల బొమ్మలు తయారుచేసియిచ్చాడు బరన్‌జోన్సు.

ప్రీరేఫియలైట్సు అందరిలో ముఖ్యుడైన హాల్మను హంటు అందరికన్నా చివరిదాకా బ్రతికున్నాడు. క్రీస్తు జీవితానికి సంబంధించిన అనేక చిత్రాలు మహోత్కృష్టంగా సంతరించి తన తొంభయి మూడవ ఏట 1910 లో చనిపోయాడు.

ప్రీరేఫియ లిటిజము అనేది ప్రపంచ కళాచరిత్రలో ఒక స్వర్ణాధ్యాయము. అది ముగ్గురు చిత్రకారుల చిన్ననాటి కలల ఫలితమంటే ఆశ్చర్యంగా ఉంటుంది!



# వాయులీనం



శ్రీ చాగంటి సోమయాజులు

రాజ్యానికి ఒంటిమీద స్పృహ పూర్తిగా తప్పిపోయింది. అది ఈ ప్రపంచంలో లేదు. వెంకటప్పయ్య ప్రాణాలు ఎక్కడికక్కడ ఎగిరిపోయాయి. పరీక్షగా పెళ్లాం మొహంలోకి చూశాడు.

రాజ్యం పెదిమెలు కదులుతున్నాయి. ఏవో మాటలు అంటున్నట్టుంది. మాటలు పైకి రాకపోయినా మనస్సులో ఏదో అనుకొంటున్నది.

"ఓసే రాజ్యం!" అని ఆదుర్దాగా పిలిచేడు. అది పలకలేదు. అది ఈ ప్రపంచంలో లేదు. మనోహరమైన తోడిరాగాన్ని తోడుపుచ్చుకొని అంబర వీథుల్లో విహరిస్తున్నది.

వసారాలో పిల్లలు గందరగోళం చేస్తున్నారు.

"వెధవల్లారా ఏమిటా అల్లరి?" అని గట్టిగా పిల్లల్ని వెంకటప్పయ్య కసిరాడు. పిల్లలు దగ్గరగా ఉంటే చావకొట్టేవాడే.

"అబ్బ తుళ్ళిపడ్డానండీ! పిడుగుపడ్డట్టు పిల్లల మీద అలాగ విరుచుకుపడుతున్నారేం?" అని రాజ్యం తెలివితెచ్చుకొని అడిగింది. కళ్లు చిట్లించి మొగుణ్ణి చీదరగా చూసింది.

"నీవొంట్లో ఎలాగుందో చెప్పు" అని ఆతృతగా అడిగాడు.

"వాళ్ళ నెందుకలా కసిరారు?"

"కసిరితే కసిరాను. ముందు నీవంట్లో ఎలాగుందో చెప్పు"

"నిక్షేపంలాగుంది. ఇప్పుడేమొచ్చిందని?"

"పిలిస్తే పలికేవా మరి?"

"పిలిచారా?"

"పిలవలేదూ మరి?"

"అలాగనా!" అని రాజ్యం నవ్వింది. దాని నవ్వుమొహం చూడ్డానికి భయంకరంగా ఉంది. పైకి వచ్చేసిన గుప్తగూబకళ్లు, ముందుకు పొడుచుకు కనబడుతున్న ముందుపళ్లు మొహాన్ని బీభత్సం చేసేశాయి.

"వొళ్లు మరిచిపోయానండీ!" అని రాజ్యం మళ్లా నవ్వింది.

"అంతేకదా!" అని వెంకటప్పయ్య కొంత కుదటపడ్డాడు. రాజ్యం టైఫాయిడు జ్వరంతో తీసుకొని తీసుకొని కిందపెట్టవలసినంతా అయి బతికి బట్టకడుతున్నది. పథ్యం తింటూ, ఇంకా వారం రోజులే అయింది. వెంకటప్పయ్యకి అదురుమాత్రం పోలేదు. ఆ మాయదారి టైఫాయిడు జ్వరం మూడువారాలగా పొక్కిపోసినతరవాత దిగజారలేదు. మళ్లా తిరగబెట్టింది. మరి మూడువారాలు చూడు నా మహాత్మ్యం అని ముప్పతిప్పలా పెట్టింది. పథ్యం పెట్టించినా, ఆస్పత్రినుంచి ఇంటికి తీసుకొచ్చినా, వెంకటప్పయ్యకి పక్కబెదురు అలాగనే ఉండిపోయింది. ఏక్షణంలోనైనా దాని ప్రాణం గుటుక్కుమంటుందనే వాడి భీతి!

"నావంట్లో హాయిగా ఉంది. తింటున్నది అరుగుతున్నది. నిద్రపడుతున్నది. అంత జబ్బుపడ్డాక నిలుచున్నపాళంగా మామూలుమనిషిని కమ్మంటే అవుతానా?" అన్నాది రాజ్యం.

రాజ్యాన్ని చూస్తేమాత్రం దానివంట్లో ప్రాణాలు ఎలాగ నిలబడి ఉన్నాయా అని ఆశ్చర్యం వేస్తుంది. కండయావత్తూ అర్చుకుపోయి ఎముకలమీద తోలు మాత్రం మిగిలివున్నది.

"నువ్వు పరధ్యానంగా ఉంటే గుండెలార్చుకుపోయాయి" అన్నాడు. నిద్రపోతున్న పెళ్లాన్ని చూశాడా—ప్రాణం ఉందా లేదా అనే సంకోచం వాణ్ణి ప్రతీరోజూ పీక్కుతింటూ ఉండడం, దాని కడుపుకిందికీ మీదికీ ఊపిరికి ఎగురుతూ ఉంటే బతికే

ఉన్నదని నిర్ధారణ చేసుకొంటూ ధైర్యపడడం వాడికి పరిపాటి అయిపోయింది.

"మనస్సు ఎటో పోయింది. నావంట్లో మరేం లేదు. ఈయింటికి మారినదగ్గరనుంచి నాకు హాయిగా ఉంది." అన్నది రాజ్యం.

"నాకూ ఈయింటికివచ్చినదగ్గరనుంచి హాయిగా ఉంది. ఏదో కొత్తసంతోషం కలుగుతున్నది. ఎటొచ్చి అద్దె కాస్త ఎక్కువనుకో" అన్నాడు.

"అద్దెకే బెంగగా ఉంది" అన్నదిరాజ్యం.

"ప్రాణానికే క్షేమంలేనితరవాత వెధవ అద్దెకి చూసుకొంటామా? ఏ బెంగా వద్దు" అన్నాడు. అంతకుముందు వాళ్లు ఇరుకుసందులో ఇక్ష్వాకులనాటి పాతగూళ్ళంలో అద్దె చవకని ఉండేవారు. అక్కడ ఉన్నన్నాళ్లు ఇంటిల్లిపాదికీ రోగాలే. ఆఖరికి రాజ్యానికే ప్రాణంమీదికొచ్చింది మనిషితోడు లేనివాడు. ఆస్పత్రిలో పెళ్ళాన్నుంచి యమయాతన పడ్డాడు. కట్టుకొన్నమొగుడు, కనుకొన్న పిల్లలు అదృష్టవంతులు కావడాన్ని బతికి మనుష్యుల్లో పడ్డది. ఇప్పుడు కొత్తగా కట్టిన సిమెంటు డాబాలో రెండు చిన్నగదులూ, వసారా అద్దెకు తీసుకొన్నారు. ఎదురుగుండా చూడ ముచ్చటైన మేడ ఉన్నది. ఇళ్ళచుట్టూ విశాలంగా పెరళ్ళున్నాయి. పెరళ్ళన్నీ ఉద్యానవనాలే.

"వెధవడబ్బు ఏదో కూడిక చేసుకొంటాము. నువ్వు బతికావు. అంతే చాలు" అన్నాడు.

"అదేమన్నమాటలెండి. నా జబ్బుకి ఎక్కణ్ణుంచి తెచ్చారో, ఎంత అయిందో ఇప్పటికి నాకు చెప్పకండా ఉన్నారు. అదీ ఆలోచించుకోవాలి" అన్నది.

"ఆవూసు నిన్నెత్తద్దన్నానా? ముందు నీ ఆరోగ్యం చూసుకో. నువ్వేమీ లోభపడకు. కావలసినంత ఓవల్టిన్ను తాగు. తెచ్చిన పళ్ళన్నీ తినెయ్యి. పిల్లలకికూడా పెట్టకు"

"తినకేంచేస్తున్నాను. ఆ కాస్త జాపుకొని ... చేత వండించుకొని మరీ తింటున్నాను. ఏదైనా అప్పు అప్పే కదా? మన కింకోవిధం ఉంది కనుకనా?"

"ఆవూసు ఎత్తొద్దన్నానా?" అన్నాడు. డబ్బు మాటెత్తగానే వాడికి గాభరా పుట్టింది. జీతం రెండు నెలలదీకాక రెండువందలకి దాటి ఖర్చు అయిపోయింది. డాక్టరు అశ్వినీదేవతలాగ కాణీ పుచ్చుకోకండా కాపాడుకొచ్చినా వుత్తమందులకి అయిపోయింది. ధర్మాసుపత్రిలో పడేసినా తలకిమించిన ఖర్చు అయింది.

"ఎత్తనులెండి. తీర్చుకొందాం తాపీగా. కూడికకి ఏముంది? నా చేతిలోనే ఉంది"

"సరేలే అలాగే చేతువుకాని" అని వెంకటప్పయ్య పెరట్లో కెళ్ళిపోయాడు. వాడికా సంభాషణ పెంచడం ఇష్టంగాలేదు. కాళ్ళూ, చేతులూ, ముహం కడుక్కొని వచ్చాడు. తల దువ్వుకొని ముస్తాబు చేసుకొన్నాడు. వీధిలోకి బయలుదేరేడు.

రాజ్యం మళ్లా ఈ ప్రపంచంలో లేదు. చిరిచీకటిగదిలోకి ప్రవేశిస్తున్నది. కిటికీలోంచి సాయంకాలపు సల్లుడు రాజ్యం మొహంమీదపడి బంగారపు పూత పూస్తున్నది.

వెంకటప్పయ్య రాజ్యం మొహాన్ని తదేకంగా చూస్తూ నిలబడ్డాడు. వాడికి భయం మరి కలగలేదు. చిన్ననాటి ఏ మధుర సన్నివేశాన్నో జ్ఞప్తికి తెచ్చుకొని వొళ్లు పరవశమౌతున్న దనుకొన్నాడు. మొహంలో దేదీప్యమానంగా సంతోషం తాండవిస్తున్నది.

కొన్నిసంవత్సరాలై రాజ్యం అంత సంతోషంతో ఉండటం వెంకటప్పయ్య చూడలేదు. కాపరానికొచ్చిన తొలిసంవత్సరం ఇరవైనాలుగుగంటలూ కిలకిల నవ్వుతూ, బంతిలాగ త్రుళ్ళిపాట్లు పడుతూ ఉండేది. సంవత్సరం తిరక్కుండా దానిగుండెలికి చంటికుర్రాణ్ణి అప్పగించి సంసారసాగరాన్ని ఉత్తరించుకునెళుతూ, అవతిలదరికి చేరమంది జీవితం! కాపరానికొచ్చి ఆరేళ్ళయింది. ముగ్గురు కొడుకుల తల్లి అయి ఈదుతున్నది.

అకస్మాత్తుగా రాజ్యం నోరు తెరచింది. తల ఒకపక్కకి పెట్టి ఆడిస్తున్నది. దానిచేష్టకి వెంకటప్పయ్య పకాలున నవ్వేడు. ఆ నవ్వు కొరింత దగ్గులాగ వాణ్ణి వొహంతిక గాని వదలిపెట్టలేదు. రాజ్యం విహాయసవీధుల్లోంచి ఆనవ్వుతో భూమికి దిగివచ్చేసింది.

"ఎందుకూ అంత విరగబాటునవ్వు?" అని మొగుణ్ణడిగింది.

"ఏదీ మళ్లా నోరు సాగదీసి, మెడవంచి ఆడించు చూస్తాను" అన్నాడు.

"అదా! ఎదురింటిపిల్ల పాడుతున్నది. వినండి" అన్నది. రాజ్యం చెప్పేక ఎదురింటినుంచి సంగీతం వస్తున్నట్టు చెవులకు తెలిసింది. చెవుల్లో గుయ్యిం గుయ్యింమంటున్నా అదేమిటో తెలుసుకోవలసిన అవసరం వాడికి అంతవరకూ కలగలేదు!

"ఓహో ఇక్కడ సంగీతం వినబడుతున్నదే! అదియా సంగతి. చిన్నప్పుడు నువ్వు చిన్న వాయులీన విద్వాంసురాలివి కదూ! మరచిపోయాను" అన్నాడు.

కామవర్ధని రాగాలాపనతో కంపిస్తూ, పువ్వు వెలగవాసనతో మత్తెక్కి గాలి బరువుగా గదిలోకి ప్రవేశిస్తున్నది.

"ఏమర్రోయ్ పిల్లలూ ఇక్కడ సంగీతకచేరీ అవుతున్నది. వచ్చి వినండి" అన్నాడు. కొడుకులిద్దరూ వీధులోకి కూడాపోయి పాట ఆశ్చర్యచకితులై వింటూ నిలబడ్డారు.

"ఈయింట్లో సుఖంగా ఉందనుకొన్నాను కాని ఈ పార్శ్వగృహాల తప్పగులాగుంది" అన్నాడు.

"కొంతకొమ్మ తెమ్పుకోండి" అన్నది రాజ్యం. అతని మనస్సు చివుక్కుమంది. కొంత గంధం పూసినట్టు వొళ్ళంతా సెగలూ, పొగలూ లేచాయి.

"చీకటి పడుతూఉంటే ఇప్పుడెందుకూ వీధిలోకి? పెందరాళే అన్నం తినకూడదూ?" అన్నది.

"అనుకోంటూ ఉండగా ఆలస్యమైపోతున్నది. ఇలాగ్గా ఇహ వెళ్ళి పాపపరిహారార్థం ఇక మంచిపని చెయ్యాలి" అన్నాడు.

"పాపాలుకూడా చేస్తున్నారా?"

"పాపం చెయ్యందీ బతుకు వెళ్ళదు"

పిల్లలిద్దరూ సంగీతం జాగ్రత్తగా వింటున్నారు. వాళ్ళకి శ్రవణానందంగా ఉంది గాబోలు. పిల్లల హృదయాలు నిష్కల్మషంగా ఉంటాయి. స్వభావసిద్ధంగా సంగీతం సమ్మోహపరుస్తుంది. చిన్న వయస్సునుంచి కొస్తంత రాగతాళ జ్ఞానం కలిగిస్తే జీవితంలో సంగీతం ప్రవేశించి ఆ జన్మాంతం ఆనందహేతువు అవుతుంది.

"ఓహో మీరు మీ అమ్మకి పిల్లలే! సరిగమల సాంబారు మీకు వచ్చినట్టుందే!" అని వెంకటప్పయ్య వీధిలోకి నడిచాడు.

రాజ్యం మెల్లిగా లేచి స్విచ్చి నొక్కింది. దూలాంమధ్యనున్న గొట్టం క్రమేణా వెలిగి గదినిండా ఆణిముత్యంలాగ కాంతిపడ్డది. విద్యుద్దీపాలు సిమెంటు డాబా గదుల్లో ఉన్నంత అందంగా పూర్వకాలపు నాలుగిళ్ళ లోగిళ్ళలో శోభించవు. బూజుపట్టిన పెంకకింద, పట్లతో నిండిన బల్బులా రాజ్యం సంగీతం రెండురోజులు వెలిగి ఫ్యూజు అయిపోయింది. దాని ఫిడేలు మూలపడ్డది. కమాను విరిగి పెంటకుప్పని చేరింది. జీవితంలోంచి సంగీతం తొలగిపోయినా ఎదురింటి అమ్మాయి పాడుతూఉంటే ఎక్కడలేని సుఖాన్ని, సంతోషాన్ని ఇస్తున్నది.

రాజ్యానికి జీవితంలో అసందర్భంగా ఏమీ జరగలేదు. అంతా సవ్యంగానే నడిచింది.

ఆరేళ్ల క్రితం రాజ్యాన్ని చూడడానికి పెళ్ళివారు వచ్చారు. వాళ్ళతో వెంకటప్పయ్యా వచ్చాడు. వాళ్ళంతా రాజ్యాన్ని పాడమన్నారు! వాళ్ళ నాన్న నాలుగేళ్ళయి అవసరంగా సంగీతం చెప్పిస్తున్నందుకు పాడవలసిన శుభముహూర్తం వచ్చింది.

తోడిలో కీర్తన సిగ్గుపడుతూ అందుకుంది. గొంతుకత్తేసరికి అపశ్రుతి పలికింది. ఉసిలోకి రావలసిన తాళం వేలుమీదికొచ్చింది! వొళ్ళంతా జలదరించి పాటంతా గాభరా అయిపోయింది. పాట ఆపగానే రాజ్యానికి ఏడుపు పర్యంతం అయిపోయింది.

కాని వచ్చిన పెళ్ళిపెద్దలు పాటకి సెహబాస్ అన్నారు. తెనుగు పెద్దలకి శ్రుతీ, అపశ్రుతీ తెలియవని, రాగ తాళ జ్ఞానం వాళ్ళకుండదని, వాళ్ళ జీవితాలలో సంగీతం లేనే లేదని అమాయికపు పెళ్ళికూతుళ్ళకి ఏమి తెలుసు?

"మీ అల్లుడు ఉద్యోగం చెయ్యక్కర్లేదు" అన్నాడొక పెళ్ళిపెద్ద. రాజ్యం వాళ్ళ అజ్ఞానానికి లోలోపల నవ్వుకొంది.

వెంకటప్పయ్య రాజ్యాన్ని మనసారా అంగీకరించే పెళ్ళిచేసుకొన్నాడు. పేరు వెంకటప్పయ్య

అయినా వెంకటప్పయ్య అల్లాటప్పయ్య కాడు. పెళ్ళి నిశ్చయం కాగానే రాజ్యం కూడా తను అదృష్టవంతు రాలిననే అనుకొంది. వెంకటప్పయ్య పెళ్ళినాటికి పట్టపగ్గాల్లేని ఆంధ్ర విశ్వకళా పరిషత్తువారి పట్టభద్రుల్లో ఒకడు! చెన్న రాష్ట్రప్రభుత్వపు డెబ్భయి రెండురూపాయిల ఎల్. డి. గుమస్తాలలో ఒకడు!

పెళ్ళయినకొత్తలో వాళ్ళ కోడలు రాజ్యం మాబాగా పాడుతుందని ఊళ్లోవాళ్లు పేరంటానికి వెళితే బలవంతంచేసి పాడించేవారు. మొగుడు ఒక్కనాడు పాడమనలేదు. తాను పాడనూలేదు!

సిగ్గువదలి అత్తవారింట్లో తనకి తాను నోరెత్తి పాడుకొనేసమయం రాకండానే పుట్టి మునిగిపోయినట్టు వేవిళ్ళతో పుట్టింటికెళ్ళింది. దాంతో ఆమె జన్మ సార్థకమైంది.

వసారాలో పిల్లలు గందరగోళం ప్రారంభించారు.

"ఎందుకర్రా అలాగ పీక్కుంటారు? ఇలాగ రండి" అన్నది. వస్తీలు పకుతున్న కొడుకులిద్దరు తల్లిదగ్గరకొచ్చారు. ఐదేళ్ళవాడొకడూ, నాలుగేళ్ళ వాడొకడూ.

"తమ్ముడు నిద్రపోతున్నాడా?" అనడిగింది.

"గుర్రు పెడుతున్నాడు" అన్నాడు పెద్దవాడు.

"అల్లరిచేస్తే లేచిపోడూ?" అన్నది. పెద్దవాడు కొంటెగా నవ్వేడు. ఇద్దరూ పొరపాటు చేస్తున్నట్టు మొహాలు పెట్టారు.

"ఎదురింటి అమ్మాయి హాయిగా పాడుతున్నది. కూచుని చక్కగా వినండి" అన్నది. వాళ్ళు బుద్ధిగా కూచున్నారు. పిల్లలని సముదాయించడం, శాంతంగా సబువైన మాటలుచెప్పి అల్లరిచేయకండా చెప్పినట్టు వినేటట్టు చెయ్యడం, మొహంమీదికి పొగరాకండా పొయ్యి ఊదడం మొదలైనవిద్యలన్నీ రాజ్యం అవలీలగా నేర్చుకొంది.

ఎదురింటి అమ్మాయి స్వరకల్పన ప్రారంభించింది. స్వరాలు సెలయేళ్లలాగ ప్రవహిస్తూ, మధ్యమధ్య జలపాతాల్లాగ తిరగబడి ఘోషిస్తున్నాయి. గాత్రం తారస్థాయికి లేపి గాంధారంలో నిలువుతూ కల్పన చేస్తున్నది.

రాజ్యానికి ఏనుగంత సత్తువ వచ్చింది. నిత్య జీవితంలో ఆనందానికి, ఆరోగ్యానికి సంగీతం అవసరమే. తాను పాడలేకపోయినా అర్థంచేసుకోగలిగితే ఉత్తమ సంగీతం మంచిని చేస్తుంది.

అడ్డంగా పానకంలో పుడకలాగ ఎదురింటి అమ్మాయి తమ్ముడు కాబోలు వచ్చాడు.

"గమపదని ఓజగ...

సరిసనిపదని ఓజగ..." అని గొంతుక చించుకొని అపశ్రుతిలో స్వరాలు వేశాడు. ఆ అమ్మాయి తంబూరా పాటా ఆపేసింది.

"వెధవా సంగీతం నేర్చుకోమంటే రావు కాని అల్లరికి సిద్ధం" అన్నది.

"నేను స్వరం సరిగ్గా వెయ్యలేదూ?" అని ప్రశ్నించాడు.

"నాన్న రానీ చెవుతాను" అన్నదా అమ్మాయి.

"దానిపనిసరి సానిదాని పదని ఓ జగ..." అంటూ కుర్రవాడు మరోస్వరం వేశాడు. అపశ్రుతిలోనైనా కుర్రవాడు స్వరాలు సరిగ్గానే పట్టుకు వేస్తున్నాడు. వాతావరణంలో సంగీతం ఉంటే వాసాలుకూడా పాడతాయి. అందులో గగనం లేదు.

"నాన్నరానీ వెధవా" అని ఆ అమ్మాయి సంగీతం ఆపు చేసేసింది. రాజ్యానికి వొళ్లు మండిపోయింది. ఆ పిల్ల అన్నీ తనకొచ్చినరాగాల్లో కృతులే పాడుతున్నది.

"కొంచంసేపైనా ప్రాణం హాయిగా ఉంది. ఇవాళైంది సంగీతం" అన్నది రాజ్యం.

"ఇంక పాడదేంటమ్మా?" అని పెద్దకొడుకు అడిగాడు.

"అదిగో మీలాటి అల్లరి కుర్రవాడువచ్చి కంగాళీచేస్తే కోపంవచ్చి పాట మానేసింది"

"ఎలాగమ్మా పాడుతున్నదీ?"

"నేర్చుకొని పాడుతున్నది"

"నువ్వు పాడతావూ?"

"ఓ పాడతాను. నీకు చెప్పమన్నావా?"

"ఛీ! మొగాళ్లు పాడరు"

"మొగాళ్ళూ పాడతారమ్మా. నీకు చెప్పమన్నావా?"

"ఏదీ చెప్పు"

"తరవాత చెపతాలే" అని రాజ్యం కాళ్ళుజాపి గదిలో అడ్డంగా పడుకుంది.

"ఒరే పెద్దాడూ కాళ్లు పట్టు బాబూ" అంది. పెద్దవాడు మెల్లిగా కాళ్ళు గుద్దుతూ కూచున్నాడు.

"నేను చేతులుగుద్దుతానమ్మా" అంటూ రెండోవాడు చేతులు గుద్దుతూ కూచ్చున్నాడు.

రాజ్యం కళ్యాణి కృతి అనుకొంటూ పడుకొంది. అంతా మరిచిపోయింది సంగతులు చిక్కుపడ్డకురుల్లాగ అవకతవక అయిపోయాయి

"నువ్వా పిల్లలాగ పాడ్డంలేదు" అన్నాడు పెద్దవాడు.

"అంతా మరిచిపోయానురా" అన్నది. పెరటి వసారాగూట్లోంచి సిబ్బి కిందపడి వికారంగా చప్పుడై గదిమూలలన్నీ గుయ్యిఁ పెట్టాయి.

"కుక్క కాబోలు కొట్టండి. గూట్లో అన్నం మండబెట్టింది కాబోలు!" అన్నది రాజ్యం. కొడుకులు పరిగెట్టారు.

"కుక్క కాదమ్మా పిల్లి. అన్నంగిన్నెమీద సిబ్బి తిరగదోసీసింది" అన్నాడు పెద్దవాడు.

"నయమే. మళ్లా వండుకోకండా. కుక్క ముట్టుకున్న కూడూ తినవలసిన రోజులు. తలుపులు గడియపెట్టిరావొద్దూ?" అన్నది రాజ్యం.

"నువ్వొచ్చి సంగీతం వినమన్నావు" అన్నాడు పెద్దకొడుకు.

"ఔనమ్మా నేనే మిమ్మల్ని రమ్మన్నాను. కాని తలుపులు వేసి రావాలి. తెలిసిందా?" అని మెల్లిగా చెప్పింది.

వెంకటప్పయ్యా తిరిగి వచ్చేశాడు.

"పెరట్లో వెన్నెలా, పువ్వు పలగవాసన మహా బాగున్నాయి" అన్నాడు వెంకటప్పయ్యా.

"అప్పుడే వచ్చేశారేం?" అన్నది రాజ్యం.

"పనైపోయింది"

"పాపపరిహారం అయిందా?"

"కొంచం అయింది"

"ఈమధ్య ఏముందదగ్గరకో వెళ్ళారు కాబోలు"

"రామరామ"

"మీ మాటలు వాలకం అలాగుంది"

"ఛీఛీ"

"ఆమాట అనలేనులెండి. నన్నొదిలి మీరు వెళ్ళండే"

వెంకటప్పయ్య కండువాలో దాచి చంకక్రింద ఏదో పెట్టాడు. గుండ్రంగా పేపరుచుట్టి ఉంది.

"ఏమిటిది?" అన్నది రాజ్యం.

"విప్పిచూపిస్తానుకదూ"

లోపల బాగా నాలుగువేళ్ళ వెడల్పుచుట్టూ జరీ అంచు చీర ఉంది. దానికి తగ్గ పట్టురవికెలగుడ్డా ఉంది. మహారాణీ మొదలు మామూలు మహిళదాకా ప్రతీ ఆడదీ మెచ్చుకునే చుట్టు జరీ చీర.

"కొన్నారా?"

"కొన్నాను. ఉన్నడబ్బు కాస్తా అయిపోకండా కొనేశాను."

"డబ్బెక్కడిది?"

"చెపితే నువ్వు నన్ను క్షమించవు"

"ఏంచేశారండీ?"

"ఏమీ అనవని చేతిలో చెయ్యి వెయ్యి" అన్నాడు. ముందుకు చెయ్యి జాపేడు. వాడిచెయ్యి వొణుకుతున్నది. రాజ్యం చేతిలో చెయ్యి వేసింది.

"అలాగ వొణికిపోతున్నారేం? ఏంచేశారండీ? దొంగతనం చెయ్యలేదుకదా?"

"అంతకన్నా హీనమైనదే. నీకు టైఫాయిడు మళ్లా తిరగబెట్టిందికదూ. నాకు ఆశలన్నీ ఉడిగిపోయాయి. స్నేహితుడొకడు ఇంటికివచ్చి చూసీ చూడ్డంతో సలహా ఇచ్చాడు. తెగించి వాడికిచ్చేశాను"

"ఏమిటిచ్చేశారు?"

"నీకింకా తెలియలేదు. వాడే పట్టుకెళ్ళి రెండువందలఏభైకి అమ్మేశాడు. అంతడబ్బు వస్తుందని కల్లోకూడా అనుకోలేదు. పాతదనుకొన్నాను. పాతదానికే విలువ ఎక్కువట!"

రాజ్యానికి అర్థమైంది. గది నాలుగుపక్కలా కలయజూసింది.

"ఇహా నువ్వు చూసెక్కర్లేదు"

"వెళ్ళిపోయిందా!" అని దీర్ఘంగా నిట్టూర్చింది.

"నీకు కష్టంగా ఉంటుందని తెలుసు. నేను చేసింది తప్పే" అని నేరస్తుడిలాగ మొహం పెట్టుకున్నాడు. మొగుడి మనస్సు బాధ పడుతున్నదని గ్రహించి తన విచారాన్ని క్షణంలో దిగమింగుకుంది.

"ఏతప్పూ చెయ్యాలేదు. ఏసంసారైనా అదే చేస్తాను. చెయ్యవలసి వచ్చిచేశారు. మీరేం తినేశారా?"

"మనకంతా మొగపిల్లలేకదా అని ధైర్యం చేశాను"

"పోనియ్యండి. నానోరు ఏనాడో నొక్కుకుపోయింది. ఇహ నా ఖిడేలు ఉండి నన్ను రక్షిస్తుందా? సరస్వతీకటాక్షం నాకంతే ఉంది. తల్లి వెళ్ళిపోయింది. వెళ్ళిపోతూ తల్లి తల్లిగుణాన్ని చూపించుకొంది. నాకు ప్రాణంపోసింది. వెళ్లిపోతూ నాకో చీరా రవికలగుడ్డా పెట్టింది" అని గుడ్లనిండా నీళ్లు నింపుకొంది. ఎదురుగుండాఉన్న చీరని రాజ్యం విప్పయినా చూడలేదు.

"నాలుగుకాలాలపాటు ఉంటుందికదా అని కొనేశాను" అని చీర సగం విప్పేసి రాజ్యం భుజం మీద కప్పేశాడు వెంకటప్పయ్య.

"జ్ఞాపకంగా ఉంటుంది లెండి" అన్నది రాజ్యం.



# గురుమహాదశలో పెండ్లి



★

శ్రీ రాళ్లపల్లి గోపాలకృష్ణమాచార్యులు

"ఏమో, భగవంతునిదయ. ఎక్కడ ఏమి ఫలములు చెప్పినా, తూ. చా. తప్పక జరిగేవి. ఈ జాతకము విషయములో మాత్రము చెప్పిన ఫలములు అంటిరాలేదు. ఒక్కసారి, తాము దీనిని చూడండి."

అనుచు, మామాననీయమిత్రుడొకడు కొన్నాళ్ళ క్రింద నా గదికి వచ్చి కూర్చుండి, లోకాభిరామాయణము మాటలాడుచు, నకును నా కొక జాతకకుండలిని చూపెను ఇదే ఆ కుండలి.—

| | | | |
|---|---|---|---|
| | | | |
| చ<br>కే | నిరయన<br>—<br>రాశి<br>చక్రము | | రా |
| | | | |
| | | ర శ<br>గు గు | ల<br>బు కు |

జన్మనక్షత్రము శతభిషమట. రాహుమహాదశా శేషము జన్మకాలమునకు 13 సంవత్సరములు, 2 నెలలు, 23 దినములు అని నా మిత్రుడు తెలియచేసినాడు.

"ఏమి విశేషము? తమకు తెలియనిది నేను చెప్పగలనా?" అని సవినయముగా ప్రతి చెప్పితిని.

"అది కాదండీ! తెలివి ఒకరిసొమ్మా? ఎవరెవరిబుద్ధి వారి కేమి తోచునో?" గంభీరముగా, సాభిమానముగా, నా మిత్రుడు ప్రతి ఇచ్చి, మరల ఇట్లనెను.

"ఇది ఒక కన్యక జాతకము వివాహవిషయము ప్రశంస. ఎప్పుడు వివాహము కాగలదో, తాము నిర్ణయించి చెప్పవలెను. ఈమె తల్లిదండ్రులు నాకు చాలా ఆప్తులు."

కుండలిని చూచితిని. గ్రహస్థితినిపట్టి చూడగా, దాదాపుగా మూడుపదులు వయస్సు ఉండవచ్చునని కానరాగలదు. ఈ 'కన్యక' కు ఇన్నియేండ్లయినా వివాహ మేలకాలేదో?

"వయస్సు ముప్పది కావచ్చినది. దారిద్ర్యమా, కురూపమా, ప్రతిబంధకము?" అని ప్రశ్నించితిని.

"అబ్బే! వచ్చిన చిక్కంతా అదే. తండ్రి అయితే లక్షాధికారి; అత్యున్నతమైన స్థితి; గౌరవనీయమైన ఉద్యోగము. ఇంక, కన్యక మాతామా, మంచి రూపలావణ్యములు కలది. పైగా, చక్కని తెలివితేటలున్నవి. ఆంగ్లవిద్యలో పట్టభద్రురాలు. సంస్కృతములో రసవంతమైన సాహిత్యజ్ఞానమున్నది. నేనే 'శాకుంతల' పాఠము చెప్పినాను. అంతో ఇంతో, సంగీతజ్ఞానము సహా. ఇన్ని ఉండినా, కంకణబలముమాత్రము కలిసి రాలేదు. తల్లితండ్రులకు ఇది గొప్ప మనోవ్యథ. అందులో — ఈమెపైన వారికి అపారమైన వాత్సల్యము."

నా మిత్రునివర్ణనమును విని, "అంతస్తుకు తగిన వరుడు, రూపవంతుడు, ధనవంతుడు, విద్యావంతుడు, ఆ సంఘములో దొరకుట కష్టము కాబోలు?" అని నా సందేహమును వెలిబుచ్చితిని.

"అలాటి ఇబ్బంది సహా లేదండీ! ఒకడుకాదు. అనేకులు తగినవారే. వరులు 'నాకు నా' కని వచ్చుచున్నారు. కాని, వారెవ్వరూ కన్యకకు నచ్చలేదు.

ఒక్కొక్కనిలో ఆమెకు ఒక్కొకలోపము కానవచ్చినది. ఎవనినీ ఆమె సమ్మతించలేదు. అదో, ఇదో, అనుచుండగానే, ఇంత వయస్సు వచ్చినది తల్లిదండ్రుల బెంగ చెప్పలేను."

"బ్రహ్మచర్యముతోనే జీవితయాత్ర సాగించుటకు ఆమె కృతనిశ్చయ అయియున్నదేమో?" అని క్షణమూరకుండి, "తమ శిష్యురాలు కదా?" అని మెల్లగా జారపలికితిని.

నా మిత్రుడు బ్రహ్మచారి. ఉత్తమవంశసంభూతుడు. దాదాపుగా, నలుబదియైదువర్షంబులు కడచియుండినా, శీలమునకు కొంచెమైనా స్ఖాలిత్యము రాకుండ నిర్మలమైన సాత్త్వికజీవనమును నడుపుకొనుచున్న సదాచారసంపన్నుడతడు. ఉపజ్ఞాయుతమైన సంస్కృత సాహిత్యజ్ఞానము, తాత్త్వికమైన బ్రహ్మనిష్ఠ, నిర్నిద్రమైన సనాతన ధర్మదీక్ష, నిరంకుశమైన సరసవాగ్ధోరణి, కలిగి పాత్రప్రవచనములతోనో, పురాణేతిహాస కాలక్షేపాదులతోనో, జాతకఫల చర్చలతోనో, ప్రశాంతముగా, నిరంతరహాసన్ముఖుడై, ఆ మహనీయుడు దినములు వెళ్ళబుచ్చుచుండెడివాడు. కన్యక నిచ్చెదమని ఎందరో వచ్చి, ఆశలు చూపి, నిర్బంధించినా, శుద్ధమైన సాత్త్విక వైరాగ్య బుద్ధితో, అతడు గృహస్థాశ్రమప్రవేశము నాశించినవాడు కాడు. అతడన్నచో, వైయక్తికముగా, నా కెంతో గౌరవము.

నా ఎత్తిపొడుపుమాటకు ఆ మహాశయుడు విరుగబడి పకాపక నవ్వుచు,

"లేదండీ! అట్టి ఉపదేశముల నే నెన్నడూ చేయలేదు. అవకాశముదొరకినపుడెంతో, 'అమ్మాయీ! ఇట్లు కాలము గడుపుట యుక్తము కాదు. త్వరగా వివాహము చేసుకో' అనియే హితము చెప్పుచు వచ్చినాను."

అని సమాధానము చెప్పి క్షణకాలమాగి, మరల,

"పోనిత్తురూ! జాతకమును చూడండి. వివాహ మెప్పుడో, ఏ దశాభుక్తిలో కాగలదో?" అని ఖచ్చితముగా ప్రశ్నించెను.

జన్మదినము, జన్మకాలము, జన్మగ్రామము, మొదలగు వివరములను అతని నడిగి తెలుసుకొని సాయనకుండలిని గుణించుచుంటిని. పదినిమిషములు కడచియుండును. అపుడు నా మిత్రుడు నాదృష్టిని మరల్చి,

"చూడండీ! ముఖ్యముగా నా సందేహ మొకటి మనవి చేయుచున్నాను. 14 సంవత్సరముల యుక్త వయస్సులో జాతకురాలికి గురుమహాదశ ఆరంభమైనది. ముప్పదిసంవత్సరముల వయస్సు వచ్చు పర్యంతము ఆ దశయే జరిగినదికదా? చతుర్థ సప్తమాధిపతి గురువు. పైగా, కుటుంబస్థానములోనున్నాడు; కళత్రకారకుడైన శుక్రునితో శుక్రక్షేత్రమందే ఉండుట! ఇంత సౌభాగ్యము గల గురువుదశలో ఈ చిన్నదానికి పెండ్లికాని కారణమేమి? నీచ రవితో ఈ గురువు చేరినాడను దోషమున్నది సరే. వాస్తవమే. అయినా, వివాహమే కాకూడనంతటి దోషమా అది? రవిభుక్తి వచ్చినప్పుడు కష్టమో, క్లేశమో, కలుగవచ్చును. కాని, శుక్రభుక్తిలోనో, బుధభుక్తిలోనో, వివాహ మేల కాలేదు?"

అని నా మిత్రుడు పూర్వపక్షము నెత్తినాడు. క్షణమాలోచించగా, అతని జాతకము స్ఫురణకు వచ్చినది. నిరయనముగా సింహలగ్న మతనిది.

"మీ జాతకములో కుంభములో కదా శని?" అతని ముఖము చూచుచు ప్రశ్న వేసితిని.

"ఆహా! మూల త్రికోణములోనే." అని తటాలున ప్రతి చెప్పి, అంతలోనే ఏదో సందేహము రాగా,

"కాని, ఇపుడు నా శనితో ఏమి పని? అని అడిగెను.

"సప్తమాధిపతి శని మూల త్రికోణములో మహాప్రబలుడుగా కళత్రస్థానములోనే మీకు ఉన్నాడు కదా? మీకు వివాహ మేల కాలేదు? పుత్రస్థానాధిపతిఅయిన గురుమహాదశలో సప్తమాధిపతి శనిభుక్తి మీకు ఈలోగానే కడచిపోయినది. తమకు అపుడు సంతానము కలిగియుండవలసినదేకదా?" అంటిని.

గొల్లుమని నవ్వుచు, చేతులు రెంటిని నెత్తికెక్కించి, కుర్చీ కానుకొని వ్రాలి, ఆకాశము చూచుచు నా మిత్రుడు రెండునిమిషములకాలము ఈ ప్రపంచమునే మరచిపోయినాడు. నేను సయితము కొంత నవ్వు నాపుకొనలేకపోతిని.

కొంతసేపటికి నేను వేయుచుండిన సాయన కుండలి ముగిసినది. ఆ చక్రమిది:—

| | | | |
|---|---|---|---|
| వ 14-7<br>కే 8-54<br>చ 2 56 | | | |
| | (సాయనము)<br>గ్రహభావ కుండలి | | X 19-54 |
| | | | ఇ 0.4 |
| | శు 6-0<br>గు 22-13 | కు 1-8<br>బు 8-55<br>ల 20-37<br>శ 23-22<br>ర 25-36 | రా 8-54 |

లగ్నము తుల. రసపిపాస సహజము. లగ్నమునకు ఒకవైపున కుజ బుధులు, రెండవవైపున రవి శనులు, నిలిచియున్నారు. ఆకారణముగా అందము కంటె ఆకర్షణశక్తి అధికమనవచ్చును. రెండింట శుక్ర గురువులున్నారు. ఆ శుక్రునికి కుజునితో పరివర్తన యోగ మున్నది. మాటలలో చాతుర్యమునకు కాని, చూపులలో తళుకుబెళుకులకు కాని కొదవ రాదు. లగ్నములో భాగ్యాధిపతి బుధుడు, వాక్స్థానములో విక్రమాధిపతి గురువు ఉన్నచోట సౌకర్యములున్న వారికి విద్యావ్యాసంగమునకు లోపము రానేరదు. చతుర్థ పంచమాధిపతియై, రాజయోగకారకుడైన శని ఉచ్చగతుడై లగ్నమందే ఉండుట గొప్పయోగమునే సూచించగలదు. అభిజాత్యము, తల్లితండ్రుల గౌరవము, ఆర్థికసంపత్తు స్పష్టముగా చూపట్టును. దశమాధిపతి చంద్రునితో లగ్నాధిపతి శుక్రునికి గల త్రికోణ శుభదృష్టి జాతకురాలిపై జననీజనకులకు గల వాత్సల్యమునకు సాక్షి.

కాని, బృహస్పతికి ఇంద్రుని కేంద్ర వేధ కలదు. కొన్ని విషయములలోనైనా, గుణమును దోషముగా, దోషము గుణముగా తోపింపచేయు యోగ మిది. అలవికానికోరికలలో, అసాధ్యములైన ఆదర్శములలో తెచ్చిపెట్టగలదు. మరియు, నీచ రవి లగ్నములో నుండుట లోపమే. రాజయోగములు అంటవని చెప్పుదురు. సరేకాని, తండ్రి ఇంటఆమెకు భాగ్యమునకో, యోగమునకో ఏమి కొదవ? రమ్యమైన సౌధమున్నది; మోటారుకారున్నది; విహారవసతులున్నవి; సినీమాల సౌకర్యమున్నది; మిత్రబృందమున్నది; పరిచారకులున్నారు; కావలసినంత ధనమిచ్చు జనకుడున్నాడు. ఇది యోగముకానిచో, ఇంకెట్టిది యోగమో చెప్పుట కష్టము. వివాహమై అత్తవారింటికి వెళ్ళినచో, అచట ఇట్టియోగము జరుగదనవచ్చును. ఇట్టి ఊహతోనే వచ్చిన వరులను ఏదో సాకుపెట్టి జాతకురాలు నిరాకరించుచున్నదేమో? కాని, చేతనయినంతలో మంచి సంబంధమునే జనకుడు సంపాదించగలడు. కూతురు సౌకర్యమునకై తగినంత అరణమిచ్చుటకు సయితము అతడు వెనుదీయడుకదా ?

ఇవి ఇట్లుండగా, శుక్ర కుజుల పరివర్తనము, శుక్ర చంద్రుల త్రికోణదృష్టి, ఇవి యుక్తవయస్సులో వివాహము కొరతగిన యోగములు; దాంపత్య జీవితమునకు తగిన శక్తిని, రక్తిని ఇచ్చునట్టివి. మరి, వివాహ ప్రతిబంధక సామగ్రి ఎందున్నది ?

లగ్నము, గ్రహములు ఉండునట్టి విశిష్టభాగల సూచనలను గమనించి, ప్రకృతిసమస్యకు పనికివచ్చు 'సహము' బిందువులను కొన్నింటిని సాధించి, దేవమానదశలో గ్రహచలనము ఏ వయస్సున ఏమేమి సూచించునో, నాలో నేను చర్చించుకొను చుంటిని.

"మీ సాయనచక్రములో ఏమైనా తేలినదా ?"

నామిత్రుడు ప్రశ్నించెను.

"ఎంత చూచినా యుక్తవయస్సులో వైవాహికజీవితము రావలసినయోగములే కనిపించుచున్నవి. ప్రతిబంధకసామగ్రి కానరాదు."

అని నేను చెప్పగానే నామిత్రుడు అందుకొని,

"మొదటినుండి నేనును అట్లే ఊహించితిని. ఈ భుక్తి, ఆ భుక్తి అని కాలహరణమైనదేకాని పెండ్లి కాలేదు. జన్మదినము, కాలము, తప్పుగా చేసుకొన్నానేమో అని సందేహించి విచారించితిని.

పుట్టిననాడే వ్రాయించిన కుండలిని జాతకురాలి తండ్రి చూపించినాడు. సక్రమముగా నున్నది. ఇదే దో, వ్యాసఘట్టము. ఏమైనా తేల్చండి మరి?" అనెను.

"దాదాపు నాల్గుసంవత్సరములనాడు ఈమె ఏదయినా గొప్ప అనారోగ్యముతో కొంతకాలము బాధపడియుండెనా?" అని నేనడిగితిని.

"అవును. గురుమహాదశలో చంద్రాంతరమది. చంద్రుడు రోగస్థానములో నున్నాడు. రెండుసెలల కాలము వైద్యశాలలో ప్రత్యేకపుగదిలో ఉండవలసి వచ్చినది. వ్యాధి వివరాలు నాకు తెలియదు. ఏదో, ఋతుసంబంధమైన వ్యాధి కావచ్చును. కడుపుశూల అనుకుంటుగా విన్నాను. పాపము. వ్యాధితో చాలా కృశించిపోయి ఉండినది. చంద్రుని అంతరములో ఆరోగ్యము చెడునని నేను ముందుగానే చెప్పి యుంటిని."

అని నామిత్రుడు సమాధానము చెప్పెను.

"సరే. రోగస్థానములోనున్న చంద్రుడు అనారోగ్యమును తెచ్చిపెట్ట కలిగినచో, సప్తమాధిపతియై కుటుంబస్థానములోనున్న గురువు తన మహాదశలో భర్తను సంపాదించి ఈయవలదా?" సవిమర్శముగా నా మిత్రుని చూచితిని.

"అదేనండీ వచ్చిన చిక్కు! పెండ్లి పెండ్లి అనుమాటలతోనే గురువు పదహారుసంవత్సరములు కాలక్షేపము చేసినాడు. వాక్స్థానములోనున్న గురువు ఫలము మాటలతోనే చెల్లిపోయినది."

ఈ సమన్వయము నా మిత్రునిమనస్సునకే తృప్తి కరముగా నుండలేదని అతని ముఖభావమే తెలిపినది. క్షణకాల మూరకుండి ఇట్లంటిని.

"నా దృష్టిలో ఈ అమ్మాయికి ఇపుడు వివాహ మక్కరలేదు."

"ఏమి? వివాహమే కాదా?" ఆత్రముతో అతడు ప్రశ్నించెను.

"అక్కరలేదంటిని." అని చల్లగా ప్రతి చెప్పితిని.

"అనగా,—" నామిత్రుని తీక్ష్ణదృష్టి నామాపు లతో కలసినది.

"మహాశయా! ఇంతకాలము కన్యాకాత్వము నిలిచియుండగల జాతకము కాదిది. కొన్ని ఏండ్ల క్రిందటనే వచ్చినవరుడు జాతకురాలికి లభించి యుండగలడు." అంటిని.

"ఓ! అదియా మీ ఊహ? యవ్వనపు అవివేక ములో ఏదైనా పొరపాటు జరిగియుండుననికదా?"

అని నా మిత్రుడు వ్యాఖ్యానముచేసి, క్షణ మూరకుండి, మరల "గొప్పవారిఇంటిసందర్భాలు మనము ఊహించుట కష్టము. మంచికైనా, చెడ్డ కైనా అట్టి స్థలములలో అనేక సౌకర్యములు సిద్ధ ముగా నుండగలవు. అని పోనిండు. మనము గమనించ వలసినది శీలమునకు చెడి అయిన పొరబాట్లు కాదు, సనాతనాచారమునను సరించి వివాహ మెప్పుడు జరుగ వలెననుట తల్లితండ్రులు మంచి సనాతనాచార సంపన్నులు. వివాహము లేకనే ఇంత వయస్సు వచ్చిన కూతురును చూచుచు, వారికి తిన్న అన్నము అంటకున్నది."

అని మెల్లగా వచించెను.

"మహానుభావా! శీలములో పొరబాటని ఎవ రనిరి? జాతకురాలు నిర్మలమైనశీలముకలది. సప్త మాధిపతి గురువు. అతని దశలో అతడు వివాహము జరిపియుండకపోడు. ఇతరులు దానిని గుర్తించినా, గుర్తించకపోయినా ఆమెదృష్టిలో అదే వివాహము. ఏకారణముతోనో, ఆవరుని వదలి వేరే వరులను చూపుచున్నారు పెద్దలు. వారిని నిరాకరించక ఆమె ఏమి చేయగలదు? బహుశః ఆమెదృక్పథము పెద్దలకు అర్థమైనదో, లేదో?"

నా అభిప్రాయమును తెలిపితిని.

"కాదండీ! బృహస్పతి చేయగల వివాహ మిట్టిదేనా?"

అని నా మిత్రుడడుగగా, నాకు నవ్వు వచ్చి నది. ప్రతి చెప్పలేదు.

"ఇదంతా లోకసామాన్యమైన ఊహయా, జాతక ఫలమా?" అని అతడు ప్రశ్నించెను.

లగ్నము తుల. లగ్నాధిపతి కుజరాశిలోనుండి, దానితో పరివర్తనయోగము కుజునికి కలదు. ఆకుజుడు శుక్రునిరాశిలో శుక్రునినవాంశలో ఉండుట. యవ్వ నారంభమందే దాంపత్యధర్మముపై అపారముగ

కాంక్షపుట్టుట దీని స్వభావము. దానికి తగినట్లు దేహ మనఃపాటవములు అభివృద్ధినొందగలవు. మీనరాశిలో పంచమభావములోనున్న మనఃకారకుడు చంద్రునిపై శుక్రునికి గల త్రికోణదృష్టి వలసినన్ని హావభావవిలాసములను సంపాదించి ఈయగలదు. లగ్నములో బుధుడున్న భాగ సనాతనదృష్టితో చూచినచో శీలచ్యుతిని తెలుపజాలినది. విషయ సుఖస్థానములో చంద్రుడాశ్రయించియున్న భాగ వివేకమునకు దూరమైన వ్యామోహపరవశతను సూచించును. కుంభరాశిలో (27-59) శీలహానిని తెలుపు భాగములోనే పూర్వపుణ్యసహమము స్థానము కల్పించుకొనియుండుట! కర్మబంధసహమము (మీనరాశిలో 0 18) చంద్రునికి, పూర్వపుణ్యసహమమునకు నడుమ తటపటాయించుచుండుట విశేషము. ప్రేమసహమము వృశ్చికారంభములో (1-1) చంద్రుని త్రికోణదృష్టిలో నుండి ప్రేమమయజీవితాదర్శముల నిచ్చినది. వివాహసహమము సయితము ఆ శుక్రుని ప్రక్కనే (వృశ్చికరాశిలో (3-5) నిలిచి చంద్రుని వీక్షణకు లోబడియుండుట గమనించదగినది. ఈ సహమమున్న భాగ 'కుట్రలు' 'కుతంత్రములు' తెలుపునట్టివి. తీవ్ర చర్యను తెలుపు భాగలో (కుంభరాశిలో 17-35) మన్మథ సహమమున్నది. ఇవి ఇట్లుండగా, లగ్నమున్న భాగకే ప్రబలవిషయసుఖకాంక్ష, అలక్ష్యముతో కన్నుమిన్ను కానని ప్రవర్తనము ఇచ్చు స్వభావమున్నది. భర్తృసహమమున్న భాగ (వృషభరాశిలో 25-28) దుష్కీర్తిని తెలుపజాలినది.

ఇట్టి స్వభావములను సూచించగల జాతక ధర్మములందు స్త్రీకి యుక్తవయస్సు వచ్చునప్పటికి వివాహము కాకపోయినచో, కాగల పరిణామ మేమో వేరుగా విన్నవించు నవసర ముండదు. విద్యావ్యాసంగము ముగియవలెననియో లేక ఐ. సి. యస్. ఆఫీసరు దొరకవలెననియో ఆశతో సకాలములో వివాహము జరుపక, "ఇంతలో నే మా అమ్మాయికేమి ఆత్రము?" అని చెప్పుచు పెద్దలు కాలయాపన చేయసాగినచో, స్వభావగుణములకు వయఃప్రయుక్తముగా రావలసిన వికాసములు రాకమానవు. కొండపైన భోరున వర్షము కురియుచుండగా క్రింద సెలయేరు పొంగి పారకూడదని ఎవరు శాసించగలరు?

పరిస్థితులిట్లుండగా, 12 సంవత్సరముల పాల ప్రాయమందే శుక్రుడు చలించి, మాయదారి ఇంద్రుని కేంద్రవేధకు రాగలడు. అతిసులభముగా మనస్సు భ్రమపాలగునట్టి దశ ఇది. చాలినంత విద్యకాని, ప్రాపంచిక జ్ఞానముకాని లేని అమాయక వయస్సు కదా? దుష్టులగు స్నేహితులమూలముగా అనర్థకరములగు పరిణామములకు దారితీయు అభ్యాసములు, అనుభవములు సులభముగా పట్టువడును. వానియందు అంకురించిన అభిరుచులతో యౌవనము అభివృద్ధి నొందగలదు. పదునారుసంవత్సరములవయస్సు వచ్చునప్పటికి ఈ శుక్రునికి గురు సంయోగ మబ్బును. ఇంద్రుని కేంద్రవేధగలవాడీ గురువు. 'పంచమ కారముల' చార్వాకమతతత్త్వమును బోధించగలవాడిట్టి బృహస్పతియే! తరువాత కొన్నాళ్ళకే బుధుడు శుక్రుని చేరుకొనగలడు. స్నేహితులకు కొదవయుండదు. కలాశాలలో వ్యాసంగము జరుగుచుండు కాలము కనుక అవకాశము సమృద్ధిగా లభించును. స్నేహితులతో చర్చించునది అర్థశాస్త్రమో, కామశాస్త్రమో పెద్దలకు తెలియు నవకాశము లేకనే కాలక్షేపము జరుగును.

పంతొమ్మిదిసంవత్సరములువచ్చి చలితచంద్రుడు లగ్నములో ప్రవేశించగా జీవితరంగములో రెండవ అంకము ప్రారంభమైనది. అభిప్రాయములు, ఆదర్శములు ఏవో ఒకరూపమునకు వచ్చియుండవలెను. కలిగిన అనుభవములవలని ఫలమది. వివాహసహమము వ్యామోహపరవశత సూచించు ఇంద్రకేంద్రమునకు వచ్చుట, భర్తృసహమము పెడదారి పట్టించు వరుణదృష్టిపాలగుట, మన్మథసహమము గౌరవహానిని తెలుపు కేతుసంయోగమునుపొందుట ఇవి అన్నియు ఏకకాలమందే సంభవించినవి. లగ్నము శుక్రునిపైకి వచ్చుట సైతము అప్పుడే! ఆనందానుభవమునకు మనస్సు ఉవ్విళ్లూరుట వింతకాదు. ఆ కాలమందే చలితశుక్రుడు వృశ్చికరాశి అంత్యభాగములో 'గండసంధి'లో సంచరించుచు ఆనందసాగరములో తేలియాడుట! ఆమె జీవితనాటకములో ఇది వాస్తవముగా గండకాలము!

అట్టి సహజగుణములు కల వ్యక్తికి, ప్రతిక్షణ విజృంభణము చూపు ఆ వయఃపరిపాకములో సౌకర్యసంపత్తు కొరతపడని ఆ నాగరిక జీవితపరిస్థితులలో ఇట్టి దశాపరిపాకము కలిగినచో ప్రాపంచికముగా ఫలమెట్లుండునో సులభముగా ఊహించుట సాధ్యము.

"మత్తా, నదీచ, నారీచ,
నియంతుం కేన పార్యతే."

అను సుభాషితము స్మరింతము.

నాటక మిట్లు జరుగుచుండగా పాతికసంవత్సరములు వయస్సు వచ్చునప్పటికి రవికి ఇంద్రుని ప్రబల వేధ వచ్చియుండును. అదేకాలములో శుక్రుడు రాహుకేతువుల మధ్యములో నలుగుచుండుట సంభవించగలదు. లగ్నము వరుణుని కోణదృష్టికి ఆకాలములోనే వచ్చియుండును. విశేషమేమనగా చలిత పంచమభావమధ్యము నికరముగా వరుణునిమీదనే నిలిచియుండగలదు. ఆ స్థానసహమము (మకరరాశిలో 22-53లో ఉండినది) చలనవశమున బృహస్పతి శుభ వీక్షణభాగ్యమును పొందగల్గుట స్థైర్యము ఆకాలములోనే సంభవించును. రహస్యము కొంత రచ్చకెక్కి, ఆడికలకు అవకాశము వచ్చియుండుట అసంభవము కాదు. గర్భకోశసంబంధమైన అనారోగ్యస్థితి ఏర్పడి. వైద్యశాలశరణమై జాతకురాలు బాధపడి యుండుట పరాసంపర్కములకు తగియున్నది.

నా ఊహలను సాధ్యమైనంత బాగుకతతో, నెమ్మదిగా, కార్య కారణ సమన్వయపూర్వకముగా నా మిత్రునికి నివేదించితిని. అప్పటప్పుడు కుండలిని చూచుచు, చలితగ్రహసహమాదులను పరిశీలించుచు రకరకములైన భావములు ముఖములో తొంగిచూచు చుండగా మారుపలుకక అతడు సమగ్రముగా విని, కొంతకాలము ఊరకుండి, తలయూచుచు,

"ఏమో, ఈలాటి సంభవమే కావచ్చునని, అప్పుడు నేనుకూడా ఊహించుకొన్నానండి!" అని ఇంచుకదీర్ఘముగా ఈడ్చి ముక్తాయింపు చేసి, మరల,

"ఏమి అన్యాయమండీ ఇది? గురుమహాదశలోనే ఆ గురువే సప్తమాధిపతి వానిదశలోనే నీచ సహవాసముతో ఇట్టి శీలహాని రావలెనంటే, — ఇంక..."

అని, అంతటితో ఆగినాడు.

"అదే మన పొరబాటు. శీలవతి కనుకనే, వివాహమునకు పెద్దలెన్ని ప్రయత్నములు చేసినా, ఏదో రీతిగా జాతకురాలు తప్పించుకొనుచున్నది. నా దృష్టిలో ఆమె శీలమునకు లోపము తెచ్చుటకు వారే ప్రయత్నించుచున్నారని."

నా ధోరణి విని నా మిత్రుడు అదరిపడి భ్రాంతుడై తెరచిన నోరు మూయక, విచ్చుకన్నులతో అట్లే నన్ను చూడసాగెను. మరల నేనే ఇట్లు వ్యాఖ్యానము చేయవలసి వచ్చెను.

"తాము రసజ్ఞులు. ఆలోచించండి. తాను మనసార ప్రేమించి గాంధర్వవిధితో దేహమర్పించిన వానిని వదలిపెట్టి వేరే ఎవనిప్రక్కనో పెండ్లి పీటలమీద కూర్చుండుమని జాతకురాలికి మనము బోధించినచో, నీ శీలమును చెరచుకొమ్మని ఆమెను ప్రేరేపించుట కాకమరేమందురు? మనఉపదేశమునకో, నిర్బంధమునకో కట్టుపడి, గత్యంతరము కానక ఆమె వివాహము చేసుకొనునేని వాస్తవముగా అప్పుడే ఆమెకు శీలవ్యాతి. తప్పో, ఒప్పో ఏమి జరిగియుండినా నా దృష్టిలో ఆమె పతివ్రతయే!"

నా మిత్రునికి-ఇప్పుడు సందేహనివృత్తియై ముఖములో మబ్బులు తేలిపోయినవి అతడు పకపక నవ్వనారంభించి తుదకు,

"కాదండీ పసితనపు పొరబాటు వివాహమన వచ్చునా? బాగున్నది ధర్మము? సనాతనాచారములకు తిలోదకప్రదానమేనా మిగిలినది? ఏమి కాలగతి?" అనెను. "మనము చర్చించుచుండునది ధర్మశాస్త్రము కాదు, జ్యోతిశ్శాస్త్రము."

అని సమాధానము చెప్పితిని. మన జ్యోతిషుల్లో అనేకులకు 'వివాహ' మనగా, గృహ్యసూత్రవిధుల ననుసరించి సమంత్రకముగా, అగ్నిసాక్షికముగా, మంగళసూత్రధారణముతో జరిగినదే వివాహమనుభావ మున్నది. ధర్మశాస్త్రదృష్టిలో వారి అభిప్రాయము నిస్సందేహముగా సాధువే. కాని, ధర్మశాస్త్రములు చెప్పిన నీతినియముల ననుసరించి కన్యలు ఈ కాలములో పెంచబడు చున్నారా? సనాతనసంస్కారము వారి కలవాటు పడుటకు వలయు సౌకర్యము లేమి యున్నవి? అన్యదేశీయసంస్కృతిలో పుట్టి పెరిగిన ఇప్పటి విద్యావిధానము మందలో పసువులను విడిచినట్లు యువతీ యువకులను ఏ పాఠశాలలోనో, కళాశాలలోనో, చదువో, పాటో, నేర్చుకొండని 'కలబెరికి'గా చేర్చు పద్ధతులు ఆబాలగోపాలముగా 'ప్రేమమయమే జీవనము' అనునట్టి కూనిరాగముల పచ్చి శృంగారపు పాటలను నేర్పించు సినిమారంగములు

పడుచుతనమున భావోద్రేకము నియ్యగల కథానికలు నిండిన బొమ్మల మాసపత్రికలు, ఇవి, ఈలాటివి అన్నియు ఇప్పటి వాతావరణములో ఏ ధర్మశాస్త్రము ననుసరించి జరుగుచున్నవో? అట్టి సూత్రపద్ధతుల ననుసరించియే కదా ఇప్పటి నాగరక తరుణీతరుణులకు వైవాహిక జీవితాదర్శములు ఏర్పడగలవు? జాతక ఫల విచారములో మాత్రమె ఈ సనాతనత్వము చేయి చేసుకోవలయునా ?

అది యట్లుండె. జ్యోతిశ్శాస్త్ర ఫలవిచారము చేయునపుడు సాంఘిక ధర్మశాస్త్ర సూత్రముల దృష్టితో చూచుట సహేతుక మనరాదు. వివాహ సమస్యలో సప్తమభావము, సప్తమాధిపతి, కళత్ర కారకుడు, వివాహసహాయము మొదలగువానిని పరిశీలించి వైయక్తికముగా ఫలము నిర్ణయించుట శాస్త్ర సంప్రదాయము కాని, ఈ గ్రహములు, ఈ భావములు మున్నగునవి మన హిందూదేశమునకో, ఆర్యావర్త పుణ్యభూమికో,—అందులో, వైదిక ధర్మ కర్మ నిష్ఠాతత్పరుల సంఘమునకు మాత్రమే — సృష్టికర్త నిర్మించి యుండలేదనుట మనము మరువరాదు మన దేశమునందే వైదికధర్మమును అనుసరించనివారెందరో కలరు. ఆఫ్రికాఖండపు నీగ్రోజాతివారికి, అమెరికా దేశపు ఎస్కిమోజాతివారికి, మన మంత్రములున్నవా, మంగళసూత్రము లున్నవా? వారిలో వివాహములు లేవా? శీలమునకు వల లేదా? సూర్యచంద్రాదిగ్రహములు సర్వప్రపంచముకొరకై నిర్మించబడినవి. జాతక ఫలములు మనకువలె అన్యదేశీయులకు సయితము గ్రహస్థితి చూపవలసియే యున్నది. ఆయా దేశమునకు, జాతికి, సంఘమునకు, కాలమునకు, వైయక్తిక ప్రకృతికి, స్వభావమునకు, సంస్కృతికి అనుగుణముగా ఆ గ్రహముల సామాన్యఫలమును మనము అన్వయించుకోవలసి యుండును. సర్వసాధారణముగా ఏ సంఘములో, ఏ సంప్రదాయము వాడుకలో నున్నదో, దానికి అనుగుణముగా ఫలము నూహించుట సయుక్తికమగు మార్గము. కాని, వైయక్తికముగా దీనికి అపవాదములు లేకపోవు. మహాభారత కథ జరుగునాటి కాలములో ద్రౌపది వివాహమువంటి వివాహములు ఆర్యావర్తములో వాడుకలో నుండలేదుకదా! ఆ వివాహము వ్యక్తిగతమైన విశేషవిధిగా వేదవ్యాసుడే తీర్మానించినాడు! జీవితములో నాలుగైదుమార్లు న్యాయస్థానమునకెక్కి విడాకులు పంచుకొని, మరల మరల క్రొత్తభర్తలకు సశాస్త్రీయముగా సంతానము కనుచున్న స్త్రీలు నేటికాలములో శ్వేత జాతులలో ఎందరు లేరు? వారిలో కొందరికయినా కన్యారాశి లగ్నమగుట, బృహస్పతికే సప్తమాధిపత్యము వచ్చుట, యుక్తవయస్సులో గురుదశ నడచుట అసంభవము కాదు. అట్టి సందర్భములలో బృహస్పతికి ఫలము మన పరాశరస్మృతిననుసరించి చెప్పవచ్చునా ? ఈ న్యాయమును గమనించనిచో జ్యోతిశ్శాస్త్రమునకు మనము అపార్థము చేసినవారమగుదుము.

ప్రశంసలోనున్న జాతకురాలికి తారుణ్యము అంకురించినపుడు మనోనిగ్రహము చేత కాని స్వభావమున్నది. అంతదౌర్బల్య మేల, అని అడుగుటకు మన కధికారము లేదు. చింతపండుకు పులుపెందుకో, ఏ శాస్త్రజ్ఞుడు చెప్పగలడు? ఆమె పురాతనకర్మ ఫల పరిపాక మనుకోవలసినదేకదా ? చిన్న వయస్సులోనే దాంపత్యసర్వానుభవమునకు తగిన దేహమనఃపాటవములు చక్కగా అభివృద్ధినొందినవి. సౌకర్యములు ఎదిగివచ్చినవి. సకాలములో సప్తమాధిపతి గురువుదశ వచ్చినది. తన విధ్యుక్తధర్మమును తాను నెరవేర్చినాడు బృహస్పతి. మంగళవాద్యములు వాయించి, మంత్రములు పాడించి తాళి కట్టించుట మనపని; బృహస్పతిది కాదు. ఆమెకు అక్కరపడినపుడు భర్తను సంపాదించి ఈయక పెద్దలు ఉదాసీనము చేసినారు. ఆ కాలమునకు అందుబాటులో ఉన్నవారిలో నచ్చినవానినొకనిని తానే వెదకుకొని ఆమె దశాఫలమును అనుభవించుచుండుటకు సందేహము లేదు. గ్రహములు తమతమ వాగ్దానములను సకాలములో మనకు అందియ్యగలవు. సంకుచితదృష్టి మనకే కాని గ్రహములకు లేదు.

విషయమంతయు సావధానముగా విని, ఆ సాధుశీలుడు ఇతరులెవరు కాని సమీపములో లేరని కనుగొనుటకై ఒకమారు చుట్టును చూచి, నన్ను సమీపించి రహస్యముగా,

"ఒక్క తమాషా వింటారా? చెప్పకోవలసిన మాటకాదు. కాని, మీమాటలు విన్నతరువాత ఒక్క విచిత్రానుభవమును మీతో చెప్పవలెననిపించినది." అనెను.

"చిత్తము." సావధానతను చూపితిని. నా కుతూహలము జాతకదృష్టితో మాత్రమే.

"వినండి. మూడు నెలల నాటి మాట. అప్పుడప్పుడు జాతకురాలి ఇంటికి వెళ్లుట నాకు అలవాటు. ఆమె తల్లితండ్రులకు — నా విద్యకనండి, నా ఆచారమునకనండి, — నామీద గొప్ప గౌరవము. జాతకురాలికి, సరేసరి. ఏండ్లకొలది కావ్యనాటకాదులు పాఠము చెప్పినానుకదా? ఒకనాడు ఆమె గదిలో — రెండవ అంతస్తులో, ఉద్యానవనముపైపున ఉండు ప్రత్యేకపు గది ఆమెది — ఆమెతో ఏదో లోకాభిరామాయణము మాటలాడుచుంటిని. సాయంకాలము నాల్గు గంటల వేళ. ఎలెక్ట్రిక్ పంఖా క్రింద సోఫాలలో ఎదురుబదురుగా కూర్చుండి మేము మాటలాడుచుంటిమి. వారము దినముల క్రింద ఒక వరుని జాతకము వచ్చియుండినది. అది గొప్ప రాజయోగ జాతకము. వృషభలగ్నము; లగ్నములో రాజయోగకారకుడు శని; దశమాంగారకయోగము. జాతకము రమ్యముగా నుండెను. నక్షత్రానుకూల్యము బాగుండినది. అన్నివిధములా తగిన సంబంధము. కాని, అమ్మాయి సమ్మతించలేదు. ఏదో, ఒక కారణము చెప్పినది. తల్లి ఈ విషయమునుగూర్చి నాతో చెప్పుకొని చాలా దుఃఖపడియుండెను. మాటలవరుసను నేనీ ప్రశంస ఎత్తితిని. శిష్యురాలు కదా? ధారాళముగా, నిస్సంకోచముగా మాటలాడుకొనుట మాకు అలవాటు. ఆమె అంతరంగిక విషయములు — కొంత — నాకు తెలియునని ఆమె ఎరుగును. వచ్చిన వరులనందరినీ ఏదో సాకు పెట్టి నిరాకరించుట హితము కాదనియు, తల్లిదండ్రులకిది అపార మనఃక్లేశముగా నున్నదనియు సంఘములో గౌరవహానికి అవకాశమేర్పడుననియు, ఉన్నంతలో ఎవనినో తగినవానిని వరించి త్వరలో వివాహము చేసుకొనుట యుక్తమనియు కొంత విపులముగానే ఉపన్యసించితిని.

ఇట్లే, అపుడపుడు చెప్పుచుండుట వాడుక. నెమ్మదిగా విని, చిరునవ్వుతో తల ఊచేది ఆమె 'మామూలు.' కాని, ఆనాడు ప్రశాంతముగా, గంభీరముగా క్షణకాలము శూన్యదృష్టులతో ఉద్యానవనమువైపు చూచుచుండి ఏమి తోచెనో తటాలున లేచి నా సమీపమునకే వచ్చి స్వస్తికబంధముతో చేతులు కట్టుకొని నిలబడి, కొంతనెడ నవ్వు సూచించు ముఖముతో,

'తా మొక్క ఉపకారము చేయగలరా, మరి?' అని సవినయముగా అడిగెను.

ఏదో, ఉపదేశము పారి, సుముఖముగా నున్నదని నాకు చాలా సంతోషమైనది. రుక్మిణీసందేశమువంటి రాయబార మేదో కావచ్చునని నా ఊహ.

'అవశ్యకముగా చేతును. చేతనయినంతలో, శక్తివంచన చేయను.'

అని వెంటనే ప్రతి చెప్పితిని.

'ఈ వరు లెవ్వరూ నాకు నచ్చరు—— మరి ?————...————?'

ఏదో, సంకోచపడి అంతటితో ఆమె నిలిపినది. నన్ను పరీక్షించుదానివలే, నిశితముగా నన్ను చూడసాగినది

'చెప్పమ్మ! సంకోచపడవద్దు.' అని బుజ్జగించితిని. వెంటనే,

'నా ప్రార్థన ఇది. మీరే తాళికట్టి పుణ్యము కట్టుకోవలెను.' అని దైన్యముతో ఆమె ప్రతి ఇచ్చెను.

ఎగతాళి అనుకొంటిని. నవ్వు వచ్చినది.

'శబాస్! మంచి వరుణ్ణే వెదకినావే!' అంటిని. కాని, — ఆమె ముఖభావములలోనైనా, చూపులలోనైనా, పరిహాసమో, చులకదనమో, కానరాలేదు.

'నా కష్టములు తమకు తెలియనివి కావు. తమకంటె అనుకూలుడైన భర్త నాకు దొరకడు.'

ప్రశాంతముగా, సవినయముగా, ఆమె ఈమాట చెప్పగా నా నుండియు లాగిపోయినట్లయినది. ఏమో ప్రమాదమునకు దారితీసినదే, అని భయపడితిని. కష్టముతో, పెదవులు తడుపుకొనుచు, తడబడు మాటలతో,

'అమ్మాయీ! నేను వృద్ధుడను. పైగా, బ్రహ్మచర్యవ్రతము కలవాడనని నీకు తెలియును. ఇవేమి మాటలు?' అంటిని.

నా మాటకు ఆమె వెంటనే, 'మీ వ్రతనియమములంతా నాకు తెలుసును. కనుకనే నా ప్రార్థన. నా సాహసమును క్షమించండి. ముఖ్యముగా, మీ వయస్సు నాకు చాలా అనుకూలము. మీ బ్రహ్మ

చర్యమునకు ఎన్నడుకాని, అణుమాత్రమైనా భంగము కల్గించుపని చేయను. తమ పాదము లంటి,' తటాలున ఆమె తన మోము హస్తములతో నా పాదముల నవృశు స్పృశించి,

'ప్రమాణము చేయుచున్నాను. దైవమే సాక్షి. మీకు కావలసిన సౌకర్యములంతా ఎదిగించు ఇచ్చు భారము నాది. పెండ్లి కాలేదనే అపనింద నాకు తాము పోగొట్టితే, అదే నాకు వరప్రసాదము. నా కష్టమో, సుఖమో, నేను చూచుకొందును. మాట ఇచ్చినారు. ఉపకారము చేయండి.'

అని సమాధానము చెప్పినది. విశాలములైన ఆమె కన్నుకొలకులలో బాష్పబిందువులు కానవచ్చెను. నిర్విణ్ణుడనైతిని. తటాలున అంధకారము మూసుకొన్నట్లయినది. నోటమాట రాలేదు. తలవంచి ఊరక స్తబ్ధుడనై కూర్చుండి యుంటిని పదినిమిషములయినా జరిగియుండును. ఏమీ తోచినది కాదు.

అకస్మికముగా జాతకురాలితల్లి ఎందుకో ఆ గదిలోనికి వచ్చెను. తలఎత్తి చూచితిని. ముఖము మరలించి కన్నులు తుడుచుకొని జాతకురాలు గది వదలి పోయినది. కూతురును నేను దండించియుందునని ఆమె ఊహించుకొని,

'శిష్యురాలు ఏమైనా దారికి వచ్చే సూచనలున్నవా?' అనెను.

'నాకే, దారి దొరకలేదమ్మా!' అంటిని.

తరువాత, ఏదో సాకులతో ఆ ఇల్లు వదలి బ్రతికితి ననుకొనుచు నా ఇల్లు చేరుకొన్నాను. నాటి నుండి మరల ఎన్నడుకాని, ఒంటిపాటుగా జాతకురాలిని కలుసుకొనకుండా జాగ్రతపడవలసి వచ్చినది. స్త్రీలస్వభావము అర్థము చేసుకొనుట చాలా కష్టమండీ! ఆమెయొక్క ఆకస్మికప్రవర్తనము నాకు అత్యాశ్చర్యము కలిగించినది. ఈనాటి చర్చవలన నాకు కార్యకారణసమన్వయమగుచున్నది."

నా మిత్రుడు కథను ముగించినాడు.

"శిష్యురాలికి ఆమాత్రము ఉపకారముచేసి కన్నెచెర బాపలేకపోయినారా, మరి?" అంటిని.

ఇద్దరము నవ్వుకొంటిమి. అంతలో మా గదిలోని కెవరో రాగా, మా చర్చ ఆగిపోయినది.

"అహోతుః పక్షపాతోయః,
తస్య నాస్తి ప్రతిక్రియా,
నహి స్నేహాత్మక స్తంతుః,
అంతర్మర్మాణి సీవ్యతి."



# ఆకాశదీపము



శ్రీ దిగుమర్తి సీతారామస్వామి

స్పృహణీయములౌ మసారో
ద్వహనీయ రుచిప్రరోహదర్పితసంధ్యా
మహములు శారదసాయ
మ్మహరిత్తులు దీపలక్ష్మి హర్మ్యాగ్రస్థలముల్.

కకుభాలోకన నైల్యముల్ చెనఁ సంగారగ్రహాస్మిం నా
ర్ద్రికళల్ వెల్గుచు స్వాగతించెదవు సంధ్యావ్యోమ దీవ్యత్సమీ
రకసంస్పర్శలఁ దాళి నిల్వఁగల ధైర్యం బబ్బెనో పుణ్యకా
ర్తికరత్నాంబలమందు వజ్రతనుసందీప్తిన్ వియద్దీపమా.

అతిదూరస్థులు తారకభ్రమితులై యర్చింప నాప్తుల్ సమీ
ప తమస్తారణ దుర్బలార్చి వనుచున్ వాకొంద్రు స్వప్రతి
ష్ఠితుఁడౌ వ్యక్తి స్వదేశవిస్మృతుఁడు కాఁడేయందునో విశ్వవో
దితులా మూఢులు దేశదూరులగు నాత్మీయప్రభా కింకరుల్

అనుకూలమ్మగు నిత్యసంసరణ సౌఖ్యాతర్పితస్వాంతయా
వనితాలోచనరోచి ప్రేతుకతమః ప్రక్షాళనజ్యోతి వై
క్షణమే చాలును రోదసీకుహర నిష్కంపప్రదీపంబవై
మనుమా పుణ్యమునన్ భవిష్యదుడు జన్మంబబ్బు జ్యోతిష్మతీ.



శ్రవ్యనాటిక :

# స్వేచ్ఛ

శ్రీ వేలూరి సహజానందం

(రైలు చప్పుడు)

ఉమ: మామ్మగారూ...స్టేషను వస్తోంది.

ముసలి: అప్పుడే...మన కబుర్లలో ఇట్టే గడచిపోయింది కాలం.

ఉమ: కాని, మామ్మగారూ...నామనస్సంతా ఇంటిదగ్గర కుర్రాడిమీదే ఉంది.——వాడికి నీళ్ళూ, తిండీ...

ముసలి: అవునమ్మా—తల్లులకు పిల్లలమీద అల్లాగే ఉంటుంది.

ఉమ: దగ్గరకు వచ్చేశాం.

ముసలి: మావాడు స్టేషనుకి వచ్చిఉంటాడు.

(రైలు ఆగిన చప్పుడు)

ముసలి: అబ్బాయీ—ఇక్కడ—ఇక్కడ.

శేఖర్: వస్తున్నా అమ్మా...ఆ...(క్షణం ఆగి)—ఒక్కత్తెవే ప్రయాణం చేసినట్టున్నావే.

ముసలి: కాదురా... ఇదిగో ఈమె తోడు ఉంది. ఈమె శ్రీధర్ అప్పగారు.

శేఖర్: శ్రీధర్ కూడా వచ్చాడమ్మా—బహుశా అవతల పెట్టెదగ్గర వెతుకుతూ ఉంటాడు. ఆ... ఆః శ్రీధర్——శ్రీధర్——ఇల్లా రా.

శ్రీధర్: అక్కా బడలికఅయిందా ప్రయాణం.

ఉమ: ఏమంత బడలికగా లేదు, సామాను దింపించు. మామ్మగారూ, మరి, వస్తాం.

ముసలి: పదమ్మా, పద—ఒరే శేఖర్ సామానంతా సరిగా దింపించావా? మొత్తం 6 శాల్తీలు.

వెళ్ళమ్మా: ఉమా వెళ్ళు. పిల్లడిమీద అంత బెంగ ఉంచకూడదు. మనము నిత్యమూ ఏమిటి, ఈ మమకారాలతో దిగులుపడటానికి.

(రైలు కదలిన చప్పుడు—వెంటనే గోలాహాలం—"అరె ఘోరం" అన్న మాటలు.)

ఉమ: శ్రీధర్ ఏమిట్రా ఆ కేకలు.

శ్రీధర్: శేఖర్...ఏమిట్రా.

శేఖర్: రైలుకింద పడ్డాడు ఎవడో...అంతా ఒక నెత్తురు మడుగు.

ఉమ: అహ్...

ముసలి: ఘోరం.

శేఖర్: పెళ్ళాం పాపం శవంపైబడి ఘోష పెడుతోంది.

(—నేపథ్యంలోంచి దుఃఖారావం—)

ఉమ: ఆమెకు మన మేమీ సహాయం...

శేఖర్: అమ్మా...ఒక్కక్షణంలో వచ్చేస్తా...

ముసలి: ఎక్కడికిరా?

శేఖర్: ఆ అనాథకు ఏమైనా ఇచ్చి వస్తాను.

ఉమ: శ్రీధర్...

శ్రీధర్: ఏమిటక్కా.

ఉమ: ఎంత అపశకునంరా...ఆ రైలు చక్రం నా గుండెనే రాచుకుపోయినట్టుంది. దుశ్శకునం.

శ్రీధర్: ఛా...మృత్యు వడుగు పెట్టనిచోటు, అడుగుపెట్టని సమయం ఎక్కడ? నువ్వు రావటమే ముఖ్యం. మా భార్యాభర్తల మధ్య కమ్ముకున్న చీకటి నీ సమక్షంలో తొలగిపోతుందని ఆశపడుతున్నాం... ఎవడో కళ్ళు తూలిపడి ఉంటాడు. చూస్తూ చూస్తూ బుద్ధిపూర్వకంగా ఎవడు—

ఉమ: ఊ...మరి...శేఖర్‌ను నువ్వు బాగా ఎరుగుదువా?

శ్రీధర్: ఆ....

(శ్రీధర్ ఇల్లు)

సుశీల: వదినా...అన్నగారూ ... పిల్లవాడూ కులాసా.

ఉమ: ఆ...సుశీలా...మరి మీరంతా...

సుశీల: ఇదిగో ఇలా ఉన్నాం...మీ తమ్ముడు ఎప్పుడూ ఇంటిపట్టున ఉండరు గదా ... ఈమధ్య విన్నారా ... పిల్లలకు పాఠాలు చెప్పే పంతులమ్మతో...

ఉమ: విన్నా...సుశీలా. అంతా విన్నా... వాడే చెప్పాడు దారిలో...ఇకనుంచీ సరిగా ఉంటా నన్నాడు. నువ్విక దిగులుపడకు.

సుశీల: ఎప్పటికప్పుడు ఇలాగే అంటారాయన ...నలుగురు పిల్లలు నేను...ఈయన చేసేపనులకు ఎలా సహించి ఊరుకోడమో చెప్పు ఒదినా... నువ్వంటే నాకు చాలా ప్రీతి, లక్ష్యము. కాని నా దుఃఖం సహనాన్ని దహించివేస్తోంది.

ఉమ: అవును సుశీలా...నీ సౌశీల్యం నాకు తెలియదా? కాని ఈ పరిస్థితిలో ఏమిటి చెయ్యటం ...అనేదే ప్రశ్న.

సుశీల: విడిచిపెట్టి పోదామంటే, ఒక పక్కన పిల్లలు...కలసి ఉందామా అంటె, క్షోభగా ఉండె —ఆ పంతులమ్మ చిన్నది. అందమైనదీను...నా అందం...యౌవనం అన్నీ హరించిపోయినయ్. కారణం...ఆయనే. పిల్లలు పుట్టకమునుపు నేనూ అందకత్తెనే...కాని నా సర్వస్వాన్నీ ఆయన విలాసాల కర్పించాను. చివరి కిప్పుడు ఏ నవయువ్వని అయినా నాకంటె ఎక్కువ ప్రియంగా కనబడు తుంది–ఆయనకు...

ఉమ: అవును సుశీలా...ఇదంతా నిజమే...

సుశీల: తమని విడిచిపెట్టలేని అబలలం అను కుంటారు వీళ్లు. కాని ఈ పిల్లలమూలంగా మనం ఇళ్ళకు అంటిపెట్టుకొని ఉంటున్నామని వీరికి తెలిస్తేగా...నీ అహంకారం తిరుగుబాటు, విరక్తిఅంతా ఈ పిల్ల లగుపడగానే నాగస్వరం విన్న తాము పాముల్లా మంత్రముగ్ధులవుతయ్. పిల్లలముందు మనం చంటిపిల్లలమై పోతాం.

ఉమ: నిజం సుశీలా...ఈ పిల్లలకోసమైనా మనం సంసారాల నెలాగో ఈదవాలి. తమ్ముడి మనస్సు నాకు తెలుసు. ఇక వాడిమాట నమ్ము. నిజంగా పశ్చాత్తాపపడుతున్నాడు. ఇంక సరిగా ఉంటాడని...

(తలుపు తట్టిన చప్పుడు)

శేఖర్: ఆ... నేను...శేఖర్ని...మీ రంతా మా ఇంటికి భోజనానికి రావాలి ఉమాదేవిగారూ... మీరు రావాలి తప్పక.

సుశీల: శేఖర్...మీ అమ్మగారు కులాసా?

శేఖర్: ఆ...ఆవిడా ఉమాదేవిగారు రైలులో కలిసి ప్రయాణం చేశారు. ఆమె ప్రత్యేక ఆహ్వానమే ఇది. మరి నే వెళ్ళివస్తా...

ఉమ: మీకు శేఖర్తో బాగా పరిచయం ఉందా సుశీలా?

సుశీల: బాగా చనువుగా ఉంటాడు.

ఉమ: మనం వాళ్ళింటికి వెళ్ళాలా?

సుశీల: ఆ...మరి అతను వచ్చి పిలచిపోయాడుగా...

ఉమ: మీరు వెళ్ళండి. నేను కొత్తదాన్ని. నే నెందుకు?

సుశీల: సరే బాగుంది. అసలు నిన్నుబట్టే మమ్మల్ని పిలిచాడు ... చాలాకాలంనుంచి ఎరిగి ఉన్నట్టు నిన్ను పిలిచాడు...నువ్వు రాకపోతే బాగుండదు.

ఉమ: సరేగాని, ఇక మీ ఇద్దరూ అరమరలు లేకుండా ఉండాలిసుమా. అదుగో...శ్రీధర్ వస్తున్నాడు. వాడికికూడా చెప్తా.

సుశీల: ఇంట్లో పిల్లలేదో గోల చేస్తున్నట్టున్నారు...వస్తా.. ఒదినా.

ఉమ: నాకు తెలుసులే...అదంతా...కూర్చో (శ్రీధర్ ప్రవేశం)...శ్రీధర్ మరి...

శ్రీధర్: ఇప్పుడే వస్తా...అక్కా...గదిలో కాగితాలు...

ఉమ: పిల్లలు, కాగితాలు...వాటి సంగతి తర్వాతిగాని మీఇద్దరు...ఇటు ఇక్కడ కూర్చోండి. మరి ఇకముందు...

శ్రీధర్: ఊఁ...ఊ.

సుశీల: ఆ. ఆ...మరి...

ఉమ: సరే.. ఇక పోండి.

సుశీల: శేఖర్ వచ్చి భోజనానికి పిలిచాడండీ.

శ్రీధర్: నే నిప్పుడు వాళ్ళింటికే వెళ్ళివస్తున్నా ...మరి అక్కా...నువ్వు తప్పక రావాలన్నారు తల్లీ కొడుకులు...నువ్వు పాడతావని చెప్పా.

ఉమ: శ్రీధర్.

శ్రీధర్: అవునక్కా. అతనికి సంగీతమంటె చాలా ఇష్టం. మనను డబ్బున రమ్మనికూడా చెప్పాడు. ఇవ్వాళ నువ్వు వాళ్ళింట్లో పాడాలి.

ఉమ: పాట...ఎందుకు చెప్పావురా...నేనసలు వెళ్ళవద్దనే అనుకుంటున్నా...

శ్రీధర్: అతను ఫిడేలు వాయిస్తాడు.

(శేఖర్ ఇంట్లో-ఫిడేలు సంగీతం)

శేఖర్: సుశీలా...శ్రీధర్ ... రండి రండి... అమ్మా...ఉమాదేవిగారుకూడా వచ్చారు.

ముసలి: రామ్మా...రా ... రైలుప్రయాణం చేసే నీతోనే చేయాలి. ఈ ప్రయాణం నే నెప్పటికీ మరువలేను. ఎరిగున్న చోటులకే ప్రయాణం చేస్తున్నా, ఏదో కొత్తచోటుకు వస్తున్నట్టుంటుంది. అవునా.

(ఫిడేలు మీటుతున్న శబ్దం)

ఉమ: మామ్మగారూ మీరిక్కడే ఉంటారా?

ముసలి: ఆ...ఇక్కడే ఉంటానమ్మా. వీడిని విడిచి ఉండలేను. మరి...నీపాట విన్పించాలి

ఉమ: ఆ వయొలిన్ వాయించే దెవరు?

ముసలి: మావాడే...శేఖర్...ఇంత అందమైన దానికి...నీవు దేవుడు చక్కని గొంతునిమ్మటుకు ఇవ్వకుండా ఎందుకుంటాడు?

(ఫిడేలు సంగీతం)

శ్రీధర్: అక్కా...శేఖర్ బాగా వాయిస్తాడు ఫిడేలు...సంగీతం మనను కొత్తలోకాలకు తీసుకు పోతుంది...

ఉమ: (నమ్మకంలేని స్వరంతో) కొత్తలోకాలకు.

శ్రీధర్: అవును సంగీతానికి తెగిపోని సంకెల ఏదీ లేదు. మన పరాధీనజీవితాల్లో నష్టమైన స్వేచ్ఛ, స్వత్వం సంగీతంలో లభిస్తయ్. వాయించవోయ్ శేఖర్...పాడు ఉమా!

ఉమ: కొత్తలోకాలకై
కలవరించెద వేమి
కాలి సంకెళ్ళను
మఱచిపోయితివా!
నీ స్వప్న భ్రాంతిలో
స్వర్గాలు ఉదయించు
కన్ను తెఱచితె కాలు
చీకటే బుసకొట్టు

ముసలి: భూమ్యాకాశాలమధ్య ఉయ్యాల లాగినట్టుంది.— ఈ శతవృద్ధుకికూడా. ఇక లేవండి భోజనాలకు.

(శ్రీధర్ ఇల్లు...)

ఉమ: ఒరే శ్రీధర్...ఇక నా ప్రయాణంసంగతి చూడు.

శ్రీధర్: ఏమిటే అక్కా?

సుశీల: అప్పుడే ఒదినా? వచ్చి నాలుగు రోజులైనా కాలేదు.

ఉమ: కాదు సుశీలా...వెళ్లాలి...

సుశీల: పిల్లాళ్ళు ఉంటామన్నారు.

ఉమ: పిల్లాళ్ళు...కాదు ఇంకో రోజుకూడా ఉండలేను. మధు ఎంత బెంగపడ్డాడో.

సుశీల: ఇంకొక్క నాలుగు రోజులైనా ఉండు ఒదినా...నువ్వడుగు పెట్టాక ఈ సత్రం మళ్ళీ ఇల్లు అయింది. లోలకరికి మొక్క మోడు చిగిర్చినట్టు నీ సన్నిధిలో మా ముఖాలకు మళ్ళీ ప్రాణం వచ్చింది మా నిధి మాకు దొరికినట్టుంది.

ఉమ: ఇది మీ హృదయాల అనురాగం. దీనిలో నాదేముంది? వెయ్యికాలాలకు మీ రిలాగే ఉండాలి. శ్రీధర్ నా సామాను...అది సర్దించు. వారికి ఉత్తరం వ్రాశాను.

శ్రీధర్: అప్పుడే.

ఉమ: ఆ...స్టేషనుకు వస్తారు...

శ్రీధర్: నాకేమీ అర్థం కావట్లేదు...అక్కా...శేఖర్ తల్లి అడిగితే, పదిరోజు లుంటానన్నావు కదూ...

ఉమ: కాదురా వెళ్లాలి. ఇక మళ్ళీ అడ్డు పెట్టకు.

శ్రీధర్: శేఖర్ ఎలా వాయించాడక్కా?

ఉమ: సంగీతమంటే మీ బావ కంత ఇష్టం ఉండదురా...

శ్రీధర్: బావ కెప్పుడూ ఆఫీసు, రిపోర్టులు...

ఉమ: సంగీతం మనస్సును ఉద్రేకపఱచి దుర్బలపరుస్తుందంటారు.

శ్రీధర్: మనంవశం తప్పుతాం.

ఉమ: సరేగాని...డబ్బున సామానుసర్దించు...

(విరామము...)

శేఖర్: సుశీలా.. శ్రీధర్ ఏడి?

సుశీల: రా మఱదీ.

శేఖర్: అదుగో అదే వద్దన్నా...కొత్తవాళ్లైదుటకూడా

సుశీల: కొత్తవాళ్లెవరు...ఉమను రైలెక్కించటానికి వెళ్ళారు...

శేఖర్: ఉమ...పెల్లాళ్ళుంటానందిగా... అప్పుడే...

సుశీల: తన పిల్లడిని విడిచి క్షణం ఉండలేదావిడ.

శేఖర్: ఆడవాళ్ళది చలచిత్తం.

సుశీల: చాలులే.

శేఖర్: సరే మళ్ళీ వస్తా.

సుశీల: ఆయన వచ్చేదాకా కూర్చో...

శేఖర్: కాదు...వెళ్లాలి ... ఈపాటికి రైలు కూడా వెళ్ళిపోయి ఉంటుంది.

(రైల్లో)

ఉమ: ఇంక స్టేషన్ దగ్గఱకు వస్తోంది...వెళ్ళగానే నా మధు అమ్మా అమ్మా అంటూ గంతులేస్తూ

వస్తాను. శేఖర్ ఒక.....దుస్స్వప్నం.....కాక పోతే...

(రైలు ఆగిన చప్పుడు)

మధు: అమ్మా...అమ్మా...

ఉమ: రా...మధూ బెంగలేకుండా ఉన్నావా?

మధు: అమ్మా...

ఉమ: రా నాన్నా రా...

భర్త: అక్కడ మనవాళ్ళంతా కులాసా? నువ్వు లేని ఈ నాలుగురోజులూ ఇల్లంతా చిన్నబోయింది.

ఉమ: మీ కచేరీపను లెలా ఉన్నయ్.

భర్త: వాటి కంతూ పొంతూ ఉండదుగా.

ఉమ: నేనుకూడా లేనయ్యె...పొద్దుననుంచి సాయంకాలందాకా నిరాటంకంగా ఆఫీసుపని చేసుకోవచ్చు.

భర్త: సరేలే...వీడు మధు...నువ్వు లేవుగదా అని దగ్గరకు పిలిస్తే రానే రాడు. గదిలో కూర్చొని బిక్కు బిక్కుమంటూ ఉంటాడు. తల్లితర్వాతే గావును తండ్రి...

మధు: ఇంకెప్పుడూ వెళ్ళకమ్మా.

ఉమ: వెళ్లను బాబూ.

మధు: ఒట్టువయ్యమ్మా. ఎప్పటికి నన్ను వదలి వెళ్ళనని...

ఉమ: ఛా...పిచ్చిబాబూ ... (సంకోచిస్తూ) ఎందుకు వెళ్తారా నిన్ను వెడచిపెట్టి...పద—జుట్టు దువ్వుతా పద...

భర్త: నేను కచేరికి వెళ్తున్నా...వచ్చేప్పటికి ఆలస్యం అవుతుంది...మొత్తానికి తమ్ముడి కాపురం ఏదో నిలబెట్టే వచ్చినట్టున్నావు.

ఉమ: ఆ...పుస్తకాలు తీసుకో మధూ...

మధు: బడికి వెళ్ళనే అమ్మా.

ఉమ:—ఎళ్ళే.. వెళ్ళిరా...నాయనా.

మధు: అమ్మ వెళ్తున్నానే.

భర్త: కచేరికి వెళ్తున్నా...ఉమా...

ఉమ: అబ్బ...ఎప్పుడూ కచేరీ కచేరీ... ఏమిటో ముఖం...ఆ చెవులు ఆ కళ్ళు.

---

(ఫిడేలు సంగీతం)

(తలుపు తట్టిన చప్పుడు)

ఉమ: ఎవరు?

శేఖర్: నేను...

ఉమ: (ఉలిక్కిపడ్డట్టు) ఎప్పుడు...శేఖర్.

శేఖర్: ఇవ్వాళే వచ్చాను.....చెప్పి వస్తే మిమ్మల్ని ఎవరైనా రానీయరేమోననా? అలా చెప్పకుండా వచ్చేశారేం?

ఉమ: ఏమీ లేదు...

శేఖర్: ఏదో పనిమీద వచ్చాను...మళ్ళీ మీ పాట వినగలననుకున్నా...ఆ పాట జాలునే వచ్చాను...కొత్త లోకాలకు.

ఉమ: శేఖర్.

శేఖర్: ఉమా...వెళ్తాను...రేపు మంచి పాట కచేరీ ఉంది...మీరుకూడా వస్తారనుకుంటాను.

ఉమ: అక్కడకూడా నేను పాడాలా?

శేఖర్: ఆ...మీపాట వినే అదృష్టం అందరకీ ఉంటుందా? తప్పక వస్తారుగదూ...

(మధుమాటలు, అమ్మ నన్ను వదలిపెట్టి ఎక్కడకూ వెళ్ళవుకదూ...ఒట్టు వెయ్యవూ,)

మధు: అమ్మా, అమ్మా.

ఉమ: అప్పుడే వచ్చేశావేంరా బాబూ...

మధు: ఏమిటో నే...ఒక్క నిమిషం వుండే బుద్ధి వేయలేదు.

ఉమ: నా పిచ్చినాయనా...రా...

---

(...విరామం)...

భర్త: ఉమా...

ఉమ: (పరధ్యానంగా) ఆ.

భర్త: నీతో ఒక విషయం మాట్లాడాలి.

ఉమ: ఏమిటది?

భర్త: చాలా ముఖ్యమైన విషయం.

ఉమ: చెప్పండి.

భర్త నీవూ అతనూ...

ఉమ: ఊ...

భర్త: అలా చనువుగా మాట్లాడటం పక్క వాళ్ళ కంత హితవుగావుండదనే సంగతి నువ్వు గమనించావో లేదో అని చెప్పుతున్నాను.

ఉమ మీకు...

భర్త: ఛా...నా కలాంటి నీచాభిప్రాయాలు లేవని నీకు తెలియదూ? ఊరికే చెప్పాను. చుట్టూ ఉండేవారి కలాంటి అభిప్రాయాలు కలుగవచ్చునో అని. మరి వెళ్తున్నా...కమిటీ మీటింగు ఉంది.

(పాజ్)

ఉమ: ఎందుకో ఈ చాటు...శేఖర్ నేనూ మాట్లాడుతున్నప్పుడు శేఖర్ కేసి తను చూసినచూపు నా కర్థం కాలేదని గావును...ఆకటుస్వరం, అదివపు

చూపు అబ్బ...ఆ చెవులు...ఆ ముఖం...అహ్... గోజు గోజూ తనమీద నాకు జుగుప్స ఎక్కువవుతోందని తెలుసుకోగలిగితే? అసలు నేనొక ప్రాణినని, నాకు హృదయం ఉందని తెలుసుకుంటేగా! ఎవరది...శేఖర్...శేఖర్...

శేఖర్: ఆ...ఏదో ఆలోచిస్తున్నట్టున్నావు...

ఉమ: ఆలోచనకేమి? కూర్చో...వెళ్ళిపోతున్నావా మీ ఊరు?

శేఖర్: ఏమో.

ఉమ: అదేమిటి శేఖర్ అలా అంటావు?

శేఖర్: నేనుంటానో, వెళ్తానో నీకే తెలియాలి ఉమా?

ఉమ: (తగ్గుస్వరంలో) వెళ్ళమనుకుంటా.

శేఖర్ నీ ఆజ్ఞ (సంతోషంగా)

ఉమ: శేఖర్.

శేఖర్: ఉమా. ఎవరో వస్తున్నట్టున్నారు.

ఉమ: బాబు బడినుంచి వచ్చే వేళ...

శేఖర్: వస్తా...ఉమా...నాకేసి ఎప్పుడూ భయభ్రాంతితో చూస్తాడు.

ఉమ: అవును...పాపం వాడి ముఖం అంతా ఒక్కసారిగా మారిపోతుంది.

శేఖర్: వెళ్తున్నా...

ఉమ: రేపు రావాలి తప్పక. మనం ఎడబాటుగా కదలని కాలం కలసి ఉన్నప్పుడు గడువులు తీస్తుంది ...వెళ్ళు శేఖర్...

(విరామం)

* * *

భర్త: ఉమా.

ఉమ: ఆ.

భర్త: ఏం బాగాలేదు.

ఉమ: ఏమిటి?

భర్త ఇలా విచ్చలవిడిగా మీ ఇద్దరూ పాట కచేరీలకూ, నాట్య ప్రదర్శనాలకూ...

ఉమ: ఊఁ...

భర్త: నీ ఈ ధోరణి మానాలి...

ఉమ: ఏం...

భర్త: లేకపోతే నీతోపాటు నాకూ అప్రతిష్ఠ వస్తుంది...నా పదవికి, నా గౌరవానికి తగ్గట్టు ప్రవర్తించు. అదే నే కోరుతున్నాను......ఉమా...... నా ఉమా...

ఉమ: అతన్ని...ప్రేమించాను నేను.

(క్షణం విరామం)

ఉమ: మనస్ఫూర్తిగా ప్రేమించాను...... అసత్యం, మోసం ఇవి నాకవసరం లేదు. నిజం చెప్తున్నాను.

భర్త ఉమా.

ఉమ అవును (కంపితస్వరంతో) ఈ అంధాకారంలో చంద్రోదయం అయింది...ఈ వెన్నెలే నాకు ప్రాణం...మీకు ఏంతోస్తే అదే చేయవచ్చు నా కతను ప్రాణం...

భర్త: ఇదివరకే చెప్పాను. సంకుచిత నీచ ప్రకృతి కాదు, నాది. కాని నా పేరు ప్రతిష్ఠలకు కళంకం గాకుండా, నేను తీసుకోవలసిన చర్యలను తీసుకోక తప్పదనిమాటుకు చెపుతున్నాను.

ఉమ: అయితే...

భర్త: ఇంక అతనుమటుకు ఇక్కడికి ఎప్పుడూ రాకూడదు. నేను స్వేచ్ఛ కద్దురాను. ఈ నియమం ఎప్పటికీ భంగం కాకూడదు.

(పాజ్)

* * *

శేఖర్: ఉమా.

ఉమ: చెప్పేశాను...శేఖర్...

శేఖర్: ఏమని?

ఉమ: (ఉద్వేగంగా) నేను నీదాన్నని...

శేఖర్: ఉమా...

ఉమ: నిజం.

శేఖర్: —మరి తర్వాత ఏమైంది.

ఉమ: (మౌనం)

శేఖర్: ఏమన్నాడు?

ఉమ: ఇంకెవరైనా అయితే నా ప్రాణం తీసేవారు. లేదా ఇంట్లోంచి గెంటేవారు. కాని ఇలాంటి మనిషి ఇంకెక్కడా ఉండడు. తనది అల్పప్రకృతి కాదట... అబ్బ... ఔదార్యంతో గర్వమెక్కిన ఆ గొంతు గుర్తుకు వస్తుంటే మళ్ళీ జుగుప్స కలుగుతోంది. తన పరువు ప్రతిష్ఠలకు భంగం రాకుండా మనం నడుచుకోవాలిట నా స్వేచ్ఛకు తను అడ్డు రాడుట...ఈ మనిషికి ప్రేమించటం, ద్వేషించటం తెలుసా? శేఖర్...

శేఖర్: ఉమా...

ఉమ: శేఖర్ కొందరాడవాళ్ళు తమ మగవాళ్ల దొడ్డతనాన్ని కూడా హర్షించటం కద్దు అని విన్నాను. కాని నా భర్త మంచితనాన్నే నేను ఏవగించుకుంటున్నాను.

శేఖర్: ఉమా...అయితే...ఈ నిష్ఫల జీవితమంతెందుకు?

(ఉద్వేగంతో) మనం స్వేచ్ఛగా...... ఏకంగా...

ఉమ: (సంకోచ ఉద్రేకాలతో) ఆ...దాన్ని గురించి తర్వాత మాట్లాడుదాం. నువ్వు రేపు రాత్రి రావాలి. ఫిడేలుకూడా తీసుకురాయేం.

శేఖర్: మరి ఇంక ఇంటికి నన్ను రానీయ వద్దన్నాడుగా...

ఉమ: ఆయన ఏదో ఆఫీసుపనిమీద పొరుగూరు వెళ్తారు. నువ్వు తప్పక రావాలి. ఈ చిమ్మ చీకటిలో మనమిద్దరం కనబడని జంటనక్షత్రాల్లా సాగిపోదాం. అమరయాత్ర చేద్దాం. వెనకటికి రాయి స్త్రీ అయిందట...కాని నిజానికి ఎంతమంది స్త్రీలు శిలలు కారూ...నీ అడుగుల చప్పుడుకు నేను నా అహోమయనిద్రలోంచి మేల్కొన్నాను. నీవు కనబడిన తొలిక్షణం ... చీకటి గుహలోంచి అమాంతం — ఒక్కమాటుగా — పిండారబోసిన వెన్నెలలోకి వచ్చినట్టుంది శేఖర్ ఇన్నేళ్లు కాపురం చేశాను... కాని నేనూ ఒక స్త్రీనని ఇప్పుడు తెలుసుకున్నాను. (అమ్మా — అమ్మా...)

శేఖర్: మధు వస్తున్నట్టున్నాడు ఉమా.

ఉమ: అవును.

శేఖర్: నేను కనబడగానే వాడి ముఖంలో కళా కాంతీ ఉండదు. భయంకర పిశాచాన్ని చూసినట్టు, దొంగను చూసినట్టు ... చూస్తాడు. పలకరించినా మాట్లాడడు. అచ్చుగా నీకళ్లే. కాని నీ కళ్లలో అనురాగం ఆ కళ్లలో కనుపించదు.

ఉమ: శేఖర్...

(అమ్మా, అమ్మా...)

శేఖర్: వస్తా ఉమా...ఒక్కసారి పిలు మళ్ళీ శేఖర్ అని...నీ పెదవులపై ఆ ధ్వనులు పడగానే, వల్లకిలా మృదు మధురగానం ప్రతిధ్వనిస్తున్నట్టుంటుంది నాకు...ఉమా ఒక్కసారి...

ఉమ: శేఖర్.

శేఖర్: మళ్ళీ చీకట్లోకి వెళ్తున్నా ...... (నిష్క్రమణ)

మధు: అమ్మా...

ఉమ: రా...బాబూ...రా.

మధు: ఆయనెవరే ... ఎప్పుడూ వస్తాడు... ఆయన్ని చూస్తే నా కెందుకో భయం వేస్తుంది...

ఉమ: మ...ధూ...

మధు: అవునమ్మా. నీకు వేయదూ భయం. ఎలా చూస్తాడో.

ఉమ: (గాద్గదికంగా) భయం.

మధు: మీ రిద్దరూ మొన్న నాటకానికి వెళ్ళినప్పుడు ఇంట్లో నే నుండలేకపోయాను. ఇప్పుడే వస్తానని నాన్న చెప్పాడు...కాని నా కెందుకో భయం...పట్టరాని భయం వేసింది. అమ్మా నన్నలా విడిచి వెళ్ళద్దు...వెళ్లనాయనా...

ఉమ: నా ప్రాణంవి మధూ...బట్టలు మార్చుకో ...రా...

మధు ఒక్క నిమిషంలో వచ్చేస్తా...రేపటి నుంచి ఆయన్ని రావద్దని చెప్పేశేయ్ అమ్మా. (నిష్క్రమణ)

* * *

ఉమ తనతో వచ్చేయమని శేఖర్ సంకల్పం. కాని, ఈ మధుని వదిలేసి...అది అసాధ్యం. ఈ పసివానికీ నాకూ ఉన్న రక్త, ప్రాణ సంబంధం శేఖర్ గ్రహించడు. గ్రహించలేడు. ఈ జీవికి తనొక కన్ను. రెండవ కన్ను మధు. ఇందులో ఏదిగా లేక పోయినా నేను బతకలేనే. తనంటే నాకు సర్వస్వం అని శేఖర్ కు తెలుసు. కాని నా...స్త్రీయొక్క ప్రకృతి అతనికి తెలియదు. నా భర్త నన్ను వెళ్లిపోనిస్తాడు. తన గౌరవానికి భంగం కలిగించనిపక్షంలో చిరునవ్వు నవ్వుతూ తన ఔదార్యాన్ని వెల్లివిరుస్తూ తన ఘనతను ప్రదర్శిస్తూ, నా కెంతో మనస్ఫూర్తిగా వీడ్కోలిస్తాడు. కాని మధును నాతో రానివ్వడు. పెరిగి పెద్దయి తనలాగా పేరు తెచ్చుకోవలసిన కొడుకును భ్రష్టురాలైన తల్లికి అప్పగించడు. మధు లేకుండా నే నుండలేను. తన్ను విడిచి వెళ్ళిన తల్లిని మధు అసహ్యించుకోడూ.

(పాజ్)

* * *

భర్త: భ్రష్టురాలు ఉమ. విడాకు లివ్వటానికి నే ఒప్పుకుంటే నరకానికి ద్వారాలు తెరచినట్టే. తన శ్రేయస్సుకోసమైనా నేను విడాకు లివ్వకూడదు. ఇసీ ఉమను శిఖరాగ్రంనుంచి పాతాళంలోకి విసిరినట్టే ... ఇవ్వగానే వానితో వెళ్లిపోతుంది. ఈ ప్రియుల కాపురాన్ని ఎవ్వరూ హర్షించరు. అందరికళ్లూ నిప్పులు కక్కుతాయ్. ఆ అవమానం ఉమకు మృత్యుసమానం. ఆ సంతానానికి ఆదరం ఉండదు. ఆ సంతానంమధ్య మధు సవతి బిడ్డలా ఉంటాడు. అదెప్పటికీ నేను సహించను. వాడిమీద నాకు ప్రేమ లేకపోయినప్పటికీ, వాడు నీచపరిసరాల్లో పెరగకుండా చూడటం నా బాధ్యత. అహ ఉమా...ఈ విషమసమయాల్లో విశ్వాస హీనులైన భార్యలను భర్తలు చంపటం కద్దు...కాని అది నే చేయతగిన పని కాదు. భార్యల ప్రియులను

చంపివేస్తూ ఉన్నారు. కాని అంత అవివేకమైన, స్వార్థమైన పని మరొకటి లేదు.

(విరామం)

* * *

శ్రీధర్: అక్కా.

ఉమ: ............

శ్రీధర్: నీ ఆరోగ్యం ఎలా ఉంది.

ఉమ: చిట్టడవిలో నున్నదానికి ఆరోగ్యం ఏమిటిరా?

శ్రీధర్: కాదక్కా. ఏదో దారి చూడాలి.

ఉమ: దారి.

శ్రీధర్: అక్కా నీకన్న ఇరవయ్యేళ్ళ పెద్దవాడిని పెళ్ళి చేసుకున్నావు—ప్రేమ అనేది ఎరుగకుండా...అది పొరబాటు.

ఉమ: పెద్ద పొరబాటు.

శ్రీధర్: తిర్వాతి...నీ భర్త కానివాడిని ప్రేమించావు. అదొక ఘోర దురదృష్టం...అదృష్టమే అది ...తెలిసి నీ భర్త మొదట్లో క్షమించాడు. ఉదారంగా ఉన్నాడు. కాని ఇప్పుడూ నువ్వు నీ భర్తతో ఉండగలవా? అతి వని కోరతాడా?

ఉమ: అదృష్ట దురదృష్టాలు నాకేమీ తెలియవు. ఒక మహా ప్రవాహం నన్ను ఈ తీరంనుంచి లాక్కుపోతోంది.

శ్రీధర్: అయితే ఉభయులకూ మంచిది విడాకులు.

ఉమ: అందు కాయన ఎప్పుడూ ఒప్పుకోరు. నన్నిలా ఇంట్లో నే అరికట్టి, పీడించటమే ఆయనకు తృప్తి...మధును విడిచి వెళ్ళలేనని ఆయనకు తెలుసు ...అందుకనే మధును నాతో పంపనంటారు... ఏమిటా ఔదార్యం...ఆ జీవరహితమైన హృదయం లేని ఔదార్యానికే నే నాయనను ఇంకా తీవ్రంగా ద్వేషిస్తున్నాను.

శ్రీధర్: అయినా అతనితో మాట్లాడి చూస్తా.

ఉమ: నీ భ్రమ...

(విరామం)

* * *

మధు: నాన్నా అమ్మ ఏది?

తండ్రి: .........

మధు: ఎప్పుడూ నన్ను విడిచి వెళ్ళనంటే.

తండ్రి: అమ్మ లేదు.

మధు: ఎక్కడికి వెళ్ళింది నాన్నా...దబ్బున రమ్మన్ని, ప్రాణుల్లా?

తండ్రి: అమ్మ లేదు...చచ్చిపోయింది.

మధు: ఆ.

తండ్రి: అవును...మధూ...

మధు: అమ్మ ఎప్పటికీ చచ్చిపోదు...అమ్మ అమ్మ నాకగపడుతుంది. అనూంతం వచ్చి నన్ను...

తండ్రి: ఇంక అమ్మ నీకగపడదు మధూ. అమ్మ మన ప్రపంచంలో లేదు. బడివేళవుతోంది. పాఠాలు చదువు. నే వెళ్తున్నా. (నిష్క్రమణ)

మధు: తోటలో ... ఆ పూలపొదచాటున కూర్చోటానికి నా వస్తుంది తప్పక. నే నింక ఇంట్లో ఉండను. తోటలో నే తిరుగుతూ ఉంటా...అమ్మ నన్ను చూడటానికి వస్తుంది...

(విరామం)

* * *

ఉమ: నెలనుంచి బైటపడి, స్వేచ్ఛగా ఉన్నా, ఇంకా అలా ఉన్నావేం శేఖర్?

శేఖర్: స్వేచ్ఛ! ఎక్కడకూ వెళ్ళటానికి వీల్లేదు ...ఎవరితోనూ మాట్లాడటానికి వీల్లేదు. సంప్రదాయమూ, శాసనమూ అనుమతించని మన సాహచర్యం.

ఉమ: సంఘంతో మనకేమిటి? హాయిగా ఏపల్లె సీమకో పోయి ఉందాం.

శేఖర్: అక్కడ ఉండేవాళ్ళుమాత్రం మనుష్యులు కారా?

ఉమ: ఇలా అని ఎంతకాలం భయంతో బేలతనమూ, పరదేశమూ తిరుగుతూ ఉంటాం. చూడు... ఏదో సమావేశమని, సభ అని వెళ్తూ ఉంటావు. నువ్వు లేని క్షణం నాకు యుగం, నా క్షోభ నీవు తెలుసుకోగలిగితే...

శేఖర్: ఉమా...ఏమిటి ఇలా మాట్లాడుతున్నావు?

ఉమ: అవును ... శేఖర్ ... మధుని... నా ప్రాణాన్ని కూడా వదిలేసి వచ్చాను. నీకోసం నీ ప్రేమకోసం...నిన్ను విడిచి ఉండలేని ఈ నా సంక్షోభం...నా ప్రేమ నీకు తెలియదు.

శేఖర్: ఎందుకు తెలియదు. ఉమా ఏదో ఉద్రేకంలో మాట్లాడుతున్నావు. వెళ్ళవలసినఅవసరం ఉండబట్టేగా అక్కడకూ, ఇక్కడకూ వెళ్ళటం. మా అమ్మకు మన ఈ సంబంధం ఇష్టంలేదు... అయినా ఆవిడను విడిచి వచ్చేశాను. నాకు నువ్వే సర్వం.

ఉమ: తెలుసు శేఖర్...నీ ప్రేమే నాకు సర్వస్వం.

శేఖర్: మరి వెళ్ళొస్తా. ఒక్కసారి నవ్వాలి మరి.

ఉమ: వెళ్లు శేఖర్, ఏవో పుస్తకాలు తెప్పించాను...అవి చదువుతూ కాలం గడుపుతా.

శేఖర్: వెళ్తున్నా...(నిష్క్రమణ)

ఉమ: నిజానికి స్త్రీ కాదు అబల. పురుషుడే దుర్బలుడు. అంతర్యంకన్న బాహ్యం వానికే ఎక్కువ ముఖ్యం. లోకఖ్యాతి లేదా లోకనింద ఇవి వారికి ముఖ్యం. సంఘం గౌరవించని ఈ జీవితం శేఖర్‌కు దుస్సహంగా ఉంది. నాకు తెలుసు. ఎంతో వ్యథ పడుతున్నాడు. ఈ వ్యథ నాకన్న ఇంకెవర్ని ఎక్కువ చిత్రవధ చేస్తోంది? కాటువేసి కోరలతో నా గుండెను చీల్చుతున్న ఈ విషసర్పాన్ని నేనెలా మరువగలను. నీకన్న దౌర్భాగ్యులెవరు ఉమా. కాని, నా హృదయాన్ని ఇంతక్షోభలోనూ ప్రజ్వలితం చేసే ఆ దారుణ దవానలం శేఖర్ గుండెలోరగలదు. నా కతని ముఖం చాలు...అతని మాటలు చాలు...అతని స్పర్శకు శరీరమంతా వీణెలా మోగుతుంది. అతని చూపుల్లో వేయి చంద్రులు చల్లని వెన్నెల కురిపిస్తారు. కాని అతను లోకం ముఖాన్ని చూస్తాడు. లోకపుమాట వింటాడు. విడాకు లివ్వమని భర్తకు వ్రాయమంటాడు. ఆ అవరోధం తీరాక హాయిగా పెళ్ళి చేసుకుందామంటాడు. అప్పటికి కాని అతనికి స్థాయి చిక్కదు. గౌరవంగా ఉండదు. లేకపోతే తన పిల్లలకు అధికారం, ఆదరా లుండవంటాడు. ఇద్దరి మధ్యనున్న ప్రేమ రూపొంది, జీవించటానికి, ఈ సంఘద్వారంవద్ద పడిగాపులు కాయాలి. హృదయాల పనిబిడ్డయిన ఈ ప్రేమను ఆచారంతో కప్పితే గాని ఆశీర్వదించరు. ఈ లోకంలో నాకు కావలసిందల్లా ఇద్దరే...మధు...శేఖర్...మధూ...మధూ... నేను జీవించి ఉన్నానని తెలుసా. నీ కిచ్చినమాటను భంగం చేశానని ద్వేషిస్తున్నావా? ఒకసారి వెళ్ళి చూసిరాందే జీవించలేను. రేపు వాడు పుట్టిన రోజు...నన్నా ఇంట్లో అడుగు పెట్టనివ్వరని తెలుసు... కాని అయినా...(రైలు చప్పుడు)

* * *

ఉమ: మధూ.

మధు: అమ్మా, అమ్మా.

ఉమ: నేనే నాయనా అమ్మను...నాన్న...

మధు: పైన ఉన్నారు. నేను నమ్మలేదు... నువ్వు చచ్చిపోయావంటే ... ఇవ్వాళే నా పుట్టిన రోజు తప్పక వస్తావని అనుకుంటున్నా. తోటంతా తిరిగి వచ్చావిప్పుడే.

ఉమ: నమ్మలేదు బాబూ. ఎందుకు నమ్మాలి. నేను నీలో లేనా. నేను చనిపోయినంటే నా మూల్గులు నీ శరీరమంతటా మారు మ్రోగవూ... అవును బాబూ...నీ పుట్టిన రోజు...నేనెలా మరచిపోగలను.

మధు: అమ్మా బాగా చిక్కిపోయావు... నువ్వు...(కోపంగా) ఇక కనబడనే కనబడవని చెప్పాడు నాన్న.

ఉమ: ఆయనమీద నువ్వు భక్తిశ్రద్ధలు చూపాలి. నాకంటె దయగలవాడు మంచివాడు. నే నాయన్ని అన్యాయం చేశాను. నువ్వు పెద్దవాడివయ్యాక తప్పొప్పులు తెలుసుకోగలవు.

కాదమ్మా...నీకంటె మంచివాళ్ళెవరు అమ్మా నాకు?

ఉమ: మధూ.

మధు: అవునమ్మా.

ఉమ: వెళ్తా ... బాబూ ... నాన్న వస్తున్నట్టున్నారు.

మధు: తిన్నగా ఇక్కడకు రాడు. కాస్సేపుండు అమ్మా.

ఉమ: కాదు బాబూ. నే నిక ఇక్కడ ఉండకూడదు.

మధు: వెళ్లిపోతావా?

ఉమ: అవును...బాబూ...ఆ మాట కెప్పుడో భంగం చేశాను. నన్ను మరచిపోవుకదూ...

మధు: అప్పుడే వెళ్లిపోతావా? నే నెందుకో మాట్లాడలేకపోతున్నా అమ్మా...అమ్మా మరి.

ఉమ: వెళ్లిపోతున్నా...మధూ.

మధు: మళ్ళీ ఎప్పుడు వస్తావు అమ్మా... మళ్ళీ.

(విరామం)

* * *

ఉమ: ఎంత పాపిష్ఠిదానివే ఉమా. తీసుకు వెళ్లిన బొమ్మలు, పుస్తకాలు, చాక్లెట్లు మళ్ళీ అలాగే వెనక్కి తెచ్చావు. ఉద్రేకంలో, భయంలో మరచిపోయావు. మధూ ... పుట్టినరోజున అమ్మ నీకేమి ఇవ్వగలిగింది. తన మలినముఖాన్ని చూపించింది. తండ్రి నాకంటె మంచివాడని చెప్పాను... కాని...ఆయనంటె నాకు ద్వేషం మరింత హెచ్చుతోంది. నా కొడుకుద్వారా నన్ను హింసిస్తున్నాడు. మధే నాదగ్గిర ఉంటే.

(విరామం)

* * *

సుశీల: వదినా...

ఉమ: సుశీలా! ఇది భ్రమా...నిజమా...

సుశీల: ఇలా అయిపోయావేమిటి ఉమా!

ఉమ: అవును సుశీలా. అందరూ వెలివేసిన ఇంటికి నువ్వు వచ్చావు...ఈ దోషురాలిని...

సుశీల: అలా అనకు ఉమా. ఈ సంక్షోభ కంతటికీ నేను కారణం. నా కాపురాన్ని నిలబెట్టటానికి వచ్చి...నువ్వు...

ఉమ: అందుకై నే నెప్పుడూ చింతించను. నా హృదయంయొక్క ఆవేదనను నువ్వైనా గ్రహించు...సుశీలా...నన్ను శిక్షించకు...దౌర్భాగ్యురాలిని...మధుని చూసి వచ్చా ... గాయాలన్నీ ఒక్కసారి సెలవేసినట్టుంది.

సుశీల: ఉమా. ఘూసి చాలా ఏళ్లయింది. చూసి పోదామని వచ్చా...నీపై నాకున్న గౌరవం ఎప్పటికీ పోదు. నీ స్థితిలో ఏ స్త్రీ ఉన్నా ఇలాగే చేస్తుందనుకుంటాను.

(విరామం)

* * *

శేఖర్: ఉమా.

ఉమ: శేఖర్, మధుని చూసి వచ్చాను. ఇట్టే పెరిగాడు. నేను చచ్చిపోయావని చెప్పారుట.

శేఖర్: ఉమా...మా అమ్మ ఉత్తరం వ్రాసింది. తొందరగా వెళ్లాలి. ఆమె ఆస్తిపాస్తులకు సంబంధించిన విషయా లేవో చూడాలిట...అవిడ మేనకోడలుకూడా వచ్చి ఉందట. వాళ్ళకు వీళ్ళకు ఏవో లావాదేవీలు...

ఉమ: ఎందుకీ గాధంతా.

శేఖర్: ఏమిటి ఉమా?

ఉమ: ఇంత వ్యాఖ్యానం ఎందుకు?

శేఖర్: అదేమిటి ఉమా.

ఉమ: నా దగ్గర ఉండలేనని, ఇంకెక్కడో ఎవరిదగ్గరో ఉండటం నీకు తృప్తిగా ఉంటుందని, ఎందుకు చెప్పవు! నామీద ప్రేమలేదని చెప్పేయకూడదూ?

శేఖర్: ఉమా నీ మనస్సు మనస్సులోలేదు. నా ప్రేమ విషయం ఏముంది దీంట్లో.

ఉమ: నన్ను విడిచి ఒక్క క్షణమైనా ఎలా వెళ్ళిపోగలవు శేఖర్. ఓ....నేను నిన్ను ఎలా ప్రేమిస్తున్నానో, నువ్వుకూడా నన్నలా ప్రేమిస్తే! నా హృదయఘోష నీ కెలా తెలుస్తుంది? నిన్ను విడిచి ఒక్క క్షణం ఉండలేనని నీకు తెలుసు.

శేఖర్: ఉమా నీకు మతిపోతూంది ... ఎలా చెప్పను, నీ విలా మాట్లాడుతుంటే.

ఉమ: వెళ్ళు శేఖర్. వెళ్లు...నాకంటె నీకు ఆస్తిపాస్తు లెక్కువ. అందులో అక్కడ ఎవరో వచ్చిఉన్నారు కూడానయ్యె.

శేఖర్: ఇంతేనా నువ్వు నన్ను అర్థం చేసుకుంది...ఉమా...అనవసరంగా నీ మనస్సును క్షోభ పెట్టుకోకు. అప్పటికీ, ఇప్పటికీ, ఎప్పటికీ నువ్వే నా సర్వస్వం. వడవడగా నే వచ్చి నీ పాదాలదగ్గర వాలుతాను. నీ ముఖంలో ఈ మబ్బు ఇంక ఉండకూడదు. వెళ్లివస్తా.

ఉమ: శేఖర్ కలలు కల్ల అంటారు. అదేమో కాని ఏనాటినుంచో ఆ కల నన్ను ఇంకా వెంటాడుతూనే ఉంది. పగపట్టిన తాచులా...ఈ తెల్లవారుజామున లేచాక కూడా ఆ భయంతో వణుకుతూనే ఉన్నాను. రైలుపట్టాలపై నేను...

శేఖర్: ఛా ఏమిటి ఉమా పిచ్చి ఊహలు. కలకు భయపడేదేమిటి? నే మళ్ళీ త్వరలో నే వచ్చేస్తా. కలగురించి తలచకు. (నిష్క్రమణ)

* * *

ఉమ: వెళ్లు శేఖర్. వెళ్లు...ఈ మతిలేనితనం, ఉద్రేకం అంతా కొంచెం నిద్రమందు తీసుకుంటే తగ్గిపోతుంది. ఎప్పటికప్పుడు నే నిలా క్షోభపడటం నీను ఇలా మాట్లాడటం ఇది పరిపాటైపోయింది. ఈ నా సంక్షోభ, తన సాంత్వనం...వీటికి అంతుండాలి...

(పాజ్)

* * *

ఉమ: మరునాటికే వస్తానన్నాడు శేఖర్... మాయమాటలు...ఒరే రాముడూ! పొద్దున ఇచ్చిన టెలిగ్రాంకు జవాబు వచ్చిందా?

రాముడు: వచ్చిందమ్మగారూ. ఇదిగో బల్లమీద పెట్టాను.

ఉమ: ఊఁ. ఏది? నువ్వు వెళ్లు. రేపు పదిగంటలకు రాగలను—శేఖర్. రేపు పదిగంటలకు! కాలం విలువ తెలుసుకోని నేరానికి శిక్ష తప్పదు. రేపు పదిగంటలు...ఎంత తేలిగ్గా ఉంది. ఇంతలో ఎన్ని భూకంపాలు...ఎన్ని అగ్నిపర్వతాలు...ఎన్ని తుపానులు...కాలం ప్రసన్నంతో అనుగ్రహించిన వ్యవధిని సరిగా అనుభవించలేక, తర్వాత కళ్లు తెరిచి కాలం నిర్దయగా పరుగుల్తీస్తోందని విలపిస్తారు. అందుబాటులో ఉన్నంతవరకూ కాలంవిలువ, అంతేకాదు దేని విలువా తెలియదు. కాలం మహత్తు తర్వాత తెలుసుకుంటాడు శేఖర్. రాముడూ... రాముడూ. మళ్ళీ నువ్వు వెళ్లిరా...ఊఁ పో, నేనే శేఖర్ని కలుసుకోనితీరాలి. ఇంక ఈ జీవితం

దుర్భరం. అతనికి నామీద ప్రేమ క్షీణిస్తోంది. ఇద్దరం యాంత్రమైపోతున్నాం. నేనే వెళ్తాను.

* * *

(రైలు ఆగిన చప్పుడు)

నౌకరు: అమ్మగారూ.

ఉమ: ఆయన ఏం చెప్పారురా.

నౌకరు: ఇదిగోనండి ఏదో వ్రాసి యిచ్చారు.

ఉమ: ఊ... "నేను రేపు పదిగంటలలోపున రాలేను. శేఖరు."...ఇదీ వ్రాసింది. మళ్ళీ అదేకబురు. నా క్షోభ అతని మనసుకు పట్టదు.

(రైలు బయలుదేరటానికి కొట్టిన గంట చప్పుడు)

ఉమ: స్వేచ్ఛ—ఈ అమృతంకోసం భర్త చెఱనుండి బైట పడ్డాను. ప్రవాసాన్ని, అవమానాన్ని సహితం వహించాను. కాని విధి దాహం ఈ అశ్రుధారలతో తీరేట్టులేదు. బహుశా స్వేచ్ఛ దొరికేది రక్తధారల్లో నేమో—

(సన్నని కంఠం బాధతో అరుపు—రైలు హఠాత్తుగా ఆగిన చప్పుడు—తర్వాత క్షణం జనం కోలాహలం—తర్వాత రైలు వెళ్లిపోయిన శబ్దం—తర్వాత పూర్తి నిశ్శబ్దం—)



# కావ్యగుణములు



శ్రీ పోతుకూచి సుబ్రహ్మణ్యశాస్త్రి

కుశలవులు పాడిన రామాయణ గాథ "పాఠ్యే గేయేచ మధురం" అని, "అహో గీతస్య మాధుర్యం శ్లోకానాంచ విశేషతః" అని కొనియాడ బడినది. మాధుర్యము కావ్యమున గన్పించవలసిన ప్రధాన గుణము. రామాయణమును వినిన మునులు "చిర నిర్వృత్తమ ప్యేతత్ ప్రత్యక్షమివ దర్శితం" అని మహాకావ్యమున భావనావ్యాపారవశమున భాసించు ప్రత్యక్షాయమాణత్వమును ప్రస్తుతించిరి. ఇది ప్రబంధ గుణము.

"ఉదారవృత్తార్థ పదైః మనోరమైః
తతస్స రామస్య చకార కీర్తిమాన్
సమాక్షరైః శ్లోకశతై ర్యశస్వినో
యశస్కరం కావ్య ముదార ధీ ర్మునిః"

అని బాలకాండలో ఉదారవృత్తము, ఉదారపదము, ఉదారార్థము, సమాక్షరములు ప్రస్తుతించబడినవి. ఔదార్యగుణ మిచట చెప్పబడినది. తర్వాతిశ్లోకములో సమాన సంధియోగము, సమమధురోపనతార్థ వాక్యబద్ధము నని పల్కుచు మాధుర్యమును, సమతను వాల్మీకి పలికినాడు. విచిత్రపదములతో, విచిత్రార్థ పదములతో రామాయణము రచించబడినదట. విస్తృతముగా గాని, సందిగ్ధముగా గాని హనుమంతుడు మాట్లాడలేదట. సంస్కార క్రమసంపన్నమైన చిత్ర వాక్కుతో వ్యవహరించెనట.

విచిత్రపదములతో, విచిత్రార్థపదాఖ్యానముల తోనున్న మహాభారతము శుభశబ్దములచే నలంకృత మైనదని, శ్లక్ష్ణమని, అర్థవంతమని ఆదిపర్వమున గలదు. శ్రావ్యత్వము, శ్రుతిసుఖత్వము, మాధుర్యము కొనియాడబడినవి. హేతుమద్వాక్యములు, ఉప పన్నార్థము, మధురాభిధానము మొదలగునవి పొగడబడి నవి. లేఖసంపదను వివరించుసందర్భమున అర్థక్రమము, సంబంధము, పరిపూర్ణత, మాధుర్యము, ఔదార్యము, స్పష్టత్వమునను ఆరుగుణములను కౌటిల్యుడు లెక్కించెను. (2-10-28) గాంభీర్యము, శ్లక్ష్ణము, మాధుర్యము, ఓజస్సు, హేతుమత్ మొదలైనవి అశ్వఘోషునిచే ప్రస్తావించబడిన గుణములు. సౌష్ఠవ, సుచిత్వ, సామర్థ్య, సాకాంక్ష, అర్థవ్యుత్పత్తి, గాంభీర్య, ప్రసాద, వినిశ్చితార్థాది గుణప్రస్తావము భారవిలో కన్పించుచున్నది. భట్టిమాత్రము ప్రసాద, మాధుర్యములనే గ్రహించెను. మాఘుడోజః ప్రసాదములనే స్వీకరించెను. ప్రౌఢత్వము, ఉదారత, అర్థ గౌరవము భవభూతిచే చెప్పబడినవి. ఇట్లు మహా కవుల కావ్యావలోకనమున ననేక కావ్యగుణములు తేలగలవు.

భరతుడు పదిగుణములను చెప్పినాడు. ఉదార మధురశబ్దములను, మృదులలితపదార్థములను ప్రయోగించుచు ఉదార, మధుర, లలిత, మృదుగుణములున్న నే అభినయము సమగ్రమగుననినాడు. మార్దవము, మాధుర్యము ఇచట గల ప్రధాన గుణములు. గూఢశబ్దార్థ రహితమైన కావ్యము సుఖార్థప్రతీతికి యోగ్యమై, సుకుమారాన్వితమై అభినేయ యోగ్యము కాగలదు. కావున నేలోక వేదసంసిద్ధములగు గంభీరార్థశబ్దములనే నియమించుమ ప్రసాదగుణమును భరతుడు ప్రస్తుతించెను.

దోషవిపర్యయములే గుణములనికూడ భరతు డనినాడు. కాని భరతుడొసగిన దశగుణములు దోష విపర్యయములు కావు. దశగుణములలో కొన్ని ముఖ్య ముగా నాట్యమునకు చెందినవని చెప్పబడినవి. కొన్ని గుణము లతివిస్తృతములై బహుగుణసంవలితములుగా కన్పించుచున్నవి. కొన్ని కేవల మర్థగుణములుగాను, కొన్ని కేవలము శబ్దగుణములుగాను, మరికొన్ని ఉభయ గుణములుగాను గలవు. ఉదారగుణము శృంగారాద్భుత రసములకు చెందినదని చెప్పుట విశేషము. ఇది రస గుణము లేక ప్రబంధగుణము కావలెను.

గుణవివేచనలో అభినవగుప్తుడు నూత్నమార్గము నవలంబించినాడు. ఒకవైపు వామనుని భావములు, మరియొకవైపు ఆనందవర్ధనుని వాదము గలవు. ఈ రెంటిని మేళవింపజూచి భరతుని వ్యాఖ్యానించి నట్లు కన్పించును. మొదట గుణములను రెండు తెర గులుగా విభజించి, ఓజః, ప్రసాద, మాధుర్యములు రసగుణములని, శ్లేషాది దశగుణములు శబ్దార్థగుణములని చెప్పినాడు. గుణాలంకారములు కావ్యశరీరమునకు శోభను తెచ్చునవని చెప్పి చిత్రకర్మ ప్రతిమములని నాడు. అలంకారములకన్న ఎక్కుడుగా రసముతో సన్నిహిత సంబంధము గుణములకు గలదని లక్షణ వ్యాఖ్యావసరమున పలికినాడు. గుణములు రసాభి

వ్యక్తిహేతువులని, అలంకారములు అస్థిరధర్మములని ఇతని భావము. గుణశూన్యమైన కావ్యము లేదని చెప్పి,

"అతోహేయత్వ ప్రదర్శనార్థమేవహి ప్రసాదాదీనాం గుణవాచోయుక్త్యా వ్యవహారః, తద్వినా కావ్యరూపత్వాభావాత్. ఉపమాద్యంతరేణతు భవత్యేవ కావ్యమితి ప్రకటీకర్తు ముపమాదీనా మలంకారత్వేన వ్యవహారః"

అనినాడు. దండి యనినట్లు కావ్యశోభావహములగు ధర్మములన్నియు నలంకారములే యగునని భావము. కాని గుణాలంకారములకు వామనానందవర్ధను లొసగిన భేదములనుగూడ అభినవు డంగీకరించి గుణము లలంకారములకన్న ప్రధానము లనినాడు.

గుణములను వ్యాఖ్యానించుచు అభినవుడు పూర్తిగా వామనుని అనుసరించినాడు. శ్రుతిసుఖత్వమగు మాధుర్యము; దీప్తరసత్వమగు ఔదార్యము దోషవిపర్యయములవలన వచ్చుగుణములు. భరతుడిచ్చిన ప్రతిగుణమును వామనుని లక్షణోదాహరణములతో పూర్తిగా సమన్వయపరుప యత్నించిన అభినవుడు తన సిద్ధాంతవ్యాఘాతమును తానె గమనించలేకపోయెను. దీప్తరసత్వము కాంతియొక్క లక్షణమగునేకాని ఔదార్యలక్షణము కాజాలదు. గుణములకు పాఠాంతరములున్నచో నొకటి శబ్దగుణమని, మరియొకటి అర్థగుణమని వివరించినాడు. పాఠాంతరములు లేనిచోట్ల ఒకశ్లోకములో శబ్దార్థగుణములను సాధింప యత్నించెను. ఈ ప్రకరణమున గల అభినవునివ్యాఖ్య వామనుని గుణప్రకరణముపై నొసగబడిన వ్యాఖ్యగా మన మెంచవలెను.

భరతుడిచ్చిన పదిగుణములను వివరించి, ఇవి వైదర్భిరీతికి ప్రాణములని దండి యనినాడు. అనుప్రాసజనితమైన శబ్దమాధుర్యము వైదర్భిలోనే కన్పించినను, అగ్రామ్యలక్షితమగు మాధుర్యము వైదర్భిలోనేగాక గౌడిలోగూడ కలదు. నేయార్థత్వదోషరాహిత్యమగు అర్థవ్యక్తికూడ ఉభయత్ర గలదు. ఇట్లే ఉదారత, సమతగూడ రెంటియందు గలవు. వైదర్భిలో చెప్పబడిన ఓజస్సు ముఖ్యముగా గౌడీరీతిలో కన్పించునది. బంధగుణమైన శ్లేషద్వారా శైథిల్యదోషము తొలగును గనుక నిదిగూడ రెండు రీతులయందు కన్పించవలెను.

శ్లేష, ప్రసాద, సమతా, అర్థవ్యక్తి, ఓజస్, కాంతి, సమాధి యను వాటికి రూపాంతరములు కన్పించవు. మాధుర్య, సౌకుమార్య, ఔదార్యములకు దండి విశేషరూపములను చెప్పినాడు. శైథిల్యమునకు శ్లేష, వాతియాధమునేక వ్యుత్పన్నపరములతో ప్రసాదము, వైషమ్యమునకు సమతా, ఉల్బణత్వమునకు మాధుర్యము, దీప్తశబ్దత్వమునకు సుకుమారత, నేయార్థత్వమునకు అర్థవ్యక్తి, [illegible] ఓజస్సునకు హృద్యమగు ఓజస్సు, అత్యుక్తికి కాంతి యనునవి విపర్యయములుగా కావ్యాదర్శమం దీయబడినవి. కాగా శ్లేష, ప్రసాదము, సమత, ఓజస్సులు శబ్దగుణములు. కాంతి, సమాధి అనునవి అర్థగుణములు. మాధుర్యము, సుకుమారత, అర్థవ్యక్తి, ఉదాత్త్వము లుభయగుణములు. మాధుర్యము, అర్థవ్యక్తి, ఉదారత, సమాధి యనునవి ఉభయరీతులయందు నుండవలెను. ఈ భావములు తర్వాతి ఆలంకారికుల చేతులలో విస్తరింపబడినవి.

భామహుడు ఓజః, ప్రసాద, మాధుర్యముల నే ప్రస్తుతించినాడు. శ్రవ్యము, నాతిసమస్తార్థమునగు కావ్యము మధురము. ఆవిద్వదంగనా బాలప్రతీతార్థమైనకావ్యమున ప్రసాదగుణము కలదు. మాధుర్యప్రసాదముల కవినాభావసంబంధ మున్నది. కొందరు సమాసభూయిష్ఠమైన ఓజస్సునుగూడ గ్రహించిరని భామహు డనినాడు. వైదర్భి, గౌడీరీతులు రెండును చక్కగా పోషింపబడ వీలున్న దని చెప్పుచు,

"అపుష్టార్థ మవక్రోక్తి
ప్రసన్న మృజుకోమలమ్
భిన్నం గేయ మివేదంతు
కేవలం శ్రుతిపేశలమ్
అలంకార వదగ్రామ్య
మర్థ్యం న్యాయ్యమనాకులమ్
గౌడీయ మపి సాధీయః
వైదర్భ మపి నాన్యథా"

అనినాడు. ఇచట ప్రసాదము, ఋజుత, కోమలత్వము, శ్రుతిపేశలత్వ మనునవి వైదర్భిగుణములుగాను; అనాకులత్వము, అగ్రామ్యత్వమునునవి గౌడీగుణములుగాను చెప్పబడినవి. వీటితో ననుస్యూతముగా వక్రోక్తి లేనిచో కావ్యత్వము సిద్ధించదు. యమక సందర్భమున ప్రతీతశబ్దము, ఓజస్విత, సుశ్లిష్టసంధిత్వము, ప్రసాదము, స్వభిధానము అను గుణములను భామహుడు పేర్కొనినాడు. ప్రబంధగుణముగా భావికము మూడవ అధ్యాయమున వివరించినాడు. ఈ భావికమే రసమున నతిముఖ్యమగు భావనావ్యాపారము.

గుణములను శబ్దార్థపరములుగా విభజించిన ప్రథమాలంకారికుడు వామనుడు. దండి, భామహు లిచ్చిన దశగుణములను బంధగుణములు. బంధమనగా పదరచన. విశిష్టమగు పదరచనయే రీతి. ఈ వైశిష్ట్యము గుణాత్మకము. కవిత్వమునుండి, చిత్రలేఖనము

నుండి భావములను గ్రహించి గుణములను నిర్వచించుటచే,

"సందర్భేషు దశరూపకం శ్రేయః.
తద్ధిచిత్రం, చిత్రపటవద్విశేష సాకల్యాత్",
"ఔజ్జ్వల్యం కాంతిరిత్యాహుః
గుణం గుణ విశారదాః
పురాణ చిత్ర స్థానీయం
తేన వంధ్యం కవే ర్వచః",
"యథా విచ్ఛిద్యతే రేఖా
చతురం చిత్ర పండితైః
తథైవ వాగపి ప్రాజ్ఞైః
సమస్త గుణగుంఫితా",

ఇత్యాది పంక్తులు వామనుని గ్రంథమున కన్పించుచున్నవి ప్రతిగుణమున కావ్యత్వము భాసించుటచే,

"నాసంతః, సంవేద్యత్వాత్.
న భ్రాంతాః, నిష్కంపత్వాత్.
న పాఠధర్మాః, సర్వత్ర అదృష్టేః"

అనినాడు. కాగా ఉత్తమకావ్యమున పదిశబ్దగుణములు, పది అర్థగుణములు ఉండి తీరవలెను. ఈ భావమున కనుగుణముగా గుణములు నిర్వచించబడినవి. వైదర్భీరీతిలో మాధుర్య, సౌకుమార్యము లతిప్రధానములని; ఓజః, కాంతులు గౌడీరీతిలో నతిముఖ్యములని చెప్పినాడు. మిగిలిన ఆరుగుణములు అన్నిరీతులలోను కన్పించు సామాన్య గుణములు.

గుణములు శోభాహేతువులని, అలంకారములు శోభాతిశయహేతువులని వామనుని సిద్ధాంతము. కాని కావ్యశోభాకరములగు ధర్మములన్నియు నలంకారములేయని దండి ప్రపంచించినాడు. రుద్రటుడు సన్నివేశచారుత్వమునకు చెందిన చారుపదమును ప్రధానముగా నెంచినట్లున్నాడు. (2.8-10) రీతులను శబ్దాశ్రయములగు గుణములని వ్యాఖ్యానించినవాడు నమిసాధువు. దీనితోబాటు రసములుగూడ సౌందర్యాదులవలె కావ్యముయొక్క సహజగుణములనినాడు. రీతులు, శబ్దాలంకారములు, అర్థాలంకారములు నమిసాధువు ప్రకారము కృత్రిమగుణములు కావలెను.

గుణాలంకారములకు పరస్పరభేదము లేదని, వీటికి కావ్యముతో సమవాయసంబంధము కలదని, సంఘటనాధర్మములుగా కన్పించునవి గుణములని, శబ్దార్థధర్మములుగా కన్పించునవి అలంకారములని ఉద్భటుడు ప్రపంచించినట్లు తెలియవచ్చుచున్నది. ఈ సిద్ధాంతమును త్రోసిపేయుటకు బయలుదేరినవాడు వామనుడు. వామను డవలంబించిన గుణాలంకార విభేదమును తర్వాతి సమీక్షకు లనేకులు గ్రహించినారు. వామనుడు ప్రతీహారేందు రాజు గుణములను కావ్యధర్మములుగాను, కావ్యశోభాహేతువులుగాను వివరించిరి. భోజు డీ వాదము నంగీకరించి కావ్యమునకు, గుణములకు, నిత్యసంబంధము కలదని, కావ్యాలంకారముల కనిత్య సంబంధమున్నదని పలికినాడు. బాహ్యగుణములు, ఆభ్యంతర గుణములు, వైశేషికగుణములు నని మూడు తెరగుల గుణములు కలవని భోజుని వాదము. పైగా ప్రబంధగుణములనుగూడ వివరించి యున్నాడు.

"తత్రమహాకావ్యాదౌ యథా సంభవ మసంక్షిప్త గ్రంథత్వం, అవిషమబంధత్వం, శ్రవ్యవృత్తత్వం, అనతి విస్తీర్ణ సర్గాదిత్వం, శ్లిష్టసంధిత్వం చేతి శబ్ద గుణాః. చతుర్వర్గ ఫలాయత్తత్వం, చతురోదాత్తనాయకత్వం, రసభావనిరంతరత్వం, విధినిషేధవ్యుత్పాదకత్వం, సుసూత్ర సంవిధానకత్వమిత్యర్థగుణాః. రసానురూపసందర్భత్వం, పాత్రానురూప భాషత్వం, అర్థానురూప ఛందస్త్వం, సమస్త లోక రంజకత్వం, సదలంకార వాక్యత్వ మిత్యుభయగుణాః"

అని శృంగారప్రకాశలో ప్రబంధగుణములను వివరించినాడు. ఈ గుణముల ననుసరించి చక్కని సమీక్షలను రచింపవచ్చు ననుటలో నతిశయోక్తి లేదు.

గుణవివేచనలో కన్పించు ఈ కల్లోలమునుండి శ్రద్ధతో, వివేకముతో దాటిపోయినవాడు ఆనందవర్ధనుడు. కావ్యమున కాత్మగా రసమునుగాని, ధ్వనినిగాని, రసధ్వనినిగాని గ్రహించగా మిగిలినవన్నియు నీయాత్మకంగములు కాగలవు. ఈ యంగములలో నేవి బహిరంగములు, ఏవి అంతరంగములు? అను ప్రశ్న ఆపై బయలుదేరగలదు.

"తమర్థ మవలంబంతే
యేఽంగినం తే గుణాః స్మృతాః
అంగాశ్రితా స్త్వలంకారా
మంతవ్యాః కటకాదివత్."

అని ఆనందవర్ధను డనినాడు. రసాది లక్షణముగు అంగిని అవలంబించి శౌర్యాదికమువలె నభివ్యక్తమగునవి గుణములు. వాచ్యవాచక లక్షణములగు అంగముల నాశ్రయించుకొని కటకాదులవలె నుండునవి అలంకారములు. గుణి, అలంకార్యమువలె రసము ననుసరించియే గుణాలంకార వ్యవహారము బయలుదేరునని లోచనకారుడుగూడ ననుటచే మాధుర్యాదులు వస్తుతః శృంగారాది రసధర్మములగును. తదాధారభూతములగు శబ్దముల కీ మాధుర్యాదులు ఉపచారిక

ముగా చెప్పబడుచున్న దని శ్రుతీమోద్యోతమున లోచనకారు డనినాడు. అనుప్రాసాదులవలె గుణములను శబ్దాశ్రయములుగా తెంచరాదు. గుణము లర్థనిష్ఠములు, అర్థము రసపరము. ఔపచారికముగా నే గుణములను శబ్దధర్మములుగాను, సంఘటనాధర్మములుగాను చెప్పనగును. కావ్యముయొక్క ఆత్మ నభివ్యక్తపరచు సంఘటన లిన్నిటిని గుణముల నావిష్కరించునది. గుణములు కేవలము సంఘటనాశ్రయములు కావు గనుక నే శృంగార కరుణలలో మాధుర్యము, రౌద్రాద్భుతములలో ఓజస్సు కలవని యనగలుగుచున్నాము. సంఘటనల కీ రసనిష్ఠత్వము నియతముగా లేదు గనుక నే దీర్ఘసమాసములు రౌద్రమున నేగాక, శృంగారమునగూడ కన్పించుచున్నవి. అసమాస సంఘటన శృంగారమున నేగాక, రౌద్రమున సహితము గలదు. కావున గుణములను సంఘటనలుగాగాని, సంఘటనాశ్రయములుగాగాని గ్రహించితిమేని, గుణము లనియతవిషయములు కాగలవు. గుణముల కాశ్రయము రసము.

సంఘటనయేగాక, వర్ణములు సహితము రసము నభివ్యక్తము చేయగలవు. సంఘటనలవలె అనియత విషయములు కానిశబ్దములు గుణముల కౌపచారికముగా నాశ్రయము లగుచున్నవి. ఐనచో దీర్ఘసమాసత్వమును వర్ణసంఘటన లేనిచో ఓజస్సు కన్పించ గలదా? అను ఆశంక రాగలదు. కాని "యోయః శస్త్రంబిభర్తి" అను వేణీసంహార శ్లోకములో సమాసములు లేకపోయినను ఓజస్సు కన్పించునని మరువరాదు. కాగా గుణములు వేరు, సంఘటన వేరు; గుణములు సంఘటనాశ్రితములు కావు అను సిద్ధాంతము రాగలదు.

"యోయః శస్త్రంబిభర్తి" అను శ్లోకములో వృత్త్యనుప్రాసము కలదని, దీర్ఘసమాస సంఘటన లేకపోయినను భట్టనారాయణుడు స్వశక్తిద్వారా ఇచట ఓజస్సు ఉన్నట్లు మనకు భ్రమజ్ఞానమును తెచ్చినాడని యెంచుట పొరబాటు. ఈ శ్లోకమున వృత్త్యనుప్రాసములేదు. ఓజస్సుకూడ లేదని ఒకవేళ నంగీకరించవలసివచ్చినను, ఇచట ప్రసాదగుణము, ఔచిత్యము గలవు. అభిధేయార్థము గల ఈ శ్లోకమున విషయౌచిత్యము గలదు. కాగా రసమే గుణములకు నియామకమగుచున్నది.

వక్తృ, వాచ్య, విషయ నియమము గల సంఘటనయే రసాభివ్యంజక మగును గనుక ప్రకృత్యౌచిత్యము మొదలగు రసౌచిత్యరూపములే సంఘటనలకు, గుణములకు నియామకములు కాగలవు. గుణములే సంఘటనలను మొదటివాదమున నీ రెంటికి ఒకేవిధమైన నియమములు రాగలవు. గుణాశ్రయమే సంఘటన యను రెండవవాదమున గుణనియామకములే సంఘటనానియామకములు కాగలవు. సంఘటనాశ్రయమే గుణమను మూడవవాదమున ఆనందవర్ధను డొసగిన నియమము లభియించి సరిపోగలవు.

"తస్మాద్గుణాద్వ్యతిరిక్తత్వే గుణవ్యతిరిక్తత్వే వా సంఘటనాయా యథోక్తా దౌచిత్యాద్విషయనియమో2స్తి ఇతి తస్యా అపి రసవ్యంజకత్వమ్. తస్యాశ్చ రసాభివ్యక్తినిమిత్తభూతాయాః యో2యమనంతరోక్తో నియమహేతుః, సఏవ గుణానామితి నియతో విషయ ఇతి గుణాశ్రయేణ వ్యవస్థానమప్యవిరుద్ధమ్"

అని ధ్వన్యాలోకమున ఆనందవర్ధను డనినాడు. ఈ భాగమును వ్యాఖ్యానించుచు,

"యద్యపి గుణాః సంఘటనైక రూపాః, తథాపి గుణనియమ ఏవ సంఘటనాయా నియమః. గుణాధీన సంఘటనాపక్షే2 ప్యేవమ్. సంఘటనాశ్రయ గుణపక్షే2పి సంఘటనాయా నియామకత్వేన యద్వక్తృవాచ్యౌచిత్యం హేతుత్వేనోక్తం, తద్గుణానామపి నియమహేతురితి పక్షత్రయే2పి న కశ్చిద్విప్లవః ఇతి తాత్పర్యమ్"

అని లోచనకారు డనినాడు. ఇందలి ప్రధాన భావములను పైన వివరించితిని.

రసధర్మములగు గుణములకు రసములు నియామకములు. వక్తృ, వాచ్య, విషయౌచిత్యములు గూడ నియామకములగుచున్నవి. సంఘటనకూడ రసవ్యంజకమగుటకు కావలసిన నియమము ప్రకరణౌచిత్యమే. గుణములు గుణికి చెందినవి. ఇచట గుణి యనగా రసమగుటచే గుణములు రసధర్మములగును. ఇట్టి ధర్మములు మూటికన్న ఎక్కువ లేవు. ప్రసాద గుణము సర్వరసవ్యాపి.

"సమర్పకత్వం కావ్యస్య
యత్తు సర్వ రసాన్ప్రతి
స ప్రసాదో గుణో జ్ఞేయః
సర్వసాధారణ క్రియః"

అని ప్రసాదగుణమును ఆనందవర్ధనుడు నిర్వచించినాడు. ప్రసాదమనగా శబ్దార్థముల స్వచ్ఛత. ఇది సర్వరససాధారణము, సర్వరచనాసాధారణము నగు గుణము. హృదయసంవాదవశమున ప్రతిసహృదయములలో రసమును స్వాత్మావేశముతో వ్యాపింపజేయజాలినది ప్రసాదగుణము. రెండవ గుణము దీప్తి యనబడు ఓజస్సు. ఇది రౌద్రవీరాద్భుత రసముల గుణము.

"రౌద్రాదయో రసాదీప్త్యా
లక్ష్యంతే కావ్యవర్తినః
తద్వ్యక్తిహేతూ శబ్దార్థా
వాశ్రిత్యౌజో వ్యవస్థితమ్"

అని ఆనందవర్ధను డనినాడు. రౌద్రాదిరసము లుజ్జ్వలతా జనకములు. తత్ప్రకాశనపరమగు శబ్దము దీర్ఘసమాసరచనాలంకృతమైనచో ఓజస్సు కలిగి యుండును. తత్ప్రకాశనపరమగు అర్థము దీర్ఘసమాసరచన నపేక్షించక ప్రసన్నవాచకాభిధేయ మగును. మూడవరసగుణము మాధుర్యము. ఇది శృంగార, కరుణ, శాంత రసములలో విశేషముగా కన్పించును. ఆర్ద్రమైన హృదయసంవాదమే మాధుర్యమున గల విశేషము.

శృంగార, కరుణ, శాంతములలో మాధుర్యము గలదు. రౌద్ర, వీరాద్భుతములలో నోజస్సు గలదు. శేషించిన రసములలో నీ రెండుగుణముల సమ్మేళనము కలదని చెప్పవచ్చు,

"హాస్యస్య శృంగారాంగతయా మాధుర్యం ప్రకృష్టం, వికాసధర్మతయా త్వోజోఽపి ప్రకృష్టమితి సామ్యం ద్వయోః. భయానకస్య మగ్నచిత్తవృత్తి స్వభావేఽపి విభావస్య దీప్తతయా ఓజః ప్రకృష్టం, మాధుర్యమల్పమ్. బీభత్సేఽప్యేవమ్"

అని లోచనకారు డనినాడు. ఈ గుణములు రసాస్వాదస్వరూపములు. ఆస్వాద్యము లగు రసముల కౌపచారికముగా నీ గుణముల నంటగట్టి, రసవ్యంజకములగు శబ్దార్థములయందే గుణములు కలవని యనుచున్నాము.

"ఏవం మాధుర్యౌజః ప్రసాదాస్త్రయో గుణా ఉపపన్నాః భామహాభిప్రాయేణ. తే చ ప్రతిపత్త్రాస్వాదమయా ముఖ్యతయా, తత ఆస్వాద్యే ఉపచరితా రసే, తతః తద్వ్యంజకయోః శబ్దార్థయోరితి తాత్పర్యమ్."

అని లోచనకారుడనినాడు కాగా గుణములు చిత్తవృత్తులు. ఈ చిత్తవృత్తులు ద్రుతి, విస్తర, వికాస రూపములై వరుసగా మాధుర్యమును, ఓజస్సును, ప్రసాదమును ఇచ్చుచున్నవి. సందర్భాంతరముల యందీ చిత్తవృత్తులే కైశిక్యాది వృత్తుల నొసగు చున్నవి.

వాచ్యవాచక సౌభాగ్య లావణ్యపరిపోషకమైన వాక్యవిన్యాసమే బంధమని కుంతకుడు చెప్పుచు సౌభాగ్య లావణ్యములను ప్రస్తుతించినాడు. ఈ గుణములు వాచ్యవాచకములకు చెందినవి. ప్రతిభాసంరంభ ఫలభూతము, చేతనచమత్కారిత్వలక్షణము నైనది సౌభాగ్యము. సన్నివేశసౌందర్యమే లావణ్యము. సాహిత్యమార్గము లన్నింటిలోను ముఖ్యముగా నుండవలసిన గుణములు సౌభాగ్యము, ఔచిత్యమునవి ప్రథమోన్మేషమున చెప్పినాడు. ఇవి [illegible] గుణములు. ఇవి పద, వాక్య, ప్రకరణ, ప్రబంధములకు చెంది కన్పించును.

"అంజసేన స్వభావస్య
మహత్త్వం యేన పోష్యతే
ప్రకారేణ తదౌచిత్య
ముచితాఖ్యాన జీవితమ్.
యత్ర వక్తుః ప్రమాతుర్వా
వాచ్యం శోభాతిశాయినా
ఆచ్ఛాద్యతే స్వభావేన
తదప్యౌచిత్యముచ్యతే"

అని ఔచిత్యమును నిర్వచించినాడు. పదముల యందు, భావములయందు ఔచిత్యము పాటింపబడవలెను. పాత్రపోషణ, వస్తువర్ణన, స్వభావోల్లేఖములయందు చెప్పబడు భావములు, పాత్రలకు, ప్రధాన విషయమునకు, రసమునకు ఉచితములై యుండవలెను. ఔచిత్యమనగా ఉచితాఖ్యానము. కావ్యశరీరమున కిది జీవితము.

"ఇత్యుపాదేయ వర్గేఽస్మిన్
యదర్థం ప్రతిభా కవేః
సమ్యక్ సంరభతే తస్య
గుణస్సౌభాగ్య ముచ్యతే
సర్వసంపత్పరిస్పంద
సంపాద్యం సరసాత్మనామ్
అలౌకిక చమత్కార
కారికావ్యైకజీవితమ్"

అని సౌభాగ్యగుణమును నిర్వచించినాడు. ఇదికూడ కావ్యజీవితమే.

కుంతకుని వివిధమార్గములు గుణములద్వారా అభివ్యక్తమగునవి. మాధుర్య, ప్రసాద, లావణ్య, ఆభిజాత్యములు సుకుమారమార్గములో కన్పించు అసాధారణ గుణములు. అసమస్తపదత్వము, శ్రుతిరమ్యపదత్వము, ఉక్తివైచిత్ర్యము కలిగినదీ మాధుర్యము. రెండవది ప్రసాదగుణము. వర్ణవిన్యాసవిచ్ఛిత్తి, పదసంధానసంపద, బంధసౌందర్యము కలది లావణ్యము. శ్రుతిపేశలత్వము, చేతఃసంవేద్యత్వము, స్వభావమసృణచ్ఛాయగలది ఆభిజాత్యము. లావణ్యాభిజాత్యములు మాధుర్యము పరాంకోటినందగా నావిర్భవించునవి.

ఇవే గుణములు విచిత్రమార్గమున భిన్నార్థములతో గలవు. అర్థరమణీయత్వమును తెచ్చు ఉక్తివైచిత్ర్యమైన మాధుర్యము వైచిత్ర్యసమర్పకమై, [illegible]మై, సన్నివేశ సౌందర్యముతో [illegible]. అసమస్తపదన్యాసముతో, [illegible] ఔచిత్యమైనది ప్రసా

వరకు. అనుస్వారాంతపదములతో సంశ్లిష్టము, హ్రస్వపదత్వముతో, సంయోగ పూర్వపదత్వముతో విలసిల్లునది లావణ్యము. ఈ లావణ్యమున ఓజస్సు, శ్లేష అంతర్లీనములు కాగలవు. నాతికోమలము గాక, నాతి కఠినము గాక, ప్రౌఢనిర్మితమైన మనోహర పద విన్యాసమాభిజాత్యము.

ప్రాచీనుల ప్రసాద మాధుర్య గుణములను కుంతకు డంగీకరించి, సుకుమారతను మార్గాభిధానముగా గ్రహించి శబ్దార్థ సౌకుమార్య సుభగమైనది లావణ్యమని చెప్పినాడు. దండి వామనుల సౌకుమార్యమే మసృణత్వముగా నాభిజాత్యమున చెప్పినాడు. విచిత్రమార్గ ప్రస్తావమున మాధుర్య నిర్వచనము గావించుచు దండి పల్కిన శైథిల్యమును తెచ్చినాడు. ప్రాచీనుల ఓజోగుణము నీ మార్గమందలి ప్రసాదము క్రింద చెప్పినాడు. ఈ గుణములన్నియు వక్రత యొక్క విశేషరూపములని కుంతకుని ప్రధాన సిద్ధాంతము.

కవికంఠాభరణమున క్షేమేంద్రుడు శబ్దవైమల్యము, అర్థవైమల్యము, రసవైమల్యము నను మూడు కావ్యగుణములు గలవనినాడు. వైమల్యమనగా ప్రసాదము. ప్రసాదగుణము సర్వరసవ్యాపియని, సర్వ కావ్యవ్యాపియని వెనుక చెప్పితిని. ధర్మములు, రసములు, లక్షణములు, రీతులు, అలంకారములు, వృత్తులు నను ఆరు కావ్యగుణములు గలవని సాహిత్యసారకారుని విచిత్రమతము. ప్రాచీనులు పఠించినగుణముల నితడు ధర్మములుగా గ్రహించినాడు.

ఆనందవర్ధను డంగీకరించిన మూడు గుణములనే అంగీకరించి, మిగిలినవాటిని వివేకముతో త్రోసివేసినవాడు మమ్మటుడు. దశగుణములలో కొన్ని వీటిలో నంతర్భూతములగుచున్నవి. మరికొన్ని దోషాభావ విశేషమున వచ్చునవి. మిగిలినవి ఒక్కొక్కచో దోషములుగాకూడ పరిణమించుచున్నవి. వామనుని శబ్దగుణములగు శ్లేష, సమాధి, ఉదారత, ప్రసాదములు ఓజస్సులోనివి. శబ్దగుణమగు మాధుర్యమును వేరొక గుణముగా నెంచనక్కరలేదు. ప్రసాదమున నర్థవ్యక్తి గలదు. సమతను దోషముగా మమ్మటుడెంచినాడు. కష్టత్వదోషము లేనిచో సౌకుమార్యము, గ్రామ్యత్వదోషము పోయినచో కాంతి రాగలవు. వామనుని అర్థగుణమగు ఓజస్సులోని ప్రౌఢి విశేషములు వైచిత్ర్యావహములే కాని గుణవిశేషములు కావు. అధికపదత్వము, అనవీకృతత్వము, అమంగలత్వము, అశ్లీలత అను దోషములు తొలగినచో వరుసగా ప్రసాదము, మాధుర్యము, సౌకుమార్యము, ఉదారత సిద్ధించగలవు. పైగా స్వభావోక్తియే అర్థవ్యక్తియని, రసధ్వని లేక గుణీభూత వ్యంగ్యమే కాంతి యని గమనించవలెను. అర్థగుణమగు శ్లేష కేవలముక్తివైచిత్ర్యము. వైషమ్యదోషరాహిత్యమే సమత.

శృంగార, కరుణ, విప్రలంభ, శాంతముల యందు వరుసగా మాధుర్య మతిశయాన్వితమగునని; వీర, బీభత్స, రౌద్రములలో క్రమముగా నోజస్సు పరాంకోటినందునని మమ్మటుడు ఆనందవర్ధనుని కొద్దిగా సవరించినాడు.

జగన్నాథుడు సాహిత్యమున ద్వైతపరముగా వ్యాఖ్యానించిన ప్రధాన సమీక్షకుడు. కావ్యాత్మ నిర్గుణమగుటచే నీ యాత్మకు గుణముల నాపాదింపజాలము. ఈ యూరకుపాధులగు రత్యాదుల ధర్మములే గుణములు. మాధుర్యప్రయోజకము లేక ద్రుతిప్రయోజకమైనది శృంగారము. సంఘటనకు, శబ్దార్థములకు, రసమునకు సంబంధించిన దీ ప్రయోజకత్వము. అనగా ఔపచారిక సంబంధమునకు బదులు జగన్నాథుడు ప్రయోజకత్వ సంబంధమును తెచ్చి వ్యవహార సరళిని సాధించినాడు. శబ్దార్థములు, రచన, రసము అనునవన్నియు గుణమనబడు చిత్తవృత్తిని కలుగజేయునవి.



# ఇంద్రధనుస్సు



"శివం"

"అమ్మా" అంటూ దీర్ఘంగా, బాధతో కూడిన కేక వేసేడు నాలుగేళ్ళ రాముడు.

"అబ్బా! ఏమిటిరా—" అని ఏదో అనబోతున్నాడు తనింకాను. అంతే, వాడు ఏడుపు మొదలెట్టాడు. ఒత్తి మొండిగోలు గాయి... ఒకటే ఏడుపు .. అదే మంచంమీద పడుకున్న తన చెవులు చిల్లులు పడిపోతున్నాయి.

కిటికీ కటకటాల తలుపులు తీసుకొని వంటింటిలోనుండి వచ్చింది అది. ఒచ్చి సమాచారమేమిటో కనుక్కోవటమూ అదీ ఏమన్నా వుంటేనా? అబ్బే. తిన్నగా తనమీదే మొదలుపెట్టింది మొగుడి దాడి. "ఒక్క క్షణం వాడిని వూరికే వుండనివ్వవుగదా! ఏం చేసేరు వాడిని? కాలుతొక్కేసేరా? పడుకుంటే వళ్ళు తెలియదా ఏమిటి! రామ, రామ! ఒక్క క్షణం యీ ప్రాణాన్ని సుఖాన్ని వుండనివ్వరుగదా. వాడు అటువైపు వత్తిగిలి పడుకుంటే మిమ్మల్ని ఏం చేసేడు? ఊరంత మంచం పడవేసేను కదా—హాయిగా పడుకోక వాడి కాలు త్రొక్కడం దేనికి చెప్పండి?"

ఏం మాట్లాడతాడు తను? తన నసలు మాట్లాడనిస్తేనా? ఈ మధ్య దాని ధోరణే పూర్తిగా మారిపోయిందిలే. ఈ యింట్లో జరిగే ప్రతీ అవకతవకకీ తనే కారణం అన్నట్లు మాట్లాడుతోందది. నిజానికి ఆ కుర్రవెధవను ఏం పట్టేనదో, ఏమో? లేకపోతే కడుపులో అజీర్తిబాధో? కాకపోయినా, అస్తమానం ఎందుకో వళ్ళందుకు వాడికి ఏడవటం అలవాటయి పోయిందిలే! పోతి అరచినా కారణం చెప్పలేడు వాడు. వీళ్ళే వూహించుకుంటారు. సామాన్యమైనంతవరకూ తనే అందుకు బాధ్యుడయివుంటాడు వీళ్ళవూహలో? ఏదో తెలియని బాధతో అవస్త పడుతున్నాడు వాడసలు. లేకపోతే అస్తమానం ఎందుకు అట్లా ఏడుస్తుంటాడు?

"ఏం నాయనా? తాతయ్యగారేమైనా చేసేరా? మా నాయన కాదూ? నేను ఎత్తుకుంటాను. దా. రావూ... పోన్లే నీకు వేరే మంచం వేస్తాను... హాయిగా పడుకుందువుగాని దా. ఏం? ఒద్దూ... ఏం కావాలిరా మరి... వూరుకోరా. అట్లా అస్తమానం ఏడిస్తే కళ్ళుకూడా పోతాయి...వూరుకో... మా బంగారపు కొండవుకదూ.. పటిక బెల్లం పెట్టనా...ఏమిటిరా.. ఏమిటి నీ బాధ.. తాతయ్యగారు తొక్కేరా.. ఎక్కడ తొక్కేరు?... తాతయ్యగార్ని కొడతానుండు—అమ్మ, మరీ భయం భక్తి లేకుండా మా రాముడ్ని తొక్కుతారూ! తాతయ్యగార్ని కొట్టేనులే.. ఇక వూరుకో...వూరుకోరా—ఏమిటి నీ బాధ... ఎక్కడ? ఏమైనా దయ్యముగాని పట్టిందేమోగా... వూరుకో... మామ .. చందమామ ఎట్లా పరుగెత్తుతున్నాడో...అబ్బే... మళ్ళ నేను చచ్చిపోతున్నానమ్మో... ఆ దయ్యమేదో మమ్మల్ని పట్టుకున్నా బ్రతికిపోదుము, ఆ కుర్రాడిని ఏడిపిస్తే ఏమౌతుందో దానికి!"

మాటాడితే యిదొకటి! వాడికి లోపల ఏదో ఏమో! వూరికే ఏడుస్తాడు. డాక్టరుకు చూపిస్తే డబ్బు ఖర్చవుతుందని తనకోసుకు, వాడిని డాక్టరు వద్దకుకూడా తీసుకొనివెళ్ళదు. వీళ్ళు దెయ్యమని దేవతనీ, నగవమాటలు! డాక్టరుకు చూపిస్తే అది ఎప్పుడో నయమయ్యి వూరుకునేది.

"దయ్యమూ లేదు, దేవతా లేదు. వాడిని ఒకసారి డాక్టరుకు చూపించరాదటే!" అన్నాడు తను.

"డాక్టరెందుకు? హాయిగా తిని తిరిగేవాడికి రోగమేమిటట? అయినా వళ్ళు తెలియకుండా ఏమిటా బండ-నిద్ర! కుర్రాడి కాలుతొక్కేసి, వాడిని ఏడిపించి పైగా డాక్టరుట, డాక్టరు! డాక్టర్లు వూరికే వచ్చి మందిస్తారా? లేకపోతే మీరు సంపాదించి తెచ్చినదంతా చాల్తోందనా! నాకు లోపల పనుంది, మీతో వాగుతూ కూర్చోలేను. వాడిని కాస్త ఆడించండి."

తనకు చాలా బాధగా వుంటుంది అది అట్లా ఎత్తిపొడుస్తూ, యీసడింపుగా మాట్లాడితే. రెండేళ్ళ నుంచీ యిదే వరస. రెండేళ్ళ క్రితమే తను పూర్తిగా అశక్తుడైయిపోయి రోగంతో మంచం ఎక్కింది. అంతా తను పోతాడనుకున్నారు. కాని ఎందుకు బ్రతికేడో, ఆ భగవంతుడికే తెలియాలి— బ్రతికేడు! కాని పూర్వపు ఆ శక్తి, వుత్సాహాలు తనలో మచ్చుకైనా లేవిప్పుడు. లేవని, వూరికే కూర్చుంటే ఎట్లా? ఎన్నాళ్ళిట్లా కొడుకు రెక్కల కష్టముమీద ఆధారపడివుంటారు, తామిద్దరూ? ఇంకా తనకు అన్పిస్తూనేవుంది; ఎక్కడైనా వుద్యోగం చేద్దామని. కాని ఎవరిస్తారు తనకు వుద్యోగం? నిజమే. అరవయి ఏళ్ళొచ్చిన తనకు ఎవరిస్తారు వుద్యోగం? అని, కొడుకు తెచ్చే వంద రూపాయల మీద తామిద్దరూ ఎన్నాళ్ళిట్లా ఆధారపడటం?

"ఏమండోయి—మిమ్మల్నే! వాడు మళ్ళీ ఏడుస్తున్నట్లున్నాడు. కొంచెం సముదాయించండి. ఎనిమిదవ్వకుండానే వూరంత నిద్ర!" లోపల్నుంచి విసుక్కుంటూ కేక వేసిందది.

తనమాట యీ మధ్య భార్య వినడము మానివేసింది. నాలుగేళ్ళ కుర్రకుంక ఏం వింటాడు? వాడి ధోరణివాడిదే! అర్థంలేని దరిద్రపు ఏడుపు! అస్తమానం యీ కొంపలో ఎవరోవకరు ఏడుస్తూండబట్టే దరిద్రంకూడా పట్టుకున్నది. మామూలు దరిద్రము కాదు. భరింపరాని దరిద్రము. తనకు తొడుక్కోడానికి ఒక చొక్కాముక్క లేదు. కుర్రాడికి మందిప్పించడానికి సత్తాలేదు. తన కొడుకు చెప్పులు కొనుక్కోడానికి చేసేప్రయత్నం, రెండేళ్ళనుంచీ ప్రయత్నంగానే వుండిపోయింది. దీనికి అంతూదరీ అంటూ కన్పించడంలేదు. కాని ఎవరేంచేస్తారు? ఎవరో ఏదో చెయ్యాలి! తనమట్టుకు తనకింకా వుద్యోగంచెయ్యాలనే వుంది. ఎవరితోనూ చెప్పకుండా ఏ తెనాలో వెళ్ళిపోయి షావుకారుకొట్లో గుమాస్తా వుద్యోగం సంపాదిస్తేగాని తనకి మనశ్శాంతి వుండదు. తన భార్య తనను గౌరవదృష్టితో చూడదు. అప్పటికి కాని యీ యింటి దరిద్రంకూడా తీరదు. ఛీ! లేకపోతే ఏం బ్రతుకిది? ఎంత లోకువయి పోయేడు తను ప్రతీవాళ్ళకూ. తన మాటంటేనే విలువలేదిప్పుడీ కొంపలో. ఒకనాడు తను నెలకు వందలకు వందలు దోసిళ్ళతో గుమ్మరిస్తోంటే అంతా తననెట్లా గౌరవించేవాళ్ళు! ఇప్పుడు మాత్రం తను తెనాలివెడితే ఏ షావుకారు కాదంటాడుతనని. ఇంకేమాత్రము తనీ యింట్లో వుండలేడు. నిన్న మట్టుకు నిన్న ప్రొద్దున్న......

ఆకలితో కడుపుమండిపోతోంది. కోపంతో అన్నాడు తను—

"శ్యామలా. మీ అత్తకి దయలేకపోతే పోనీ గాని, నీకైనా లేదా!"

"అయ్యో! వస్తున్నానండి. కుర్రాడు ఏడుస్తోంటే సముదాయిస్తున్నాను." అంది శ్యామల చిచ్చికొడుతూన్న కుర్రాడిని నెమ్మదిగా ప్రక్కమీద పరుండబెడుతూ.

"రోజురోజుకీ మరీ కుర్రాడైపోతున్నారు! ఇంకా ఎనిమిది దాటలేదు—అప్పుడే భోజనానికి తొందరొచ్చింది. మహాపాటుపడి వచ్చేరని." యీసడించింది అది.

"నేనుకూడా తింటాను, తాతయ్యతో..." గునుస్తూ అన్నాడు రాముడు.

"అట్లాగేరా మా బంగారం! శ్యామలా, కంచాలు తీసుకురా, యిక. ఎవరూ ఏడుస్తోంది అట్లా..." అడిగేడు తను పట్టుపంచ సవరించుకుని నెమ్మదిగా గుమ్మముమీద కూర్చుంటూ.

"ఇంకెవరూ, లంఖిణీదేవి! ఇదిగో తెస్తున్నాను కంచాలు." అన్నది శ్యామల కంచాలకోసం మంచము క్రింద దూరుతూ.

"ఎందుకొచ్చిన ఏళ్ళండీ! అరవయి ఏళ్ళొచ్చేయి. శుక్రవారంపూట గుమ్మముమీద కూర్చోవచ్చా? దిగండిముందు." గదిమింది సీతమ్మ పొయ్యి మీదనుండి అన్నపుగిన్నెను దించుతూ.

"కాలము మారిపోతోవుంటే మనుష్యులు మారిపోక ఏంచేస్తారు! ముందు రామయ్య నాన్నకు అప్పడాలు కాల్చు...కరకర నముల్తాడు కాస్సేపు." అన్నాడు తను కోరికగా అప్పడాల డబ్బావైపే చూస్తూ.

"ఊ...అప్పరాలు... అప్పరాలు... భలే... మామ్మా...అప్పరాలే నాకు..." రాముడు మారాం చేయసాగేడు.

"అబ్బబ్బ...వూరికే కూర్చోరు కదా మీరు! ఏదో నాలికమీదకు తీసుకొస్తారు. ఇప్పుడు అప్పడాల సంగతి ఎందుకు చెప్పండి...కూర, పచ్చడి, చారు, వున్నాయి కదా...ఈ ప్రాణాన్ని సుఖాన్న వుండనీయరు కదా..." చీవరించుకున్నది అది.

శ్యామల పీటలువేసి కంచాలుపెట్టి చెప్పింది, "మీరీ పెద్ద పీటమీద కూర్చోండి, రాముడే బుల్లి పీటమీద కూర్చుంటాడు."

"అబ్బ...పోవచ్చేట్లుందేయిక...అయినంతమట్టుకు వడ్డించు" అన్నాడు తను పీటమీదకు జరిగి

నెమ్మదిగా చావడిలోకి పోవు తయారుచేస్తున్న సీతమ్మతో.

"అప్పరమే ... ముందు అప్పగం యివ్వి నాను." అంటూ సణుగుతూనే రాముడు కంచాన్ని వక్కతిన్ని తన్నేడు.

"చూసేరా మీరుచేసిన ఘనకార్యం! వేళకి యింత తినేసి అవతిలకు దగుచెయ్యాపం లేదు కదా... ఏదో మా రాముళ్ళు పెడుతుంటూగు. అప్పడం కాల్చి యిస్తాను గాని కాసేపు అగు రామయ్యా. నువ్వు. ముందు తాతగార్ని తిననియ్యి. మనం కాస్సేపుండి హాయిగా తిందాము అప్పడాలతో."

ఇంతలో యింట్లో మళ్ళీ ఎవరో ప్రారంభించేరు ఏడుపు. భోజనంముందు కూర్చున్న తను అడిగేడు "ఎవరూ వూరికే అక్కడ ఏడుపు?"

"మీ చిన్న మనమడు సుబ్బులు. గాలిలేనట్లుంది, ఏడుస్తున్నాడు."

తనకి ఎవరైనా ఏడుస్తూంటే భోజనం సహించదు. తలపగిలి పోతూన్నట్లుంటుంది. "అబ్బబ్బ. వాణ్ణి కాస్సేపు ఎవరైనా అవతిలకు తీసుకువడుదురూ." అన్నాడు తను.

"మీభోజనానికి అడ్డంకాబోలు వాడు! కాని వ్వండి, ఫర్వాలేదు. అబ్బ! వంటినిండా అట్లా మెతుకులు పోసుకుంటూ తింటే, ఎటా? అవి తీసేసి, యీ నీళ్ళు చల్లుకోండి, మోకాలిపైన. మరీ చిన్న కుర్రాడైపోతున్నారు!" రాముడికోసం అప్పడాలు కాలుస్తూ సీతమ్మ మందలించింది తనను.

ఆ అప్పడాన్ని చూస్తూంటే తన నోరూరుతూంది, వూరికే. కాగా అన్నాడు తను, "సరే గాని, ఆ కాలుతూన్న అప్పడం యిట్లా పడవెయ్యి... నెమ్మదిగా నములుతాను."

"ఊఁ! నాకే...నాకు ముందియ్యి" రాముడు మారాం చేయసాగేడు.

"ఉండు నాన్నా, నీకు తర్వాత యిస్తాను. ముందు తాతయ్యగారికి కావాలిట." తన విస్తట్లో పడేసింది అప్పడాన్ని.

"తాతియ్యా...పీతియ్యా..." అన్నాడు కోపంగా రాముడు.

"తప్పురా, నా బంగారం!" అన్నాడు తను అప్పడాన్ని విరుస్తూ.

"తాతయ్యని...మరే...బొమ్మను." అన్నాడు బొమ్మతో వాడు గుసగుసలాడుతూ.

"అప్పడం బాగా కేవుందే!" అన్నాడు తను వాడిమాటలు పట్టించుకోకుండా.

"మిమ్మల్ని రాముడు బొమ్మంటున్నాడు - విన్నారా" అంది సీతమ్మ.

"పోయేవాడినేగాని ఎక్కడకు పోవాలో తెలియడంలేదురా, నా బంగారం" అన్నాడు తను ఆలోచిస్తూ.

"ఏట్లోకి పో!" అన్నాడు రాముడు.

ఫక్కున నవ్వేరు అంతాను. విరగబడి నవ్వేరు అంతాను. కాని తనకు నవ్వురాలేదు. తన పళ్ళసందున అప్పడం ముక్క యిరుక్కున్నట్లు అయ్యింది.

* * *

అబ్బాయి పెందరాళే భోజనం చేసేసి, డ్యూటీకి వెళ్ళిపోయేడు. ఆయన భోజనం, పిల్లలభోజనంకూడా అయ్యింది. కోడల్దికూడా అయ్యింది. అయినా, వంటిల్లింతా మహాసముద్రంలాగవుంది పనితో. అంట్లగిన్నెలన్నీ దొడ్లో పడేసి, భోజనానికి కూర్చోబోతూన్నది తను. రాముడు వక్క గావుకేకతో ఏడుపు ప్రారంభించేడు. శ్యామల తనకేమీ పట్టనట్లు నెమ్మదిగా అంట్లు తోముకుంటూన్నది దొడ్లో!

తను లేచి, వెంటనే వాకిట్లోకి పరుగెత్తింది. వాడు 'కుర్రో మొర్రో' అంటూవుంటే, ఆయన తేలుకుట్టిన దొంగలాగ మంచంమీద అట్లాగే పడుండివున్నారు. తనకు తెలుసు! ఆయన నిద్రలో, వాడికాలును త్రొక్కివుంటారు! అయినా ఎనిమిదవకుండానే అంత మొద్దునిద్దరేమిటో? రాముడిని వోదార్చేసరికీ అరగంట పట్టింది. ఆయన కాస్త లేచి, ఆ కుర్రాడిని వోదారిస్తే ఎంతబావుంటుంది? తనకి వళ్ళు మండుతుంది ఆయన తీరు చూస్తూంటే. కుర్రాడు కాలునొప్పితో ఏడుస్తూంటే, వాడికి 'రోగమో, రొచ్చో' డాక్టరుకు చూపించమంటారు, పైగాను, ఏమిటో! ఈయనకసలు మతివుండటంలేదీ మధ్యను. ఏదో మునిగిపోతూన్నట్లు ఎప్పుడూ మాయ ఆలోచనలు! పరధ్యానం! మొన్న మట్టుకు మొన్న అబ్బాయిపంచను, కండువా అనుకొని భుజానవేసుకొని పోష్టాఫీసు వైపు వెళ్ళిపోయేరు. నయం! ఆ ఎదురింటివాళ్ళ యింటికి వెళ్ళి యింకా ఏ తుండూ తీసుకురాలేదు! లేనిపోని అప్రదిష్టకూడాను. పనంతా వంటింట్లో ఎక్కడిది అక్కడ వుండిపోయిందని, కుర్రాడిని ఆయనవద్ద కూర్చోబెట్టి 'కాస్త ఆడిస్తూండండి.' అని చెప్పి వంటింట్లోకి వచ్చింది తను. ...తనకే చోద్యమవుతుంది, ఎవరిమట్టుకు వాళ్ళకి ఏం తెంత కోపాలట్మూ! ఆయనమట్టుకు ఆయనకి చీటికీ మాటికీ కోపం.

అబ్బాయిసంగతి చెప్పనే అక్కరలేదు. ఎప్పుడూ ముక్కునవుంటుంది. ఇక యీ విడ—'నేనేం తక్కువతిన్నానా' అన్నట్లుంటుంది! అరడజను గిన్నెలున్నాయో లేదో, వెతకపనేమీ లేదన్నట్లు తీరుబడిగా, గంటలకొలదీ తోముతూ కూర్చుంటుంది. కుర్రకుంక ఏడుస్తున్నాడని, సముదాయించుకుందామని ఏకోశానా వుంటేనా? కొంచెం త్వరగా తెముల్చమ్మా అంటే, తనమీద విరుచుకు పడింది అమాంతంగా. ఏం మాట్లాడినా నోట్లో వుంచు! అక్కడకూ నోరు నొక్కుకొని తనకెందుకని, చేతనైనంతమట్టుకు లాగుకొస్తోంది తనీసంసారాన్ని. ఇక్కడ వరస చూస్తోంటే, పగవాడికైనా వద్దురా దేముడా, యిట్టాంటి సంసారం, అన్పిస్తుంది.

తను కొంబట్టి గుండెను రాయిచేసుకొని, యీదుకొస్తున్నది యీ సంసారాన్ని రెండేళ్ళనుంచి. మగోరయితే ఏ క్షణంలోనో దూకేవారే, యీపాటికి! వందరూపాయలతో నెలంతా నలుగురిని యీడ్చుకు రావటం మాటలతో వుందేమిటి? వాడెక్కడో నానా అవస్థలూపడి మధ్యమధ్య అప్పుకూడా తెస్తున్నాడనుకో. అయినా, యీ వందలోనుంచేగా ఆ అప్పులుకూడా తీర్చేది? ఈయన స్థిరంగా వకచోట కూర్చునివుంటే తనకింత బాధగా వుండక పోయేది. కూర్చోరు కదా! ఒక రోజున తెనాలి వెళ్తానంటారు. మరోరోజు రాజమండ్రీ వెళ్తానంటారు. ఒత్తి చలచిత్తపు మనిషి అయిపోతూంటే! ఏమైనా అంటే పుట్టెడుకోపము. శరీరము బాగావున్నరోజుల్లో జాగ్రత్తపడి యీయన నాలుగు డబ్బులుకూడ బెడితే తమకీ అగచాట్లుండేవి కాదు కదా! ఆ జూదాలు...ఆపేకార్లు...ఏమ్మెండాలో అన్నీ వెల్గించేరు ఆ రోజుల్లో. ఇప్పుడు నెత్తినోరు కొట్టుకొని ఏం ప్రయోజనము?...... మళ్ళీ ఏడుస్తున్నాడే రామిగాడు...ఏదో అన్నట్లున్నారు వాడ్ని...మధ్య తనకి చావొచ్చిపడింది... యీ పిల్లలతో! చెయ్యికడుక్కొని లేచింది తను.

* * *

అంట్లు తోముకుంటూంది తను. 'ఈ అంట్లన్నీ శుభ్రంగా తోమాలి' అనే ధ్యాస తప్పితే మరేమీ లేదు తనకి. ఎక్కడైనా మకిలి కొంచెంవుందంటే, తెల్లారి మళ్ళీ తనే వాటిని చచ్చినట్లు తోమాలసి వస్తుంది. కాకపోయినా, యిన్ని కాక మరిన్ని అంట్లున్నా తనకేమీ కష్టంలేదు. చిన్నప్పటినుంచీ తను చేస్తున్న పనేయిది. కాని, అంట్లు కవక త్వరగా తోమి బయటపడకపోతే మామగారివద్దనుంచి పిల్లలవరకు, అంతా ఎక్కడి వాళ్ళక్కడ నిద్ర పోతారు. ఒక్కొక్కళ్ళను పేరుపేరునా లేవదీసి, మంచాలూ ప్రక్కలూ వేసి మళ్ళీవాళ్ళకు నిద్రలు పట్టేవరకు సేవచెయ్యాలి. ఇంతలో 'అమ్మా' అంటూ ఏడుపు మొదలెట్టేడు రాముడు వాకిట్లో.

భోజనానికి కూర్చున్న తన అత్తగారు, తనను సంబోధించి 'కుర్రాడు ఏడుస్తున్నాడే' అని అన్నది. ఒకసారి ఏడ్చే కుర్రాడినయితే తనేమైనా వూరుకో బెట్టగలదుగాని, రోజస్తమానం ఏడ్చే వాళ్ళను తనేంచెయ్యగలదు? అత్తగారు లేచి విసుక్కుంటూ వసారాలోకి వెళ్ళింది. ముందుకుపోతే నుయ్యి. వెనక్కుపోతే గొయ్యి యీ పాడు పిల్లలతో పగవాళ్ళకైనా వద్దు యిటువంటి సంతానం అన్పిస్తుంది. ఒక్క క్షణం వూరికేవుండరు. ఆకలో, నొప్పో, మరేమిటో గాని, సర్వకాల సర్వావస్థల యెవరోవకరు ఏడుస్తూనే వుంటారీ పాడుకొంపలో. ఏడ్చేడ్చి సొమ్మసిల్తేగాని పడుకోరు. వీడి తర్వాత ఆడపిల్ల లేస్తుంది. రాక్షసిలాగ చెవులు చిల్లులు పడేట్లు మొదలు పెడుతుందదిక. తను నిద్రపట్టక కోపమొచ్చి రెండు వాయిస్తుంది. ఎప్పుడో వకవేళ కొంచెను నిద్రపడ్తూందనగా ఆఖరివాడు లేస్తాడు. వాడికి అస్తమానం పాలుకావాలి. తల్లిపాలు!

అత్తగారు గొణుక్కుంటూ తిరిగివచ్చి తిరిగి కూర్చుంది, మళ్లీ భోజనానికి. ఏడుపు మొదలెట్టాడు రాముడు. ఇంకా అంట్లగిన్నెలు బోలెడున్నాయి తోమటానికి. తన చేతులరిగిపోతున్నాయి! 'కుర్రవెధవ ఏడుస్తున్నాడని త్వరత్వరగా తెముల్చడం అదీ ఏమైనా వుంటేనా...ఏం నాజూకో మా అమ్మ!' అంటూ దెప్పడం ప్రారంభించింది అత్తగారు. ఒకవైపు చేతులు మండిపోతూంటే, మరోవైపునుంచి యిదో రాపిడి! వళ్ళుమండింది తనకు. "ఏడ్చేడ్చి చస్తాడు, చావనీండి." అన్నది తను. కాని వెంటనే కళ్ళవెంబడి నీళ్ళు తిరిగేయి తనకి. ఎంతమాట అన్నది తను! ఈ కోపంలో నోటికి ఎంతవస్తే అంతా మాట్లాడేస్తుంది తను. ఆ భయంతోటేగా అసలు తను ఎవరెన్ని అన్నా నోరు మూసుకొని యీ సంసారాన్ని యీదుకొస్తున్నది. అలా కాకుండా అందరిలాగా తనూ అయితే, బాగానే వుండేది. తనేం సావిత్రిలాగ ఒక్కసారైనా అత్తగారిని ఎదిరించగల్గిందా! కామేశ్వరిలాగ సినిమాకు తీసికెళితేగాని వీలులేదని మొగుడిని నిగ్గదీసి అడగగల్గిందా? అయ్యోరాత. కాపరానికొచ్చి యిన్నేళ్ళయింది; తనొక్క సినిమా చూచిందీ! సినిమాలసంగతి అట్లావుంచి, రాజోలు, నర్సాపురము చెబవాడ స్టేషన్లు తప్ప తనేమీ ఎరుగును! అలమారులోని బొద్దింకలాగ తనువంటింట్లె పరిమితమయింది.

ఎరుగదు వంటయిల్లు కాకుండా మరోటివుందని తెల్సుకోడానికికూడా తనకు వ్యవధివుంటేనా? తెల్లవారుఝామున లేచింది మొదలు స్నానాలు, వంటలు, భోజనాలు, అంట్లు, మళ్ళి స్నానాలు, బట్టలుతుక్కోవడం, వంటలు, భోజనాలు, అంట్లు, ప్రక్కబట్టలు! ఇవన్నీ చూచుకునేసరికి ఎక్కడికో పోతుంది, తన ప్రాణం! ఒళ్ళు తెలియని నిద్ర ఆవేసిస్తుంది తన శరీరాన్ని.

అంట్లగిన్నెలు తోముకొని, వంటిల్లు సర్దుకొని తలుపులు బిగించి బయటకొచ్చేసరికి, రాముడివద్ద నుంచి అత్తగారివరకు అంతా ఎక్కడివాళ్ళక్కడ నిద్రపోతూన్నారు. నిట్టూరుస్తూ, ప్రక్కబట్టలైనా పరుచుకోకుండానే చాపమీద నడుము వాల్చింది తను.

అయిదు నిమిషాలన్నా అవ్వలేదు "శ్యామలా," అంటూ మామగారు పిలవసాగేరు. ఏమైనాసరేనని మాట్లాడక పరుంది తను, అట్లానే.

మళ్ళి "శ్యామలా, శ్యామలా—కాస్త మజ్జిగ వుంటే యిద్దూ... కళ్ళు మండుతున్నాయి." అంటూన్నారు

"పడుకుందురూ, యిప్పుడెక్కడిది—మజ్జిగ!" అని గద్దించి, తను కళ్ళుమూసుకుంది.

* * *

తెల్లవారేక, సత్యం డ్యూటినుంచి యింటికి వస్తూ ఆలోచించసాగేడు. ఏమిటి జీవితం, అని. ఇంటికివడితే బియ్యంవుండవు కొనితేవాలని నిన్న సాయంత్రమే హెచ్చరించింది తనతల్లి. కొని తీసుకొని వెళ్ళడానికా పైకం తక్కువగావుంది. ఇక తన తండ్రి ఆరోగ్యం చూద్దామంటేనా దినదినానికి క్షీణించిపోతూంది. డాక్టరుకు చూపిద్దామంటే, మందులకి డబ్బుండాలి. ఎప్పటికప్పుడు మంచి రోజులు ముందున్నాయి, అనే అచంచల విశ్వాసంతోవున్న తనకుకూడా నిస్పృహకలిగి ఏమిటి జీవితం? ఈ కష్టాలకు అంతెప్పుడు అని అన్పిస్తూంటుంది.

ఏమిటీ జీవితం అంటే? ఆలోచించడానికి వలసినంత వ్యవధి వున్నవాళ్ళకు చాలా అద్భుతమైన ప్రశ్నయిది. చీకూచింతలేని వాళ్ళూ, ధనవంతులూ వేసుకోవలసిన ప్రశ్నయిది. క్షణక్షణానికీ బియ్యపు సమస్యలనూ, పిల్లల ఆరోగ్యపు సమస్యలనూ, తండ్రి మనస్థిమితపు సమస్యలను పరిష్కరించవలసిన తనకు యిట్లాంటివాటిని గురించి చింతించడం అర్థంలేనిపని. ఎప్పుడో తీరికవున్నప్పుడు ఆలోచించాలి అసలు జీవితం అంటే ఏమిటో?

మీద పడబోతూన్న సైకిలు రిక్షాను తప్పించుకొని, చుట్టూచూచేడు అతను. ఎదురుగుంగా కిళ్ళీకొట్టు అవుపించింది. జేబులోనికి చేతిని పోనిచ్చేడతను. జేబులో బేడ చల్లగా తగిలింది, చేతివేళ్ళకు. బేడను బయటకులాగి, గోల్డుఫ్లేక్, సిగరట్టు వకటి యిమ్మని, కిళ్ళీకొట్టు వానిని అడగబోయేడతను. ఆకస్మికంగా, యింట్లోకి అగ్గిపెట్టెలు లేవని, భార్య నిన్న సణగడం గుర్తుకొచ్చింది అతనికి. వక అగ్గిపెట్టె అర్ధణా బీడీలు తీసుకొని, చిల్లరా అర్ధణా జేబులో వేసుకొని, ముందుకు రెండడుగులు వేసేడు సత్యం. 'బాబా కానీ' అంటూ కుష్టువాడొకడు చేతిని ముందుకు చాచేడు. జేబులోని అర్ధణా కాసును నేలమీదపడేసి జలదరిస్తూన్న శరీరంతో ముందుకు వేగంగా అడుగులు వేయసాగేడు అతను.

నడుస్తూన్న సత్యానికి ఆకస్మికంగా అనుమానం కల్గింది, యిదంతా అసలు జీవితమేనా, అని! బహుశా తామేలోకంలోనన్నా చనిపోయి యిక్కడికొచ్చేరేమో! ఈ లోకంలో చనిపోయినవాళ్ళు మరేలోకానికోపోయినట్లు, ఎక్కడో పోయిన తామంతా యిక్కడ ఫలితం అనుభవిస్తున్నారేమో? ఇదే జీవితమైతే ఎక్కడచూచినా యీ బాధలూ, రోగాలూ, అశాంతి, అధర్మం ఏమిటి?

బాధాకరమైన ఆలోచనల్నుంచి తప్పించుకోడానికి అన్నట్లు సత్యం వక్కక్షణం రోడ్డుమీద ఆగిపోయి, బీడీ ముట్టించుకొని మళ్ళి నడవసాగేడు. సత్యానికి, ముద్దు ముద్దు మాటలాడే రాముడు గుర్తుకు వచ్చేడు. రాముడి మాటలు వకటొకటే స్మరణకు రాగానే జీవితం అనుకున్నంత ఎడారి కాదనిపించింది. జీవితంలోనూ అక్కడక్కడ ఆనందం వుందనిపించింది. వెన్వెంటనే డోకులు డోక్కునే భార్య గుర్తొచ్చింది. జీవితమంటే తన భార్యకు తినడమూ, పిల్లలను కనడం, వంటింటి పనిచూచుకోవడమూ! అవును, అంతే. అంతకంటె ఏమెరుగును అది. అమితంగ జాలివేసింది అతనికి తన భార్యమీద. జాలి! ఎందుకొచ్చిన జాలి తను తన తల్లితండ్రులమీద మాత్రం ఎంత జాలిపడటం లేదూ? కాని తను ఏం చెయ్యగలిగేడు వాళ్ళకు! తనకున్నంతలో ఏదో యింత అన్నము పెడుతున్నాడనుకో. తల్లికి వక మంచిచీర గాని, తండ్రికి......! అంత బాధలోనూ నవ్వొచ్చింది అతనికి, తండ్రి కోర్కెలు గుర్తురాగానే. ఆయనకు కళ్ళజోడు కావాలి, రాజా పెన్ను కావాలి, ఆ రాజా పెన్నుతో వ్రాయడానికి ఎక్కడైనా వుద్యోగం కావాలి మందులుకూడా కావాలనుకో, కాని ఆయన ఎన్నడూ అవి కావాలనడు. ఆయన ముఖ్యంగా కావాలనేదల్లా వుద్యోగం!...

ఎందుకో నిన్న వుదయం సంగతి జ్ఞాపకానికి వచ్చింది సత్యానికి, తను నిన్న.........

గుమ్మములోకి అడుగు పెడుతూండగానే తల్లి చెప్పింది "ఒచ్చేవా నాయనా! మీ నాన్నగారికి తలనొప్పి, కళ్ళు మంటలూట! ఆ కళ్ళజోడు ఏదో యివ్వేళ కొనిపెట్టి తీరాలిట!"

"ఏమండీ - కళ్ళు మండుతున్నాయా... అట్లాగే, రేపు బజారు వెళ్ళినప్పుడు తెస్తాను. కాస్త మజ్జిగ యివ్వకపోయేవు లేం, చల్లగా నాన్నగారికి." అన్నాడు తను లోపలికి వెళ్ళుతూ.

"నాకు వుత్తరం ఏమైనా వొచ్చిందేమో అడుగు, అబ్బాయిని" అంటున్నారు నాన్నగారు. తను విననట్లే వూరుకున్నాడు.

"ఉత్తరం! మీకూ నాకూ వుత్తరాలు ఎవరూ రాసేది?" అన్నది తన తల్లి.

"రాసేవాళ్ళే రాస్తారు. అబ్బబ్బ...తల, నొప్పితో పగిలిపోతూందే."

"కొంచెం గంధము అరగతీసి రాయమంటారా" అడుగుతోంది తన భార్య మామగారిని.

"ఏమిటి రాయడం?" అడిగేడు తను కాళ్ళు కడుక్కొనివస్తూ, ఏమీ విననట్లు.

"వుత్తరాలేమన్నా వచ్చేయా?" అడిగేడు తన తండ్రి.

"ఎవరికీ—మీకా, నాకా?"

"నాకే."

"ఎవరూ రాసేది."

"ఉన్నారులేగాని, వున్నాయా?"

"మళ్ళీ ఎవరికయినా రాస్తున్నారా - వుద్యోగం యిప్పించమని."

"అవును. తెనాలి రాసేను."

"ఎందుకు? ఇక్కడ మీకు ఏం తక్కువయ్యిందనీ? ఏమీ బాగుండలేదా మీకిక్కడ?" అడిగేడు తను నొచ్చుకుంటూ.

"ఇక్కడ మిమ్మల్ని ఎవరైనా అవమానం చేస్తున్నారా? ఎందుకు మీకీ గొడవలు - హాయిగా తిని కూర్చోక." అన్నది తన తల్లి.

"ఇందుకేనా, రోజూ కళ్ళజోడనీ, కలమని అడుగుతూన్నారు. ఏం, యిక్కడ ఉత్సాహంగా భోజనం చేసి కూర్చోటం మీకు నామర్దాగా వున్నదా?" అడిగేడు తను.

"నామర్దా ఏమిటిగాని, పురుషుడయ్యాక ఏదో వక వుద్యోగం చెయ్యాలిగా!" అన్నారు ఆయన.

"చేసేరుగా! అరవయి ఏళ్ళు వచ్చేవరకూ చేసేరు, చాలు." మందలింపుగా అన్నది తన తల్లి.

"మీరు సంపాదించటం లేదని ఎవరైనా అన్నారా?" తను అడిగేడు లాలింపుగా.

"ఊహు."

"మీరు కూర్చుంటే లేవలేరుకదా, తెనాలి వెళ్లి షావుకారు గుమాస్తాపని ఎట్లా చేద్దామనుకున్నారు? కలం వణకకుండా రెండు నిమిషాలు పట్టుకోలేరు కదా! అయినా ఎందుకు మీకీ అవస్థ యింకా. హాయిగా, క్రిష్ణా రామా అనుకుంటూ కూర్చోక." అన్నాడు తను.

"నువ్వు నాలీచాలక అవస్థపడుతూంటే నేను ఎట్లా వూరికే కూర్చోను.?" అన్నారాయన వున్నట్టుండి...శూన్యంలోకి చూస్తూ.

"కూర్చోక ఏంచెయ్యగలగని? కూర్చోవాలి, కొంత వయస్సొచ్చేక. నా అవస్థ నేనుపడి తెస్తున్నానుగా..."

"ఆయనతో ఏమిటిగాని, నువ్వు భోజనానికి లే నాయనా, ఆలస్యమవుతూన్నది." అన్నది తన తల్లి.

"భోజనం చేసేరా! ఊఁ. చేస్తే, ఆ మంచం మీద క్రిష్ణారామా అనుకుంటూ హాయిగా పడుకోండి." తండ్రితో నిశ్చయంగా చెప్పి తను భోజనానికి లేచేడు. ముసలాయన అప్పుడుగాని మాట్లాడకుండా పడుకోలేదు.

ఏమిటో, ముసలాయనకీ మధ్య అసలు మనస్థిమితం పూర్తిగా పోతూంది! తనిప్పుడు యింటికెళ్ళేసరికి పట్టుపంచ కట్టుకొని యిల్లంతా అలంగం తిరుగుతూంటాడు. ఇంకా ఎనిమిదన్నా అవకుండానే భోజనం ఏమిటో......

సత్యం తమ వీధిలోనికి వచ్చేసరికి, తమ గుమ్మమునందు నలుగురైదుగురు నిలబడివున్నారు. తన తల్లి దిగులుగా అరుగుమీద కూలబడివున్నది. ఏమిటది? ఏం జరిగింది? తడబడే కాళ్ళతో త్వరితంగా ముందుకునడిచేడు సత్యం. గుమ్మములో అడుగు పెడుతూండగానే అతనితల్లి ఆదుర్దాగా "ప్రొద్దుటినుంచి మీ నాన్నగారు అవుపించడం లేదురా... ఎక్కడికెళ్ళేరో ఏమో?" అన్నది.

"రంగయ్య గారింట్లోను, సుబ్బయ్యగారింట్లోను చూచి వచ్చేము. అక్కడా లేరు." అని కలిపింది శ్యామల.

"తాతయ్యో - మరి - ఎక్కడో పోయేరు" అంటున్నాడు రాముడు చేతులు వంకరగా త్రిప్పుకుంటూ.

ఎక్కడకు వెళ్ళివుంటారు? అకస్మికంగా మెదడు శూన్యమైపోయినట్లు నిపించసాగింది సత్యానికి. ఏమి చెయ్యాలో, ఎట్లా ప్రారంభించాలో తోచడంలేదు. 'కొంపతీసి ఆయన ఏ అఘాయిత్యమూ చెయ్యలేదుకదా' అనే ఆలోచన వున్నట్లుండి మెదిలింది. చాలా అసహ్యంగా అవుపించిందా ఆలోచన. అటువంటి ఆలోచనవచ్చినందుకు తనపైన తనకే అసహ్యం కల్గింది. ఆ భావాన్ని తోసివెయ్యడానికి ప్రయత్నం చేసేడతను, 'ఏ బజారో వెళ్ళి వుంటారు' అని నచ్చ చెప్పుకో యత్నిస్తూ. కాని వెంటనే మరల పూర్వపు ఆలోచనే, గబ్బిలంలాగ గిర్రున తిరుగసాగింది బుర్రలో.

"రాత్రి ఆయనను ఎవరైనా ఏమైనా అన్నారా?" అడిగేడతను, ఏదో వకటి మాట్లాడాలనే వుద్దేశంతో—అట్టే ఆలోచన లేకుండానే.

"ఎవరేమంటార్రా? భోజనంచేసి ఆయన హాయిగా పడుకుంటేను!" తల్లి చెప్పింది.

"వస్తానుండండి" అంటూనే తిన్నగా కాలువవడ్డునపే నడిచేడు సత్యం! జ్వరపు శరీరం లాగ వళ్ళంతా వణుకుతూంటేగా వంతెనపై నిలబడి చుట్టూ చూచేడతను. ఏమిటి తను చేస్తున్నపని? తన తండ్రి శవముకొరకు చూస్తున్నాడా? కాదు. మరెందుకు? అంగీకరించడానికి అతనికి అవమానకరంగా కన్పించింది. నెమ్మదిగా నిట్టూర్చి, యింటికి తిరుగుముఖం పట్టే వస్తూండగా, వకవేళ తన తండ్రి రాజమండ్రిగాని, తెనాలిగాని వెళ్ళివుండకూడదా అనే ఆలోచన తట్టింది. అవును. సమంజసంగానే వుందీ ఆలోచన, అనుకున్నాడతను. తప్పక ఆయనేదో వుద్యోగప్రయత్నంలో ఎక్కడికో వెళ్ళి వుంటారు. తను అనవసరంగా భయపడ్డాడు. అనవసరం ఏమిటి? ఇప్పుడు మాత్రం భయంలేకుండా ఎక్కడున్నది? ఇంత రోగిష్టిమనిషి ఎట్లా రైలెక్కగలరు, ఎట్లా దిగగలరు? ఒంటరిగా ఎట్లా నడపగలరు? దారి మధ్యలో కూలిపడిపోతే ఎవరు దిక్కు!

"తెనాలో, రాజమండ్రో వెళ్ళివుంటారు. మీరేమీ ఖంగారుపడకండి, నేను వెళ్ళివస్తాను" అని భార్యకు, తల్లికీ ధైర్యం చెప్పి అలమారులోవున్న రెండు రూపాయలూ జేబూలో వేసుకొని స్టేషనుకు పరుగెత్తేడు సత్యం. అదృష్టవశాత్తు తెనాలిపోయే రైలు, స్టేషనులో సిద్ధంగావుండటంవల్ల, తెనాలి వక టికట్టు తీసుకొని, ఆయాసపడుతూనే పరుగెత్తుకుంటూ రైలులో వెళ్ళి పడ్డాడు సత్యం.

పరుగెడుతూన్న రైలులో కూర్చొని ఆయాసం అనునయించుకుంటూన్న సత్యాన్ని, ఆలోచనలు మాత్రం వదలలేదు. నిర్దయతో వెంటనే వేధించసాగినయి. ఒకవేళ తన తండ్రి రాజమండ్రిలోగాని, తెనాలిలోగాని వుండకపోతే! తెనాలిలో అయినా తను ఎక్కడని వెదికేది? ఆయనకు మతి తిన్నగా వుండివుంటే, తను ఆయనకోసం, తెలిసిన వాళ్ళల్లో విచారించవచ్చును. ఆయన ఎక్కడ తిరుగుతున్నారో? ఎక్కడ పడిపోయేరో! జన్మజన్మాంతరాలనుండి పగపట్టినట్లు యీపాడు ఆలోచనలేమిటో? ఎట్లా వ్రాసివుంటే అట్లా అవుతుంది. తను యిక ఆలోచించడు. కాస్సేపు ప్రకృతిని చూచి ఆనందిస్తాను, అనుకుంటూ) పరుగెత్తి అదృశ్యమయిపోతూన్న పొలాలను చూడసాగేడతను. ఎండనక వాననక శ్రమించి రైతులు ధాన్యం పండించబట్టే తామంతా జీవించకలుగుతున్నారు... అనుకున్నాడతను. చాలా గొప్పగా వున్నట్లనిపించింది యీ ఆలోచన. వెనువెంటనే, వకప్పుడు తమకూ పొలాలు వుండటం గుర్తుకొచ్చింది. ఒక్కొక్కటే తన తండ్రి వాటి నన్నిటినీ అమ్మివేసేడు. ఇప్పుడు.....ఛీ! మళ్ళీ యీ ఆలోచనలే...

తెనాలిలో ఆగింది రైలుబండి. వెంటనే, తనకి తెలిసిన నాలుగు దుకాణాల్లోనూ తన తండ్రి జాడను గురించి విచారించాలి. ఒకవేళ ఆయన జాడ తెలియకపోతే! తెల్సినా తనతో వచ్చే స్థితిలో లేకుంటే! ఏ కాలవలోనైనా పడి, ఎక్కడికో కొట్టుకుపోతూన్నారేమో యీ సమయంలో ఛీ. ఛీ. తన మెదడు కుళ్ళిపోయింది ఏనాడో!...వీళ్ళంతా ఎంత హడావుడిగా పరుగువెడుతున్నారో? ఆమె కుర్రాణ్ణి ఎట్లా ముద్దులాడుతూందో... అతనెంత అవస్థపడుతూ దగ్గుతున్నాడో!

'వెయిటింగ్ రూం' ముందున్న బల్లపైన కూర్చొని విపరీతంగా దగ్గుతూన్న అతనివైపే చూస్తూ నడుస్తూ సత్యం అనుకున్నాడు 'అబ్బ! అతనెంతో కాలం బ్రతకడు... ఆ దగ్గు అతని ప్రాణాన్ని తీసేస్తోంది." ఆ దగ్గుతూన్న వ్యక్తిముఖం తనవైపు తిరిగింది, తన కండ్లు మరోవస్తువు వైపుకు ఆకర్షింపబడేలోగా, సత్యం అకస్మికంగా ఆగిపోయేడు. ఆనందాశ్చర్యాలతో అతనికండ్ల నీరు తిరిగింది. తన తండ్రి! ఇక్కడ! ఒంటిమీద బనీనైనా, కండువాయైనా లేకుండా! సత్యం నోటమాటైనా లేకుండా వచ్చి తండ్రి ప్రక్కనే కూర్చున్నాడు. ముసలి ఆయన సత్యాన్ని చూచేడు గాని మాటాడలేదు.

యిద్దరూ నిశ్శబ్దంగా కూర్చున్నారు అయిదు నిమిషాలు.

"లేచి, ఒక సోడా తీసుకురానా?" అడిగేడు సత్యం.

ముసలిఆయన మౌనంగానే తలవూగించేడు. సత్యం లేచి, సోడా వకటి తీసుకొనివచ్చి యిచ్చేడు. ముసలాయన ఆయాసపడుతూనే సోడాను త్రాగి త్రేన్చేడు. ఖాళీసోడాను కొట్టులోయిచ్చేసి సత్యం తిరిగివచ్చి తండ్రి ప్రక్కను కూర్చొని అడిగేడు, "ఇంటికి వెళ్ళిపోదాము—వస్తారా?"

ముసలిఆయన శూన్యంలోనికి చూస్తూకూర్చొని వున్నాడు—పలుకైనా లేకుండా.

సత్యం వక్కక్షణం ఆగి, తండ్రిముఖం వంకే బాధగా చూస్తూ, అన్నాడు "నేనొక్క మాట చెబుతాను వింటారా? తిన్నగా యింటికి వెళ్ళిపోదాము, రండి. మీకొక రాజా కలం కొని తెచ్చేను. అమ్మేమో ఎక్సరసైజు పుస్తకాలు కుట్టి రూళ్ళు వేస్తోంది. ఆ కలంతో మీకు శక్తివున్నంత వరకూ రామకోటి రాయండి. రేపు జీతాలురాగానే కండ్లజోడు, భగవద్గీతకూడా కొనితెస్తాను. తీరిక వున్నప్పుడల్లా అది చదువుకోండి. మీరేవుద్యోగమూ చెయ్యనక్కరలేదు. ఇంటి విషయాలన్నీ నేను చూదుకుంటాను — మీకెందుకు? మన నలుగురికీ వందరూపాయాలు చాలకపోవడమేమిటి, ఎవరైనా వింటే నవ్వుతారు! లేవండిక. ఇంకా కావలిస్తే, ప్రస్తుతానికి నా యీ 'పైలట్' కలం మీదగ్గరవుంచుకోండి. ఇదిగో జాగ్రత్తగా పట్టుకోండి. ఏం పోదామా, మన వూరు...బండీ టైమవుతోంది."

ముసలాయన ఆలోచనతో అనిశ్చయంగా వూరుకున్నాడు, కలాన్ని చేతిలోకి తీసికొనికూడా.

"మిమ్మల్ని ఎవడైనా ఏమైనా అంటే నాతో చెప్పండి—చర్మం చీరేస్తాను. అయినా ఎవరేమనుకుంటే మీకేమిటి! దొరగారిలాగ హాయిగా కుర్చీలో కూర్చొని, నిశ్చింతగా కొత్తకలంతో రామకోటి రాసుకోక! రేపటినుంచీ మీరెవ్వరితోటీ మాటాడనక్కరలేదు కూడాను. ఎనిమిది గంటలకల్లా మన కుర్చీలోకూర్చొని రామకోటి ప్రారంభించండి. మీకు ఎప్పుడు విసుగెత్తితే అప్పుడు మానివేయండి. శుభ్రంగా కృష్ణా, రామా అనుకుంటూ మెత్తటి పరుపుమీద పడుకోండి. అదే మీడ్యూటి యిక. ఏం? లేవండిక."

ముసలాయన తలవూగించేడు చెమ్మగిల్లే కండ్లతో.

అప్పుడేవచ్చి ఆగివున్న రైలుకు తండ్రిని ఎక్కించి, వనకాలే తనూ లోపలికి ఎక్కేడు సత్యం.

ఇద్దరూ నిశ్శబ్దంగా కూర్చొన్నారు, వకరి ఎదురుగా మరొకరు.

ముసలాయన దిగులుగా మూలిగి, "యీ వయస్సే యిటువంటిది. ఇందులో సుఖానికి, శాంతికీ తావక్కడా లేదు. లేని శాంతికోసం, వుందనుకొని ఆశతో ఎదురు చూడటమే తను చెయ్యవలసిన పని. అటువంటప్పుడు యీ శేష జీవితం ఎక్కడ గడచిపోతే నేమి?" అనుకున్నాడు.

సత్యం చిన్న నిట్టూర్పువిడిచి అనుకున్నాడు, "ఈ సంసారంలో ఎవ్వరికీ శాంతి వుండదు. ఎక్కడో, ఎప్పుడో వుంటుందనే ఆశమాత్రం ప్రబలంగా లేకపోతే తామంతా ఏమయిపోయేవారో! ప్రతీ జీవితంలోకి ఆక్షణం ఎప్పుడో అప్పుడు రాక తీరదు. అది వచ్చేవరకూ యీ అశాంతితో సమరం సలపడమే తన కర్తవ్యం ఇదకాబోలు జీవితం" అనుకోసాగేడు.

ముందుకు సాగడమే తన లక్ష్యం అన్నట్టు రైలుబండి చెవులు చిల్లులుబడేట్లు వకమారుకూసి, వేగంగా పరుగిడ సాగింది—ముందుకు.



# ప్రవాసము - ఊర్వశి



శ్రీ పొట్లపల్లి శీతారామారావు

సురభిగారు మళ్ళీ ప్రవాసము - ఊర్వశి అన్న నావ్యాసంమీద కూడ సమాధానం వ్రాశారు. నా విమర్శ ప్రాచీనాచారముల మీద ఆధారపడి ఉందనీ దానికి ఆ పద్ధతిలోనే సమన్వయం చేస్తాననీ వారన్నారు. అలంకారశాస్త్రం ప్రాచీన సంప్రదాయముల మీద నిర్మింపబడ్డదట. ప్రసిద్ధేతి వృత్త గ్రహణం ప్రఖ్యాత నాయికా నాయకులను గ్రహించటం ఇవి ప్రాచీన సంప్రదాయములని వారు చెప్పిన మాటలే. "ఎక్కడయినా నాయికా - నాయకుల అనుభావ సంచార్యాదులు కవి తానుగా భావించియే, రసమార్గాన్ని ఏర్పరుస్తాడు గనుక కవి నాయకుడైతే ఫరవాలేదు - అప్పుడైనా రసంపుడుతుంది." అని వారివాదన. వారు వ్రాసిన వ్రాతకంతా యిది మూల స్తంభం. కవి తాను నాయకుడు కాకూడదు అని పుస్తకాలలో ఎక్కడా లేదు. కాఫీ త్రాగకూడదని ధర్మశాస్త్రాలలో లేదు అందుచేత కాఫీ త్రాగి తద్దినం పెట్టవచ్చు అన్నమాట ఎంత సమంజసమో కవి తాను కావ్యంలో నాయకుడుగా ఉండవచ్చు అన్నమాట అంతసమంజసము. విభావం అంటే ఏమిటి? అని విచారణ చేయాలి. కవి తానుగా విభావ స్థానం పొందుతాడా! అసలు రసానికి విభావము ఎందుకు? రసము అంటే ఏమిటి? స్థూలంగా ఒక అలౌకికానుభూతి అందాము. ఈ అలౌకికత్వాన్ని సంపాదించటం ఎలాగు? లౌకికానికి - అలౌకికానికి భేదమేమిటి? ప్రత్యక్షాదులు లౌకికం - అప్రత్యక్షాదులు అలౌకికం. మన ఎదురుగా ఒకడు ఆపదలో ఉన్నాడు - అయ్యో! వాడు కష్టపడుచున్నాడు అని ఇంకొకడితో చెపుతాము - మనమూ జాలిపడతాము. వాడూ జాలిపడతాడు. ఇది రసంకాదు. కావ్యగతమైన నాయికా నాయకాదుల కష్టసుఖాదులను మనము చర్వణచేసి పొందేది మాత్రమే అలౌకికానుభూతి. దానియందే రససిద్ధి. ప్రత్యక్షాదులు దీనికి భంగహేతువులు. కవి మనకు ప్రత్యక్షస్థితుడు. అతని అనుభూతి మనలను రసదృష్ట్యా అలౌకికవీధులకు తీసుకవెళ్ళలేదు. కవి అహంకారం పోతే పోతున్నాడంటాము. కావ్యంలో ఉన్న భీముడు అహంకారం పోతే అహంకార పడుతున్నాడనము. అతడు ధీరోద్ధతుడుగా భాసిస్తాడు. రసగతమైనటువంటి ఈ అలౌకికానుభూతికి పునాది విభావం. ఈ పునాది ప్రసిద్ధేతి వృత్తమే కానక్కరలేదు. మృచ్ఛకటికములో వలె అప్రసిద్ధేతి వృత్తముకూడా కావచ్చు. నాయకుడు ఉండాలి. ఆ నాయకుడు కవి కాగూడదు. కవి ప్రత్యక్షస్థితుడు. రసానుభూతికి అప్పుడు పునాదే లేదు. పునాదినే భంగం జరిగింది. ఇది రస సిద్ధాంతములోని మొదటి రహస్యం. అందుచేత స్తోత్రాదులు రసవద్గ్రంథములు కావు. ఈ స్తోత్రము రసవంతంగా ఉన్నది అని లోకంలో అంటాము. అప్పుడు ఆ రసవంతమన్న శబ్దం ఉపలక్షకం. ప్రబంధానాం ప్రబంధౄణామపి కీర్తి ప్రతిష్ఠయోః అన్న వాక్యంలో ఈ రహస్యము ఇమిడి ఉన్నది. కవి వేరు నాయకుడు వేరు అని అర్థం. ఈ విభావమును గురించి మహాకవులందరు శ్రద్ధతీసుకున్నారు "కశ్చిత్కాంతా విరహగురుణా" మొదలైన మొదటి అయిదారు శ్లోకాలు తీసివేస్తే లక్కినదంతా యక్షోక్తి. విభావము చక్కగా మూర్తి కట్టేందుకు మహాకవి మొదటి శ్లోకాలు వ్రాశాడు. ఇది రస మార్గంలో అనుక్తమై సర్వతో గ్రాహ్యమైన మహావిషయం.

దీనిని వదలిపెడితే ఎంతైనా అకాండతాండవం చేయవచ్చు. సురభిగారు వ్రాసిన మొదటి నాల్గు పుటలు ఇది వ్యక్తము కాని స్థితి. అసలు వీరికి అలంకారశాస్త్రమర్యాదలు తెలుసుకొనే అంత ఓపిక ఉన్నదా అని ప్రశ్న?

"సరస్వతీ స్వాదు తదర్థవస్తు, నిష్యందమానా మహతాం కవీనాం, అలోక సామాన్య మభివ్యనక్తి ప్రతిస్ఫురంతం ప్రతిభావిశేషం"

"అంటే భారతి వస్తుతత్వాన్ని స్రవిస్తూ మహాకవులకు అలోక సాధారణమై ప్రకాశించే ప్రతిభా

విశేషాన్ని అభివ్యక్తీకరిస్తుందట. ” ఇది సురభిగారు వ్రాసిన అర్థం. మహాకవులయొక్క సరస్వతి ధ్వన్యర్థ వస్తువులను స్పందిస్తూ ప్రతిభావిశేషమును అభివ్యక్తం చేస్తుందని అర్థము.

“ మహాకవీనాం సరస్వతీ ” కర్త. వట్టి సరస్వతి కాదు. సురభిగారు అనుకునే అర్థమైతే “ మహద్భ్యః కవిభ్యః ” అని ఉంటుంది. ఇది సంస్కృతములో ప్రాథమిక జ్ఞానము.

మరి వీరు పలుచోట్ల సంబంధములేని వాక్యములు వ్రాస్తారు. అన్నింటిని నేను విమర్శించటానికి పూనుకోలేదు. నాకు సురభిగారి పాండిత్యాన్ని విమర్శించాల్సిన అవసరములేదు. నా వ్యాసానికి ఆయన చేసిన ప్రత్యాఖ్యానం అసమంజసమని చూపించటమే నా పని. నేను కృష్ణశాస్త్రి గారు - అలంకారాలలో అలంకారాలు వ్రాస్తాడు అంటే సురభిగారు మాలారూపకాలను ఉదహరిస్తారు. విది వ్రాశావో గ్రహించకుండా వ్రాస్తే సమాధానం చెప్పడం ఎలాగు? ఉభయ సంధ్యలయొక్క వెలుగును చూచి బెదిరే గుడ్లగూబల్లే అని కవి వ్రాస్తే నేను ప్రాతస్సంధ్యయందు మాత్రమే గుడగూబ కలవరిస్తుంది అని అంటే ఆచర్చ అనవసరమంటారు. కవియొక్క శక్తి ఇల్లాంటి వాటిని పట్టే తెలుస్తుంది.

“ నాకుగాదులు లేవు - నా కుషస్సులు లేవు- నేను కృష్ణానంత హేమంత శర్వరిని ” ఈ రచన చాలా బాగా ఉన్నదని సురభిగారు. తాను రాత్రయితే ఉషస్సులు లేవు అన్నమాట సరే. ఉగాదులు లేకపోవట మేమిటి ? హేమంత-ఋతువులో ఉగాది రాదనా ? అయితే ఒక్క వసంతాన్ని వదలితే ఇంక ఏ ఋతువుకు ఉగాది లేదు. మహాకవి అంటే అర్థం వ్యభిచరించని శబ్దాన్ని వాడేవాడు.

తరువాత కథ - వేదంలోది - కాళిదాసుది : రవీంద్రునిది - కృష్ణశాస్త్రిగారిది - తీసుకొని ఒక సిద్ధాంతాన్ని చేశారు. వేదములోది కథ. కాళిదాసుది రసవిషయం. ఊర్వశి అప్సరః స్త్రీ అయినా ఆవిడ గాలిలో పెట్టిన దీపం కాదు. శకుంతల ఎటువంటి నాయికో ఊర్వశి అటువంటి నాయిక. కృష్ణశాస్త్రి ఊర్వశి ఎవరు ? ఈవిడ ఎవరో స్త్రీ అయి ఉండాలి. ఆవిడను కృష్ణశాస్త్రిగారు ప్రేమించి ఉండాలి. ఆవిడ పేరు మాపుచేసి ఊర్వశి పేరు పెట్టాలి. పాఠకునకు ఇదే అర్థమవుతుంది. ఇది కావ్యములో రసభంగ హేతువు. పాఠకునకు కృష్ణశాస్త్రి పురూరవ చక్రవర్తి కాడని తెలుసును. ఈయనకు ఆకాశగమనం లేదు. ఏ రాక్షసుని చంపి ఊర్వశిని రక్షించలేడు. ఆవిడ ఈయనకోసం దిగిరాదు. ఈ విషయం పాఠకుని మనస్సునకు సుస్పష్టం. ఇంక, విభావసామగ్రి ఎక్కడ? ఉత్తమ నాయికా నాయక - లక్షణాలెక్కడ ? అవి లేకపోతే రసస్ఫూర్తి కలుగదు.

“ నీవు తొలిప్రొద్దు నునుసంజలేతసొనవు ”— సొన అంటే చిన్న వాగు తీగకు వాగేమిటి ? “సురభి కాంతి పలుకరించునా ?” సురభికాంతి పలుకరించట మేమిటి ? ఈ సురభియా ఆ సురభి ? “ఊష” శబ్దం - పతంజలి మొదలు అమరునివరకు ఇది పుంలింగము. ఆప్టే - అభిధాన రాజేంద్రుడు - వాచస్పత్యంలోనూ ఇది టాబంతంగా సమర్థితమైంది. అగతి కానికి గతి కల్పించవమది. అభిధాన రాజేంద్రుణ్ణి చూసే వ్రాశాడా కవి ? చూడవలెనా ? అన్నదీ ప్రశ్న - అప్పుడైనా అప్రయుక్త దోషం తప్పదు.

“ నీ హృదంతికములో ” ఎటువంటిది అంటే “ నూతిలో వెలువడ కోమలిన్ దిగిచే వంటిదట. అక్కడ సంస్కృతపాండిత్యం అట్లా ఉన్నది కదా! ఇక్కడ తెలుగు పాండిత్యం ! నూతిలోనుండి అని ఇక్కడ అర్థం బాలవ్యాకరణ వివరణాలు జూస్తే తెలుస్తుంది.

ఇంక “ సంజియ ” శబ్దాన్ని సమర్థించటం జూడండి. “ అర్థస్ఫూర్తిచెడనంతసేపు సంజ అయినా సంజియ అయినా ఫరవాలేదు. ” ఈ సమర్థం ఎట్లా ఉన్నదంటే సౌందరనందంలో “ మందసు గేసి ” అన్నట్లున్నది. అసలు అర్థస్ఫూర్తి ఎందుకు ? మన సమాధానంలో ఎంత ఉంటూంది ?

చివరకు మళ్ళీ ఆ కావ్యంలోనుంచి ఒకశీర్షిక తీసి దాని సౌందర్యం వివరించటం. ఈ అర్థ వివరణ అట్లా ఉంచి ఇందులో శబ్దాన్నిగూర్చి విచారింతాము. “ ఊర్వశీ ? ప్రేయసీ ! నేడో యుష్మదీయ చరణ కరుణా మధుకణమ్మె దొరకునేమొ ” చరణ కరుణామధుకణమ్మేమిటి ? ఇది భాష ? కరుణా మధుకణము ఇక్కడికి రూపకాలంకారమైంది. దీనికి చరణమునకు సంబంధము ఎట్లా ? చరణాన్ని

*Personify* చేసుకోవాలా యింకా ఏదయినా అర్థం కుదుర్చుకోవాలా ? ఏకదేశరూపకం చేశాము. చరణాబ్జమునందలి మధుకణము అంటాము. చరణాబ్జ మన్నప్పుడు చరణముయొక్క మార్దవాన్ని చెప్పడంలో పర్యవసిస్తుంది. మధుకణం ఏమిచేస్తుంది. చరణ సంబంధగుణాన్ని చెపుతుంది !

“నీ కైశికధ్వాంత నిశబ్దముల్ జీల్చి “నిశ్శబ్దత” అని ఉండవలె. నిశ్శబ్దము తప్పు ఇది తెలియని వారి అభిదాన రాజేంద్రుడి ప్రయోగము చేశారు. ఈ పద్యాలకి సురభిగారు వ్రాసిన వ్యాఖ్యానం పండితులైనవారు గ్రహిస్తారు అన్నీ తన ఇష్టంవచ్చిన అర్థాలే - ఒక్క శబ్దం ఆ అర్థాన్నిపట్టిఈయదు. ఇట్లా ఎంత వ్రాసినా లాభములేదు. శ్రీ కొల్లపిళ్ళ వెంకటశాస్త్రిగారు ఒకప్పుడు కృష్ణశాస్త్రిగారిని గూర్చి ఇట్లా అన్నారు అని సురభిగారు వ్రాశారు ఏమన్నారంటే “నలుడు హంసను విడిచాడు - విదర్భకు వెళ్ళింది - దమయంతిని జూచింది. ఇంతవరకు మేము చెప్పాము. ఇక్కడనుంచి కృష్ణశాస్త్రిగారు చెపుతారు” అనియట.

తరువాత కృష్ణశాస్త్రిగారు, ఏమి చెప్పాలంటే “హంస దమయంతితో చెప్పింది. తరువాత స్వయంవరమైంది. కలి వచ్చాడు” అని. ఇది కృష్ణశాస్త్రిగారు చెప్పాలన్నమాట. మరి చెప్ప గలరుకూడాను. ఈసురభిగారు ప్రచ్ఛన్నులు. ఆయనకువచ్చే ప్రతిష్ఠా ప్రతిష్ఠలు ఏమీలేవు. సమాధానం చెప్పకపోతే నా కున్నవి. అందుచేతనే నేను వ్రాయటం. లేకపోతే ఈసురభిగారి వ్యాసాలకు సమాధానం వ్రాయనక్కర లేదు. ఆయనగారి ధోరణి పండితులకు తెలుస్తూనే ఉంది. ఇంక సురభిగారికిసమాధానం వ్రాయను. ఇదైనా స్థూలంగా వ్రాశాను.



# కలగూరగంప

## పారిజాతాపహరణమునకు మూలగ్రంథము

పారిజాతాపహరణములోని యితివృత్తము భాగవతమునుండి గ్రహింపఁబడినదనియు, నే మూడు శ్లోకములలోనో యిమిడియున్న కథను బెంచి ముక్కు తిమ్మన పారిజాతాపహరణమను ప్రబంధమును రచించెననియు నాగపూడి కుప్పుస్వామయ్య మున్నగు విమర్శకు లభిప్రాయపడిరి. కాని వారియూహ సరియైనది కాదు. పారిజాతాపహరణ కథాకల్పనము నందితిమ్మన యుపజ్ఞ కాదు. కథాసంవిధానమునందును సత్యభామాది పాత్రల స్వభావ శీల పోషణమందును నతఁడొకానొక కర్ణాటక కవి ననుసరించియున్నాఁడు.

ఆంధ్ర కర్ణాటక కవుల పరస్పర పరిచయాదులు నన్నయ నారాయణభట్టుల కాలము నాటివి. జైన బౌద్ధమతములు దక్షిణాపథమున సంతరించిన తరువాతనే యీ రెండు భాషలయందును వైదికమత ప్రతిపాదకములగు గ్రంథములు రచింపఁబడియుండుట గమనార్హమైన విషయము. నన్నయకుఁ దోడ్పడిన నారాయణభట్టు కన్నడభాషయందును బండితుఁడు. నాచన సోమన కన్నడ దేశాంతర్భాగమున సంచరించినట్లును గన్నడ కవులతో సాంగత్యముఁ గల్గియుండినట్లును దద్విరచితములైన శాసన శ్లోకములు ధ్రువపఱచును. శ్రీనాథుని కర్ణాటక దేశ వీరవిహారము సుప్రసిద్ధము. విజయనగర రాజన్యుల కాలమున నీ యుభయభాషా సాహిత్యస్రవంతు లేకమై యాంధ్రమున ననేక కావ్యసస్యములఁ బెంచెను.

రుద్రభట్టను కన్నడకవి క్రీ॥ శ॥ 1180 ప్రాంతమున నివసించియుండెను. అతఁడా భాషయందు దాదాపు రెండువేల పద్యములు కల 'జగన్నాథ విజయ'మను కావ్యమును రచించియున్నాఁడు. విష్ణుపురాణమందలి 5, 6 అంశములందు వర్ణితమైన కృష్ణచరితము నాతఁడు మహాకావ్య రూపమున గ్రాలఁ జేసెను. అందు పారిజాతాపహరణ వృత్తాంతము సమగ్రముగాఁ గనఁబడుచున్నది.

నారదాగమనము, రుక్మిణీ సమక్షమున నాతఁడు పారిజాత ప్రసూనమును శ్రీకృష్ణున కొసఁగుట, కృష్ణుఁడు దాని రుక్మిణి కొసఁగుట, తత్ప్రసవధారణమున నామెకు నపూర్వ శోభ సమకూరుట, నారదుఁడా యవకాశమును గొని సత్యభామ నుపాలంభించుట, తద్దూతిక యా వృత్తాంతమును సాత్రాజితి కెఱింగించుట, ఆమె కుపితయై కోపగృహమునఁ బరుండుట, కృష్ణుఁడు మునిసేవకై ప్రద్యుమ్ను నియోగించి సత్యామందిరమున కరుగుట, యామె చెలికత్తెను జేసన్న వారించి కృష్ణుఁడామెకుఁ దాళవృంతముతో విసరుట, అతినికరము పారిజాత పరిమళమును వెదజలుట, విస్మితయై సత్య తలయెత్తి పరిశీలించి మఱల కినిసి పరుండుట, కృష్ణుని సాంత్వనము, నాకలోకమునుండి పారిజాత తరువునే తెచ్చి యామె కొసఁగఁ గృష్ణుఁడు ప్రతినఁబూనుట, గరుడస్మరణము, స్వర్గప్రయాణము, ఇంద్రోపేంద్ర యుద్ధము, ఇంద్రప్రయుక్త వజ్రమును గృష్ణుఁడు చేతితోఁ బట్టుట :— దాదాపు 200 పద్యములలో రుద్రభట్టు వర్ణించిన యీ ప్రధాన విషయములను గ్రహించి ముక్కు తిమ్మన 509 పద్యములతోఁ గూడిన పారిజాతాపహరణమును రచించియున్నాఁడు.

ఆంధ్రకర్ణాటక రాజ్యసార్వభౌముఁడగు కృష్ణరాయల యాస్థానమునందుండి యాతని కంకితముగాఁ గృతిరచించిన తిమ్మన కన్నడ జగన్నాథ విజయమును జదివియేయుండునని మన మొప్పుకొనకున్నను, ఆ భాషయందుఁ జాలకాలమునుండి సుప్రసిద్ధిఁ గాంచిన పారిజాతాపహరణ వస్తువును వినియైనయుండునని మనమంగీకరింపక తప్పదు. జగన్నాథ విజయములోని కొన్ని పద్యములను గూడ తిమ్మన యాంధ్రీకరించియున్నాఁడు. కథలో కొన్ని మార్పుకూర్పులు సల్పఁబడియున్నను, మొత్తముమీఁద జగన్నాథ విజయమే యాంధ్ర పారిజాతాపహరణమునకు మూలగ్రంథమనుటలో సందేహము లేదు. తిమ్మన యనుసరించిన కొన్ని కన్నడ పద్యములను జూతము :—

ఇముకృతకాద్రి యప్పుడు,
వనావళి యప్పుడు, పద్మషండము
ప్పుడు తిలిరుయ్యాలప్పుడు,
లతాగృహముప్పుడు, రత్నదీప మ
ప్పుడు, మధుమాసముప్పుడు,
నవోజ్జ్వల చంద్రిక యప్పుడింతిదా
గడ తెఱనిల్లినొందు కుసుమం
బగు నిక్క మభీష్టసిద్ధియుం.

(నారదుఁడు పారిజాత పుష్పము నిట్లు వర్ణించు చున్నాఁడు) ఈ పువ్వు కృతికాద్రిగను, వనావళిగను, పద్మషండముగను, లతాడోలికగను, లతాగృహముగను, రత్నదీపముగను, మధుమాసముగను, నవోజ్జ్వల చంద్రికగను నగుచుండును. నింతి మభీష్ట సిద్ధిఁ గల్గించుచుండును. ఇది పై పద్యముయొక్క భావము.

"అలినీలాలక! నీవు నీ పతి రహస్యక్రీడ వర్తించువేళ ·

అడిగిన యంతలోన సరసాన్నములన్ సమకూర్చు",

"నెలకొని వేసవిఁ జలువయు." ఈ పద్యములు కన్నడ పద్యమునకు మెఱుఁగుఁ బెట్టినట్లున్నవి. అట్లే 'కువలయ పత్రనేత్ర! నెఱిగొప్పున నీకు సుమంబు దాల్చుటన్' అనుపద్యమునకు నీ క్రిందిది మూలమైనట్లుఁ దోచును.

"తెడవేం పుణ్కగె దివ్యం,
బడినం గుక్మిణిగెయొళ్లిదం హరి మొఱెదుం
గడ సత్యభామెగెఅగం
ముడిగిక్కిద నాగ్రతెకొళ్లిం ఖెమెంగ్."

'ఇన్ని దినంబులున్ సవతులిందఱిలో', 'చక్కని దానవంచు' అను పద్యముల కాధారము:—

"అబలెయ రోళ్ సుయాగ్యంపళ్,
సొబగింగా సత్యభామె బేడింతెనగా
సొబగీయలరం ముడిదగె,
సొబగళచ్ఛత్రమాయు భీష్మక సుతెయా.

ఈ విధమున జగన్నాథుని నారదుఁడును, ముక్కు తిమ్మన నారదుఁడును, కలహప్రియత్వము నందును వాక్చాతుర్యమునందును నొకరినొకరు మీఱు చున్నారు.

కృష్ణుఁడు పుష్పమును భీష్మక సుతకొసఁగెనని విని "అందఱిలోనఁ బెద్ద మహిమాన్విత రుక్మిణి గాన పూవు గోవిందుఁడు దానికిచ్చెఁ దగవేయని లక్షణ యోర్చె, సైచెఁ గాళింది, శమించె భద్ర, యపులెమ్మని యూరడిల్లె సుదంతి, లోఁగొందుట మానె జాంబవతి కోపముడంచెను మిత్రవిందయున్."

"బగవందీసొబగీ మహోత్సగు
చితం ప్రద్యుమ్ననం తెప్పె
రమ్గనం పెత్తె మహత్వదగ్రమ
హిషీసంపత్తియిం తళ్దిదీ
కెగె లక్ష్మీవనితావతారెగెను
తుం మిక్కంగ నావృంద మీ
ర్ష్యెగళం మాణ్దిరె, సత్యభామె
తళెదళ్ సౌభాగ్యమాత్సర్యమం"

(ప్రద్యుమ్ను నంతటివానిఁ గన్నట్టియు, నగ్రమహిషీ సంపత్తిని దాల్చినట్టియు, లక్ష్మీ వనితావతారమని ఖ్యాతికెక్కినట్టియు నీమెకు నా విరి నొసఁగుట యుచితమని మిగిలిన యంగనావృందము నీర్ష్యల నొనరింపకుండఁగా, సత్యభామ సౌభాగ్యమాత్సర్యమును బూనెను) ఈ పద్యమొక్కటియే తిమ్మన రుద్రభట్టు ననుసరించెనని ఋజువు జేయఁగలదు. ఇట్టి వసంఖ్యాకములు కలవు.

తిమ్మన స్వాతంత్ర్యము వహించి కొన్నిచోట రుద్రభట్టు కథను బెంచియున్నాఁడు. ఆంధ్ర ప్రబంధమునఁ గృష్ణుఁడు దేవమాతృ దర్శనమును సాకును గల్పించుకొనియున్నాఁడు. జగన్నాథ విజయమునఁ గృష్ణుఁడు గరుడారూఢుఁడై సూటిగా నందనోద్యానమున కేగియున్నాఁడు. అదితి దర్శనమును నింద్రసత్కారమును తిమ్మన కల్పితములు కానీ యవి కృష్ణుని ధీరోదాత్తతకు భంగకరములు. మహేంద్ర సత్కారమును బొంది యాతనికిఁ దెలుపక కాపట్యమున నందనవనమును జొచ్చుట యుత్తమ కావ్య నాయకునకనుచితము. అనౌచిత్యముకంటె రసభంగకర మింకొకటి లేదని యాలంకారికుల నిర్ణయము. రుద్రభట్టు కృష్ణుఁడు వీరోచితముగా నందనవనముపై దాడి వెడలుట యెంతయు యుక్తముగాఁ గనఁబడును.

ఇంద్రోపేంద్ర యుద్ధమునుగూర్చి నీ యిరువురును సుదీర్ఘముగా వర్ణించియున్నారు. ఇంద్ర ప్రయుక్త కులిశమును గృష్ణుఁడొడిసి పట్టినంతటనే రెండు గ్రంథములందును యుద్ధము ముగియుచున్నది.

జగన్నాథ విజయమందలి సత్యకు మెఱుఁగు పెట్టఁదలఁచి తిమ్మన కొన్ని మార్పుల నొనరించెను కాని యవి యెంతమాత్రమును రసపోషకములు కాకున్నవి. సత్య పారిజాత వృక్షమును గోరియుండినఁ గృష్ణుఁడు కాదనియుండునా? పాపము! "జలజాతాసన వాసవాది సురపూజాభాజనంబై తనర్చు లతాంతాయుధుఁగన్న తండ్రి శిరమున్ నా వామపాదమునఁ దన్ను నవసర మేమున్నది? ఎంత గయ్యాళియైన నిట్టి యకృత్యమునకుఁ బూనునా?

కృష్ణుఁ డొనరించిన గొప్ప యపరాధమైన నేమి? ఆమె స్వార్థపరత్వము కుంఠితత్వము కాదు. ఆ సమయమున నామె యేడ్చిన కల్లబొల్లి యేడ్పులు కథావేగమును కుంటుపడఁజేసి వస్త్వైక్యమునకు నిరోధము గల్గించుచున్నవి. నాయికా నాయకులందు కుంఠితత్వము కాని బలహీనతను, లోపమును, లజ్జారాహిత్యమును ప్రదర్శించుట తప్ప నీ సన్నివేశమువలన నే ప్రయోజనమును సిద్ధింపదు. తిమ్మన సమకాలికుల యభిమతి మెట్టిదైనను, కృష్ణరాయలు విని చదివి యెంత యానందించినను నీ ఘట్టము తిమ్మన కొక లోపమని యొప్పుకొనక తప్పదు.

జగన్నాథ విజయమున సత్యయొక్క ప్రణయ కోపమును, కుపితయై యామె యనిన పలుకులును వీర రసోద్దీపకములుగా నున్నవి. తన యంతఃపురమునఁ బారిజాత తరువులేకుండుట యొక లోపమని కృష్ణుఁడు గ్రహించినాడు. యుద్ధమున మహేంద్రుని జయించి యాతరువునే తెచ్చుటకుఁ బురికొల్పుచున్నవి సత్యపలుకులు. ఈ సందర్భమున రెండు పద్యములఁ జూతము. కృష్ణుని సాంత్వనోక్తుల విని సత్య యిట్లనుచున్నది:—

"నీనవమానిసి తల్లద
తానా రుక్మిణియముందె నారదునెన్నం
నానావిధదిం పతిడనచేను
చితమె మునికి దేక రాగద్వేషం."

(నీవు నన్నవమానించుటయే కాక రుక్మిణియెదుట నారదుఁడు నన్ను నానా విధములఁ దెగడెను. అది యుచితమే? మునికి రాగద్వేషములేల?)

"అభినవ వస్తువం ప్రియెగ
రుక్మిణిగిత్తు వృథోక్తియిందలే
విభు తెలివల్కు చేస,
పెఱసా రెనగీభవవిం పోగుదీ
యభిభవదింద మిన్నినగె భాగ్యయ
పేరిభవాంత రక్కువ
ల్లభెనిన గప్పెనక్కునగె
నీందయాగెయ్యత పక్కనుజ్జెయం"

(అభినవ వస్తువును ప్రియురాలగు రుక్మిణికిచ్చి యిచట వృథోక్తుల నాడకుము. ఈ జన్మమభిభవముతో నీ రీతిగఁ బోవుఁగాక. భావి జన్మమునైన నీ పరిపూర్ణానురాగముఁ బడయుటకుఁ దపము సల్పనరిగెదను. తపముఁజేయుటకు ననుజ్ఞను దయతో నాకొసంగుము.) సత్యభామయొక్క స్వభావశీలము లెంత సముచితముగాఁ బోషింపఁబడినవి! శ్రీకృష్ణుని యందు వీరరసముద్దీపింపఁ జేయుటకు పాదప్రహారము కంటె నీముగ్ధవచనములు సమర్థతరములు గావా?

నారదాగమనమును వర్ణించునపుడు ఈ కవి చాలవఱకు మాఘు ననుసరించి యున్నాఁడు—ఉదాహరణముగా.

సరిగమ పధనిస సంజ్ఞ స్వరంబుల
మహతి నభోవాయు నిహతి మెఱయ.

రణద్భిరాఘట్టనయా నభస్వతః
పృథగ్విభిన్నశ్రుతిమండలైః స్వరైః
స్ఫుటీభవద్గ్రామవిశేషమూర్ఛనా
మవేక్షమాణం మహతీం ముహుర్ముహుః.

ఇట్టివెన్నియో కలవు.

తిమ్మన పాత్రలయందు ప్రత్యేకత కాని వైవిధ్యము కాని కానరాదు. అపూర్వవ్యక్తులను సృజించుటలో బెద్దన యీతనికంటె సర్వవిధములఁ బెద్దయే. నాటక కళాచాతుర్యము కూడ పారిజాతాపహరణమున గానరాదు. ఈ కారణములవలన నే దీనికి వ్యాప్తి చాల తక్కువ.

తిమ్మన ముద్దుపలుకులు మాత్రము నిరుపమానములు. లలిత సమాసములతోడను, ద్రాక్షాపాకముతోడను కవితాలతి సాగియున్నది. ఈ గ్రంథము విజయనగర సంస్కృతిని జూపు దర్పణము.

బి. నం. రావు.

# శ్రీరాయప్రోలు సుబ్బారావుగారి కవిత

★

శ్రీ పి. గణపతిశాస్త్రి

ఆధునాతనాంధ్రకవిత్వమార్గంలో అయిదారుగురు అగ్రగణ్యు లున్నారు. విషయవైవిధ్యము, గభీరప్రతిభ, కవిత్వమార్గంలో క్రొత్తతెన్నులు వెలయింపజేసిన స్వతంత్ర సృజనశక్తి మొదలైన గుణాలనుబట్టి వీరందరికీ ఈ అగ్రగణ్యతా తాంబూలం లభిస్తుంది. ఇలాగ అగ్రగణ్యులయిన ఉత్తమకవులను లెక్క పెట్టడం మొదలుపెట్టేసరికి ఎలాంటి సామాన్య విమర్శకులకయినా శ్రీ రాయప్రోలు సుబ్బారావు గారి పేరే వరసలో అప్రయత్నంగా స్ఫురణకు వస్తుంది.

అయితే కొందరింకా ముందుకువెళ్లి ఆధునాతనాంధ్రకవిత్వం ఒక ప్రస్థానంగా ప్రవర్తింపజేసిన ప్రథమకవి రాయప్రోలువారే అని అంటారు. మరికొందరు గురజాడకవికే ఈ గౌరవం దక్కుతుందని వాదిస్తారు.

ఇక్కడ 'ఆధునాతన ఆంధ్రకవిత్వం' అనే పదం పరిమితము, ప్రత్యేకము అయిన విశేషార్థంలో వాడుకుంటున్నాము. కేవలం కాలపౌర్వాపర్యంవల్ల ఈ ఆధునాతనత్వం నిర్ణయించడానికి వీలులేదు. శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రిగారు, ఇంకా ఈనాటి మరికొందరు కవులు సంప్రదాయమార్గంలో కావ్యాలు రచిస్తూనే ఉన్నారు. అయినా వీరెవరినీ మనం ఆధునాతనకవుల్లో పరిగణించము. స్థూలంగా భాషలోను, పలుకుబడిలోను, వస్తుస్వీకరణంలోను, ఛందోరచనంలోను, భావనావేశంలోను, ప్రాచీన సంప్రదాయఫణితి విడిచిపెట్టి క్రొంగ్రొత్తరీతుల్లో వెల్లివిరిసిన కవిత్వమంతా ఆధునాతనకవిత్వప్రస్థానంలోకి వస్తుంది. ఈ విస్తృతమైన నూత్నకవిత్వానికి నాందీ ప్రస్తావనచేసిన నవ్య కవితాచార్యులు ముగ్గురు. కేవలం కాలాన్నిబట్టిచూస్తే గురుజాడ అప్పారావు గారు వీరిలో ప్రథమగణ్యులు. తిరుపతి వేంకటకవు లిద్దరినీ ఒకే కవితావతారంగా పరిగణిస్తే వీరుకూడా నవ్య కవిత్వ మార్గానికి వెలుగు చూపించినవారే. ఇక మూడవవారు రాయప్రోలు సుబ్బారావుగారు.

తిరుపతి వెంకట కవుల కవిత్వం వచ్చేవరకు సాంప్రదాయికకవిత్వం చాలావరకు సన్నగిల్లి శ్లేషయమకాద్యలంకార శృంఖలాల్లోను, క్లిష్టమైన నాగబంధాది బంధనాల్లోను చిక్కుకుని శల్యావశిష్టమై కొనఊపిరితో నిలబడి ఉంది. తిరుపతి వెంకట కవుల కవిత చాలావరకు సాంప్రదాయికమార్గంలోనే నడిచినా, అంతవరకు రాజాస్థానాల్లోనే పడి మూలుగుతున్న తెలుగుకవిత వీరి ఆశుధారా ముక్తకంఠంతో ప్రజాసదస్సులల్లోను, నాటకరంగాల్లోను ప్రవేశించి ఉత్సాహావేశాలతో ప్రజానీకం హృదయాలు ఉర్రూత లూగించింది. కవిత్వంలో ఏదో క్రొత్త వెలుగు, వెచ్చదనము, హాయి ప్రవేశించినట్లయింది. ఈ విధంగా నవ్యకవితకు నూతనచైతన్యం కలిగించిన గౌరవం ఈ మహనీయు లిద్దరికీ దక్కుతుంది.

నిజానికి ఈ ముగ్గురిలో ఎవరో ఒకరుమాత్రమే నవ్యకవిత్వానికి నాందీ ప్రస్తావన చేశారనడంకంటె ఈ ముగ్గురు మూడువిధాలుగా నవ్యకవితకు ప్రోత్సాహం కలిగించారనడమే న్యాయ్యము. కొంచెం కాలపౌర్వాపర్యం ఉన్నా ఈ ముగ్గురూ నవ్యకవితాప్రస్థానానికి ఆంధ్రకవితకు ఆద్యులయిన కవిత్రయంవంటివారని పరిపోల్చవచ్చును.

తిరుపతి వేంకట కవుల ముక్తకంఠాహ్వానంతో మూలమూలల దాగిఉన్న ఆంధ్ర కవితావిహంగం విశాలమయిన ప్రజాహృదయాకాశంలో విహరించడం మొదలు పెట్టింది. అయితే గురజాడ, రాయప్రోలు కవుల కవితావతారంతో మన కవిత ఇంకా వినూత్నమైన కవితామార్గాలకు దారి తీసింది.

గురజాడ కవి, అప్పటిదాకా పండితులీసడించే, వ్యావహారిక మార్గంలో కవిత్వం పలికించి, ఆ విధమైన కవిత్వానికి ప్రారంభకుడైనాడు. ఈయన సాంప్రదాయికమార్గంలో 'సుభద్ర' అనే కావ్యం రచించినా అది నవ్యకవిత్వానికి నాందీ పాఠంగా ఎవరూ స్వీకరించలేదు. ఈయన రచించిన ముత్యాల సరాలే నవ్య కవనానికి క్రొత్త దారి చూపించాయి. గురుజాడ కవి అప్పటి దాకా పల్లీయుల కంఠాలలోనే మారుమ్రోగే దేశీయ గేయచ్ఛందస్సు కొంచెం మార్చి ముత్యాల సరం రచించి, వ్యావహారిక భాషలోకూడా ఉదాత్త కవిత్వం పలుకుతుందని సప్రమాణంగా నిరూపించాడు. ఈయనది దేశి సంప్రదాయానికి చెందిన కవిత. ఇది సాంప్రదాయికమయిన కావ్యభాష, అలంకారపరికరము విడిచివేసి కేవలం నగ్నంగా సూటిగా వచ్చి మన గుండెల్లోకి దూసుకుపోతుంది. ఈయన వ్రాసిన ముత్యాలసరాలు చాలా తక్కువే అయినా ఇవి ఆ తరవాత వచ్చిన కవుల కొందరినో దేశిమార్గంలోకి

మళ్ళించాయి. బసవరాజు అప్పారావుగారు, నండూరి సుబ్బారావుగారు, కొంచెం ధోరణి మారినా శ్రీరంగం శ్రీనివాసరావుగారు, ఇంకా ఇటీవలి అభ్యుదయకవులు పలుకుబడిలో చాలావరకు గురజాడ కవి అడుగుజాడల్లో నడిచినవారే. ఈవిధంగా ఈయన నేటియుగమైన నవ్యకవితామార్గానికి ప్రథమాచార్యుడైనాడు.

అయితే గురజాడ కవి ముత్యాలసరాల కూర్పులన్నీ పరిశోధనలస్థాయిలోనే నిలిచిపోయాయిగాని అంతకంటె ఉన్నతమైన కవితాస్థాయి వాటికి రాలేదు. ఈయన వ్రాసిన ముత్యాలసరాలలో చాలా వాటిలో ఒక స్థిరమైన నడవడి కనబడదు. 'దించు లంగరు' వంటి రెండు మూడు రచనలలో తప్ప కవితారచన కూడా అంత పరిణతి చెందినట్టు కనబడదు. కథకుడుగా, రూపక రచయితగా, వ్యాస రచయితగా ఈయన చూపించినంత నైశిత్యము, ఉన్నతి కవిత్వంలో కనబడవు. అయినా ధీరకవితాదృష్టితో ఒక వినూత్నమైన నవ్యకవితా ప్రస్థానం వెలయించడం వల్ల ఈయన నవ్యకవిత్వానికి 'గురజాడ వాల్మీకి' గా వెలిసి చిరస్మరణీయుడైనాడు.

గురజాడ కవి ఆధునిక కవితా ప్రస్థానంలో దేశి మార్గానికి ప్రథమాచార్యుడైతే రాయప్రోలువారు ఆధునిక కవిత్వంలో మార్గ కవితాప్రస్థానానికి ఆద్యులయినారు. ఈయన తమ కవితలో ఆంధ్రకావ్యాలలో అనూచానంగా వస్తున్న కావ్యభాష పరిహరించలేదు. నన్నయకాలంనించీ అవిరళంగా ప్రవహిస్తున్న తెలుగుభాష ఈయనలో ఒక నూతన కవితాప్రవాహంగామారి నవ్య మార్గకవితకు మంగళ ప్రబోధ గీతికగా వెలిసింది.

గురజాడ రాయప్రోలు కవు లిద్దరిలోను తిరుపతి వెంకటకవు లిద్దరికంటె ఎక్కువ నవ్యత కనిపిస్తుంది. తిరుపతి వెంకటకవులకంటె వీరిద్దరు ఆధునికుల కెక్కువ దగ్గరగా ఉన్నట్టు కనిపిస్తారు. వీరిద్దరు సంస్కృతాంధ్ర కవితా వాఙ్మయాలేకాక పాశ్చాత్య కవితామార్గాల లోతులుకూడా బాగా ఆకళించుకొన్నవారు. కనకనే వీరిద్దరు నవ్యుల కింతగా దగ్గిరికి వచ్చిఉంటారని తోస్తుంది. వీరిద్దరి భావనా పద్ధతి పరిశీలిస్తే వీరి ఫణితిలో పాశ్చాత్య కవితా ప్రభావచ్ఛాయలు బాగా స్పష్టంగా గోచరిస్తాయి. అయితే ఇద్దరు జాతీయమైన స్వీయ ప్రతిభాప్రభావం వల్ల నవ్యకవితారంగంలో స్వతంత్రకవులై కవిత్వంలో ప్రత్యేక ప్రస్థానాలు వెలయించారు.

రాయప్రోలు సుబ్బారావుగారుకూడా చిన్నతనంలో ఆకాలంలో బాగా పరిపాటిలో ఉన్న ఆశుకవితాది వినోదాల్లో పాల్గొన్నవారే. బుచ్చిరెడ్డిపాలెంలో ఒకనాడు ఆ 'వేగాతివేగోక్తి దుర్వ్యసనం' మీద విరక్తిపుట్టి ఈ క్రింది రచనలతో ఆశుకవితాసన్యాసం చేశారు.

"తెనుగే తీయనిదంగు పద్యపద
 రీతి క్రీడ లత్యంతమో
హనముల్, శోభనముల్ తదీయ రస
 రక్తాలాపనంబుల్ లభిం
చిన వాగర్థ కలా కలాప జయలక్ష్మిన్
 గాలికింబుత్తునే
జననీ, యేమిటి కింక ఆశుకవితా
 సన్యాస మిప్పింపవే!"
"రసమో భావమొ జీవవర్ధ
 సుకుమారవ్యారజనా మంజుళశ
బ్దసమాసారచనంబొ, సాధు హృదయ
 స్పంద ప్రతిష్ఠాకథా
విసరంబో సకలార్థ శూన్యము గ
 నీ వేగాతివేగోక్తి దు
ర్వ్యసనం బేటికి? త్రిప్పు మింక
 జననీ! రసాత్మకత శ్రేణికిన్"

రాయప్రోలు సుబ్బారావుగారికి సాంప్రదాయికమయిన సంస్కృతాంధ్ర వాఙ్మయాభ్యాసమే కాక, శాంతినికేతనంలో రవీంద్రుని అంతేవాసిత్వ భాగ్యంకూడా లభించింది. ఆరోజుల్లో గాలిలోనే కొంతకొంత పాశ్చాత్య కవితాప్రాభవం వ్యాపించింది. ఇన్నివిధాలుగా వివిధదేశీయములయిన ఆశయచ్ఛాయలు ప్రసరించినా పెద్దారులు తొక్కక వారికవిత జాతీయమైన తీయని తెనుగు బాణీలో నూతనమార్గం వెలయించింది.

శ్రీ సుబ్బారావుగారిది కొందరి అధునాతనుల రచనలాగ ఏకతార కవిత్వంకాదు. వీరి కవితావాహిని ప్రేమగాథగా, కథాకావ్యంగా, ఖండకృతిగా, గేయమాలగా, తాత్త్వికకవితగా, దేశభక్తి ప్రబోధ గీతికగా, ఆంధ్రీకృతిగా అనేకమార్గాలలో వెల్లివిరిసింది. ఇప్పటిదాకా వీరు ప్రకటించినవి పదిపన్నెండు కావ్యాలదాకా ఉన్నాయి. ఈకృతులన్నింటినిగురించీ సమగ్రసమీక్ష చెయ్యడం ఈ వ్యాసోద్దేశ్యం కాదు. సూక్ష్మంగా రాయప్రోలువారి కవితాస్వభావ ప్రదర్శనమే దీని లక్ష్యము.

వీరు రచించిన కృతులలో మాధురీదర్శనము, రమ్యాలోకము, స్వాదుకవిత్వమార్గంలో కవి కవితా తత్త్వం వివరించే గ్రంథాలు. స్వప్నకుమారం కేవలం తాత్త్విక కవిత కాదుగాని, చాలావరకిదికూడా ఈ పరిగణనలోకే వస్తుంది.

తృణకంకణము ప్రేమప్రధానమయిన కావ్యము. తెనుగుతోట, ఆంధ్రావళి, జాతీయ దేశీయాభిమానం

ప్రబోధించే కావ్యాలు. వీటిలో ఆంధ్రావళి కొన్ని ఖండకావ్యాల సంపుటి. స్నేహలతాదేవి, కష్టకమల కథాకావ్యాలు. జడకుచ్చులు, వనమాల, ఖండకావ్య సంపుటాలు. మధుకలశము, ఉమర్ ఖయ్యాంకృతికి ఆంధ్రీకృతి. ఇంకా 'వనమాల'లో శంకరభగవత్పాదుల సౌందర్యలహరిలోని కొన్ని శ్లోకాలకు ఆంధ్రీకరణాలుకూడా ఉన్నాయి.

ఒక కవి కావ్యసమీక్ష చెయ్యదలచినప్పుడు- ఆ కవి ప్రతిపాదించిన జీవితలక్ష్యాలు, అభినివేశాలు, తాత్త్విక సిద్ధాంతాలు పరిశీలించి ఆ కొలబద్దల ప్రకారం ఆ కవి కృతకృత్యత నిర్ధారణచెయ్యడమే సమంజసమైన మార్గము. అంతేగాని కేవలం విమర్శకుల ఆశయావేశాల ముద్రలతో కావ్యవిమర్శలోకి దిగితే మొదటికే మోసంవస్తుంది. అందుచేత ముందుగా వీరు రమ్యాలోక మాధురీదర్శనాల్లో ప్రతిపాదించిన కవితాలక్ష్యాలనుగురించి కొంచెం వ్రాస్తాను.

## మాధురీదర్శనము - రమ్యాలోకము

ఈ కృతులు రెండింటిలోను శ్రీ సుబ్బారావుగారు తమ కవితాదర్శాలు విపులంగా వివరించారు. ఈ సిద్ధాంతాలన్నీ చాలావరకు ఆలంకారికుల మార్గంలోనే నడిచిపోతాయి. ఆదర్శప్రేమ వీరి పరమలక్ష్యము. అది కామావేశ శూన్యమైనప్పుడే పరిపూర్ణంగా పరిణమిస్తుంది. దంపతీనిష్ఠమైనప్పుడది సంతాన సాధనమై గృహస్థస్థితికి, లోకమాంగల్యానికి ఆధార స్తంభంగా నిలబడుతుంది. వీరి సిద్ధాంతంలో కవి విరాగి కాడు. పంచభూతాత్మకమయిన ప్రకృతి అతని ఉపాస్య దేవత. ఇంచుమించుగా ఈ అభిప్రాయాలే వీరు క్రింది గీతికలలో పొందుపరిచారు.

చిన్ని నివ్వరి సిగవలె సన్నగా తి
ళుక్కుమన నాత్మ లక్షించెనొక్క ద్రష్ట
నన్యతృణకంకణాభిరణప్రయుక్తి
ప్రేమయోగ మొక్కండు భావించె నేడు.
కానబడ కనుమాన ప్రమాణమునక
అంది యందని పరతత్త్వ మవల నునిచి
పంచభూత భాసితమైన ప్రకృతికళను
సన్నిహిత లక్ష్యమనియె వచస్వినేడు.
అందు నీ విలక్షణ జీవయాత్రకోదవు
పృథివి నే నవ్యులు సమాశ్రయింత్రు భక్తి
తల్లిగా, ధాత్రిగా, దేవతామ
తల్లిగా సమస్త పరాపర కామ్యములకు

—రమ్యాలోకము.

ఇవిగాక కావ్యకళకు సంబంధించినది వేరొక సిద్ధాంతం ఉన్నది. కేవలం జీవితంలో స్వతః రమ్యములైన విషయాల వ్యంజనద్వారాగానే సౌందర్యారాధనచేయడము, తద్వారా అమృతస్వరూపమైన ఆనందప్రాప్తి, వీరి పరమలక్ష్యాలు. ఒకవేళ ఏదైనా పుల్లివిస్తరాకువంటి అసహ్యమైన వస్తువుమీద వీరి లేఖిని ప్రసరించినా దానికి సంబంధించిన సౌందర్యారాధనమే వీరి పరమలక్ష్యము. 'పులియాకు' అనే శీర్షికతో వీరు రచించిన కవిత వీరి కవితాదృష్టికి నికషోపలంవంటిదని చెప్పవచ్చును. ఈరచనలో వీరి కవితాదృష్టి సమగ్రసౌందర్యంతో మన కళ్లయెదుట సాక్షాత్కరిస్తుంది. ఆ రచనలోని రెండు పద్యాలు మాత్రమే ఇక్కడ ఉదాహరిస్తున్నాను.

"చైత్రుడు ముగ్గులాడుటకు
సాగిలి వ్రాలిన బాల్యరేఖలున్
రాత్రుల చందమామ నిను
రాగిలి డాసిన పచ్చిప్రాయమున్
చిత్రముగా నదృష్ట సరణిం బడి
రూపఱె; కాని భావనా
సూత్రమునందు మాయవని
చోద్యముగా పులియాకు బిత్తళీ!
ఏనుత్తెనువ మేని చాయగృహమున్
హేమింప, కళ్యాణ పీ
యూషమాధుర్యంబు కపోలదీధితుల
స్నిగ్ధస్నిగ్ధముల్ చేయ, నా
నామాధుర్యరసానుపాక చయమున్
వడ్డించెనో నీపయిన్
ఏమై పోయెనొ నాటి భోగముపేమా
హేవాక పత్రావళీ!"

కాని ఒకమాట. వీరి మాధుర్యదర్శనంలోని సిద్ధాంతాలు అద్వైత వేదాంతదృక్పథంప్రకారం సమన్వయించవచ్చునేమోగాని కేవలం అలంకార శాస్త్రదృష్టితో చూచినప్పుడు మాత్రం ఈసిద్ధాంతం నిలబడదు. ఆలంకారికులు లౌకికజీవితంలోని వస్తువులు రమ్యములైనా, అరమ్యములైనా కవికి ఉపాదేయములేననీ అలౌకికమయిన రసస్థితిలో అవి సహృదయునికి ఆనందాత్మనా పరిణమిస్తాయనీ నిర్వచించారు.

దశరూపకంలోని ఈ క్రింది శ్లోకంలో ఇది విస్పష్టంగా వినిపిస్తుంది.

"రమ్యం జుగుప్సిత
ముదార మథాపినీచమ్
ఉగ్రం ప్రసాది గహనం
వికృతం చవస్తు
యద్వాప్యవస్తు
కవిభావుక భావ్యమానం
తన్నాస్తి యన్న రసభావ ముపైతిలోకే."

దశరూపకకారుడీ శ్లోకంలో కావ్యవస్తువు రమ్యమైనా, జుగుప్సితమైనా ఇంకా ఎలాంటిదైనా

కవి భావుకులచే భావ్యమానమై రసభావం పొందుతున్నదని ముక్తకంఠంతో ప్రతిపాదించాడు.

అలంకారికులసిద్ధాంతాలకు కొంచెం విభిన్నమైన తమ మాధురీసిద్ధాంతం ప్రతిపాదించడంకోసమే సుబ్బారావుగారీ గ్రంథాలు రచించినట్లు కనిపిస్తుంది. కవులందరు ఆలంకారికుల అడుగుజాడల్లోనే నడవాలని ఎవరూ శాసించలేరు. అయితే రాయప్రోలువారి కవితావగాహనకుమాత్రం ఈ రెండు గ్రంథాలు బాగా సహకరిస్తాయి. వారి దృక్పథం అంతా ఈక్రింది కందంలో క్రోడీకరించుకోవచ్చును.

కలదంటొ నిత్యసుందర
లలితాలంబన మనంత లావణ్యసము
జ్వలహస్తముకటి, తన్మ్రం
గళాభినయమూపణంబె కావ్య కళ బుధా!"

—మాధురీ దర్శనమ్

## తృణకంకణము

సుబ్బారావుగారి కవితాపరిణతి తృణకంకణంలోను, ఇంకా ఎక్కువగా స్వప్నకుమారంలోను బాగా విస్పష్టంగా కనిపిస్తుంది. తృణకంకణంలో యువకుడొకడు ప్రియురాలికి తన పునీతప్రేమ చిహ్నంగా ఒక తృణకంకణం సమర్పిస్తాడు. సంగ్రహంగా దీనిలోని ఇతివృత్తం ఇంతే. అయితే ఈ కావ్య ప్రారంభంతో నేటి ఆంధ్రకవిత్వంలో ఒక క్రొంగ్రొత్తనుడికారము, వినూత్నమైన కథావస్తువు, పదపదార్థవిన్యాసము మొదలైన ఆధునిక కవితా భంగిమలన్నీ ప్రారంభమైనాయి. ఇది మొట్టమొదటగా ౧౯౧౩లో ప్రకటించిన కావ్యము. దీనిమీద ఆరోజుల్లో అనేకవిధాలుగా గాలిదుమారాలు బయలుదేరాయి. ప్రతీభాషలోను నీరసమైన ప్రాచీనపద్ధతికి స్వస్తిచెప్పి యువకవులొక నూతనమార్గం ప్రారంభించేసరికి ఇలాంటి గాలిదుమారాలు బయలుదేరడము, అవి క్రమంగా సమసిపోవడము పరిపాటిగా జరుగుతున్న విషయాలే. ఈ కావ్యంలో, కథాకథనరీతి, వర్ణన, పలుకుబడి అతినవీనంగా ఉండడంవల్ల ఆకాలంలో ఇది మరింత విడ్డూరంగా కనబడి ఉండవచ్చును. ఈ కావ్యంలో యువతీవర్ణనపద్ధతే ఒక వినూతన ధోరణిలో నడిచింది.

"చేల చెఱంగునన్ మొగము
చెమ్మటలొత్తు, చెయిం బెనంచు నీ
లాలకముల్ మొగమ్ముగపియన్
బయికద్దెను దిద్దు, మోవిపై
ప్రేలిడి సోలకించు, మురిపెంపు
కనుంగవ నించు వాలికల్
[illegible]జూచు నెద్దిరొ
మదిం దలపోయు ననేకరీతులన్.

యువకునిహృదయానుతాపస్ఫోరకమైన ఈ క్రిందివృత్తము ఈ కావ్యంలో సుబ్బారావుగారి వృత్తరచనాశక్తి కొక చక్కని ఉదాహరణ.

"క్రమమని యక్రమంబని
పరస్పర భిన్నమనోవికారసం
భ్రమముల గొన్ని నాళ్లు వలవంతల
గ్రుక్కెడు దాళుకొంటి నా
కమలదళాక్షిపై మమత,
గాలమె యాసల గ్రసించె నో ప్రా
యమును గ్రసించు తాపమున
మక్కువ! మిక్కిలి శల్యశేషముల్ !"

తృణకంకణం నైరాశ్యం వర్ణించే ఈ వృత్తంలోని కవితాపరిణతి మరింత మనోజ్ఞంగా వినిపిస్తుంది.

"చెంతలవంగ వల్లికల చే
గసెలల్లి, కుమారశాద్వలా
క్రాంతములైన పాదులకు గట్టిగ
చల్లని నీరు వారు కు
ల్యాంతములన్ పెరుంగు తగుణాగ్రి
తృణాంకురపాళిగిల్లి, యా
కాంతుకు వింతయైన యొక
కంకణమున్ రచియించె నింపుగన్."

## స్వప్నకుమారము

స్వప్నకుమారంలో కవి కొక సుందరి సాక్షాత్కరించి అతనికి ప్రేమజీవితరహస్యాలు వివరిస్తుంది. సంగ్రహంగా ఇదే దీనిలోని కావ్యవస్తువు. దీనిలోని కవిత తృణకంకణకవితకంటె బాగా పాకంలో పడింది. ఈ క్రింది వృత్తాల శైలిదీనికి తార్కాణము.

"చెలియా! పుష్యాగరాని బూవు పొద
బూచెం గ్రొత్తపుష్పమ్ము మా
పులనీగత్తెకి ముగ్ధడొక్కడు
తలంపుల్ నిల్పె నా మొగ్గపై
చెలువమ్మున్ వలపున్ దదాదిగ
వృథా జీర్ణించి, నర్తించి శో
షిలి శాంతింపగనున్న వేమిగలదో!
చెప్పంగ ప్రేమావధిన్"

"కెలకులబారు మున్న కులికింపు
సౌనల్ గనుగంట జూచుచున్
తొలకరి పూతబూచిన
మనోజ్ఞపు దీవలపూలు గిల్లికొం
చలసగతిన్ విలాసములయాన్
మెలమెల్లన బోయె ఓల్చినం
బలుకక యా శుభాంగి తలవంచి
ముసుంగులు జార నీడ్చుచున్."

## ఆంధ్రావళి - తెనుగుతోట

రాయప్రోలు సుబ్బారావుగారి రచనలలో జాతీయ ప్రబోధకవిత ఒక ప్రత్యేక విభాగంగా కనిపిస్తుంది. సుమారు ముప్పయియేళ్ళకు పూర్వమే వీరి కవిత ఆంధ్రులలో దేశాభిమానము, ప్రత్యేకరాష్ట్ర వాంఛ రేకెత్తించింది. ఆ నాడు ఆకాంక్షించిన ఆంధ్రరాష్ట్రం ఇప్పటివరకు రాజకీయ నాయకుల మాయావాగురలలో చిక్కి అనేక విధాలుగా సతమతమౌతూనే ఉన్నది. కాని ఆనాడు ఆంధ్రులలో విజృంభించిన ఆ వాంఛావేశము వీరి కవితలో మాత్రం ఒక వెల్లువగా ఉప్పొంగింది. కేవల తాత్కాలిక రాజకీయ సమస్యలు కావ్యవస్తువులైన ఉత్తమ కావ్యాలు ఏ వాఙ్మయంలోనైనా చాలా విరళంగా ఉంటాయి. రాజకీయ సమస్యలపైన రచించిన కావ్యాలు సామాన్యంగా తాత్కాలికమైన ఆనాటి ఉద్రేకాలకు పట్టుగొమ్మలై, ఆ ఉద్రేకాలు సమసిపోగానే అవికూడా విస్మృతిపథంలో పడి మాసిపోతూంటాయి. కాని రాయప్రోలుకవి ఆంధ్రావళిలోని ఖండకావ్యాలు మిగిలిన కావ్యాలంతటి ఉదాత్త రచనలు కాకపోవచ్చును గాని ఇవి ఎప్పుడు చదివినా ఆంధ్రజాతికి ఉత్సాహావేశం కలిగించేవే. ఈ ఆంధ్రావళిలో ప్రాచీనాంధ్రుల వైభవమే గాక, ప్రాచీనాంధ్రకవులు, కృష్ణరాయ నాగేశ్వరులు, రవీంద్రకవి మొదలయిన వారిని గురించిన చక్కని ప్రశస్తి రచనలున్నాయి. ఆనాడు రచించిన ఆంధ్రావళిలో ఈ క్రింది సీసము నేటికికూడా అక్షరాలా మనవారి కన్వయిస్తూనే ఉంది.

"పెనుజపిల్ విరబోసికొని తాండవంబాడు
ఈర్ష్యా పిశాచి నట్టింటిలోన
సవతిబిడ్డ విధాన నవయు దల్లి తెనుంగు
విశ్వవిద్యాలయ వీథులందు
దోషశల్యమ్ములే తోచు నుత్సాహసం
పన్నవ్యసాహిత్యపాలనమున
పిన్నలూర్ధ్వముఖంబు పెద్దలధోదృష్టి
ఉభయ భాగ్యోపాస్తి నుత్తిమాపు
ఈ యభావ వేదాంతి మే మీయగలదు
చావుబ్రదుకులు తేలు నీ సంధియందు
నాదుజాతి, నాదేశము, నాదుభాష
అను అహంకార దర్శనమందు మాంధ్ర!"

పెద్దనకవిమీద, నాగేశ్వరునిమీద రచించిన ఈ రెండు రచనలు చిరస్మరణీయములు.

"మొగ్గలు నవ్వుపువ్వులగు పొల్కి
ప్రబంధకవాట పంక్తులన్
నిగ్గు తెనుంగు తోరణల
నిండుకళల్ వయసార, రంగులన్
మ్రగ్గిన చిత్రసౌధము,
రాగములన్ రవళించు హాయియున్
బిగ్గ గవుంగలింపదొకొ
పెద్దనభవ్యశిరీష భారతిన్."

"అర్థిక ప్రణాళికను, పరమార్థతత్త్వ
మాలికను గూడ నేక ప్రమాణదృష్టి
నారయుచు భక్తపరిభాష ననువదించు
శ్రద్ధ తొలక నాగేశ్వరరాయ కలము."

## తెనుగుతోట

'ఆంధ్రావళి'లో ఉత్సాహావేశంతో ఉబికి వచ్చిన జాతీయావేశం తెనుగుతోటలో సుకుమార వ్యంగ్యయవనికలోనే నిలిచి తీయని తెనుగునుడికారంతో అంతకంటె ఉదాత్త కవితగా మెరిసింది. తెనుగుతోటలోని ఈ క్రింది భాగాన్ని బట్టి ఈ కవితలోతు గ్రహింపవచ్చును.

"గౌతమీసాంద్ర వీచికాజాత పూత
వాతపోత శీతల సనుపాంతమందు
తరుణవంశ జాతముల సుస్వరములెన్నొ
నవ్యయుగ నుదయించుచున్నది కుమారి!
కృష్ణవేణీ సరిత్కూలరేఖలందు
ప్రొద్దుతిరుగుడు పూవులభిముఖములయ్యె.
స్నానములుసేసి ప్రణయ దుగ్ధములు త్రావి
పూలతోరమ్ములు ధరించి పూర్ణభక్తి
బూజ కరిగిరి బుషికుల పుత్రులెల్ల.
రంగలీను హారతిపళ్లెరమ్మునందు
పూలు తాంబూలములు నుంచి పోవుచుండి
రకలుష విముగ్ధలగు కుమారికలు తల్లి!
లేచి రావమ్మ! మా తల్లి లేచిరమ్మ!"

## కథాకావ్యాలు

ఆంధ్రావళిలోను జడకుచ్చులలోను సుబ్బారావుగారు రచించిన ఖండకథాకావ్యాలెన్నో ఉన్నాయి. ఇవిగాక 'స్నేహలతాదేవి' 'కష్టకమల' ప్రత్యేకంగా పేర్కొనదగిన కథాకావ్యాలు. స్నేహలతాదేవిలో వరశుల్కం సమర్పించలేని తండ్రి దైన్యం సహించలేక కుమార్తె అగ్నిజ్వాలలో పడి మరణిస్తుంది. కష్టకమలలో కథావస్తువుకూడా ఇలాంటి కరుణోదంతమే.

ఈ కథాకావ్యాలలో కథకదృష్టి చాలా తక్కువ. వీరీ ఇతివృత్తాలన్నీ వర్ణనాపరమైన కావ్యాలుగా పలయించారు గాని చక్కని కథాకావ్యాలుగా మలచలేదు. స్నేహలతాదేవిలో కథ బింకంగా అల్లేఅవకాశాలున్నాయి. కాని ఈ దృష్టితో ఈ కావ్యం చదివితే మనం చాలా నిరు

త్సాహపడి పోతాము. స్నేహలతాదేవి అగ్గిలోపడి మ్రగ్గిపోతున్న ఆఘట్టానికి వీరు వరసగా పది గీతికలు వ్రాశారు. కేవల వర్ణనదృష్టితో చూస్తే నే మనకీ గీతికలు ఉత్తమ కవితగా స్ఫురిస్తాయి.

"నవ్వుమోములనిండు మనసులతోడ
నొండొరుల కౌగిలింతల నోలలాడు
తండ్రి బిడ్డల పగిదిని తనిసిరపుడు
ఒదిగి స్నేహలతాపితృహోత్రులవుర!
పెంపుపగడాలరాశిలో బడి భ్రమించు
నిండుజాబిల్లి రేకను నిర్మలముగ
జూడ వలపించె భావవిశుద్ధవీధి
దహనులోనున్న స్నేహలతామతల్లి.
లిఖిత కుంకుమ రంగవల్లికలనడుమ
తీర్చినట్టి కర్పూరలతికవిధాన
జూడ వలపించె భావవిశుద్ధవీధి
దహనులోనున్న స్నేహలతామతల్లి."

## ఖండకృతులు

దీర్ఘ కావ్యాలేగాక వీరు అప్పుడప్పుడు రచించిన ఖండకావ్యాలెన్నో ఉన్నాయి. ఇవన్నీ చాలావరకు జపకుచ్చులలోను, వనమాలలోను కనిపిస్తాయి. వీనిలోని కొన్ని గేయాలు, కొన్ని కొత్త కొత్త ఛందస్సులలో రచించిన గీతాలు. కాళిదాస మహాకవి కుమారసంభవంలో రతీవిలాప ఘట్టంలో వాడిన వియోగినీవృత్తం తీసుకొని వీరది చక్కని గేయఛందస్సుగా మలిచారు. సంస్కృత వృత్తాలు తెలుగునుడికారానికి అనుగుణంగా మలచడం చాలాకష్టం. ఇవిగాక వీరు మాంచాల, ఉగాదిపదము మొదలైన శీర్షికలతో గేయాలెన్నో రచించి ఆయా ఛందస్సులమీదసంపూర్ణాధికారం స్థాపించుకున్నారు. వియోగినీ వృత్తం తెలుగులో మలిచిన వీరి ఛందోనైపుణికి 'పదవేచెలి' అనే గీతికలోని ఈక్రింది భాగం చాలుననుకుంటాను.

"పదవేచెలి! కాళ్లగజ్జియల్
రవళింపంగ పొదుళ్ళపల్లికిన్
తొలిప్రొద్దుల చల్దియన్నముల్
తిని ద్రిమ్మరవచ్చు స్వేచ్ఛగా
మధుమాసపుకన్నెయొంపులో
ఎలకొబ్బరితోట నీడలన్
పసుపాడిన నిమ్మచెంగటన్
వయసారిన మావిపొత్తునన్
ఎలకోయిల యీల నేర్పగా
చెయిచేయి బిగించి యింపుగా
విహరింతము తోడుతోడుగా!"

— ఇంకా 'ఈ గీతము' మొదలైన ఖండకృతులలో కవిత, గేయరచనా నైపుణి చేయిచేయికలిపి నృత్యం చేసినట్లు భాసిస్తాయి. వీరు రచించిన గేయాలన్నిటిలోను 'అడివోరి చిన్నోడ!' అనే శీర్షికతో రచించిన అభినందన గేయం ఉదాత్తమైన రచన. గేయ ఫణితి, కవిత కలిసి తూగుటుయ్యాల ఊగిన ఈ గేయం వీరి గేయచ్ఛందో రచనా నైపుణికీ, సౌహార్దం ఉత్తమకవితగా పలికించిన భావుకతకు తార్కాణం.

"అడివోరి చిన్నోడ! అమృతధారలవాడ!
అభినందనములివే అందుకో చెలికాడ!
గీతవంపులలోన పూతసొంపులలోన
కెరలింతు వందాలు గీర్వాణములు సాగ!
పాటఘణుతులలోన, పద్యపంక్తులలోన
పలుకులే పూచేను! పచ్చి పువ్వులవోలె!
కథల జడల్లితే కంప్లెగట్టినయట్లు
కళగట్టుమనలోక గాథారహస్యాలు.
నుడువులో, అవి తేనెనుడువులో, రతనాల
కడవలో, రాగాల పడవలోకనరావు!
నీభావశాఖలన్ వీచుకమ్మదనాలు
నీచేతి రేఖలన్ పూచు వన్నెలచాలు
నింగినీలము తేరి, నేల పచ్చలు కూర్చి
నిలిచేను నీచిత్ర నిర్మలాంబరమందు!
ఎడదతాండవమాడు ఉసుకు వేదన లెంచి
పసుముజంటల ప్రేమబంధాలు భావించి
శిలగాదు, కలగాదు జీవితం ఓదివ్య
లలితయాత్రావర్త లక్షణంబన్నావు
తొలి సంజరాగాల కులికేటి లాస్యంబు
మలిసంజరంగులో మసలేటి తాండవము
పలుకులోపల బొమ్మ తళుకులోపల జూపె
వెలుగునీడలపొత్తె విశ్వముగ నన్నావు.
రూపుకోవలనున్న రుచిమన్మధురశోభ
చూపుకోవలనున్న శుచిమన్మహితరేఖ
నిత్యనిర్మలమైన నిరవధిక సౌందర్య
వలయమే ఆనందనిలయమన్నావు.
మాయమ్మ గౌతమీ తీరచాయలో నిను గాంచె
ఏ యోషధులపాలపాయసంబిడి పెంచె
లేకున్న నీశిల్పలీలాభిరుచిరాదు
కాకున్న నీ స్వాదుకంఠ మబ్బగబోదు!
మిథునపద్మాలతో మెరయు ప్రేమసరస్సు
మేరుశేఖరముగా మేలకింపగదోయి!
నీవన్నెకుంచెకున్ నిత్యకళ్యాణమూ
నీకళోపాసనకు నిత్యమంగళమౌను!
అడివోరి చిన్నోడ! అమృతధారలవాడ!
అభినందనములివే! అందుకో చెలికాడ!"

—వనమాల.

## ఆంధ్రీకృతులు

రాయప్రోలువారివి రెండు మూడు ఆంధ్రీకృతులుగూడా ఉన్నాయి. వీటిలో ముఖ్యంగా పేర్కొనవలసినది ఉమరు ఖయ్యాముకృతికి అనుకృతి అయిన మధుకలశము.

ఉమరు ఖయ్యాము కృతికి తెలుగులో అనువాదాలయిదారుదాకా ఉన్నాయి గాని ఈ అన్నింటిలో ఉత్తమోత్తమమైనది దువ్వూరి రామిరెడ్డిగారి పానశాల. దువ్వూరివారి పానశాలతో తులతూగగల ఉదాత్తరచనమధుకలశం ఒక్కటే. ఫిట్జ్ గెరాల్డ్ ఆంగ్లంలో రచించినది పెర్షియన్ కృతికి అనుకరణమే గాని ఆ కృతికి ఆంగ్లభాషలో స్వతంత్ర కావ్య గౌరవం దక్కిందని విమర్శకులంటారు. మనకు తెలుగులో వచ్చిన ఉమరు ఖయ్యాము అనుకృతులలో ఈ రెండిటికి ఈ విధమైన స్వతంత్ర కావ్య గౌరవమే దక్కింది. అయితే రామిరెడ్డి, రాయప్రోలు స్వతంత్ర ప్రతిభాసంపన్నులు కనక తమ కృతులపై ప్రత్యేక ముద్రలు వేసుకుంటూ ఆంధ్రీవాఙ్మయంలో వాటికి ఉత్తమ కవితా గౌరవం కలిగించారు.

సుబ్బారావుగారు శంకర భగవత్పాదులు రచించారని పేరు కెక్కిన సౌందర్యలహరికికూడా ఆంధ్రీకరించారు. ఈ ఆంధ్రీకృతి పూర్తిగాలేదు. అన్నీ కలిసి పాతికముప్ఫయి పద్యాలకన్న ఎక్కువ లేవు. మూలంలో సంస్కృత కవితాశైలి గంభీరపదవిన్యాసాలతో పరవళ్లు తొక్కుతూ ఉంటుంది. రాయప్రోలువారి సౌందర్యలహరిలో ఆ గాంభీర్యం రాలేదు గాని మూలంలో లేని సొగసు, ఒయ్యారము దీనిలో ప్రవేశించాయి. ఈ క్రిందివృత్తం వీరి ఆంధ్రీకృతికి ఉదాహరణగా స్వీకరించవచ్చును.

"నరం వర్షీయాంసం
    నయనవిరసం నర్మసుజడం
తవాపాంగాలోకే పతిత
    మనుధావంతి శతశః
గళద్వేణీబంధాః కుచకలశ
    విస్రస్తసిచయాః
హఠాత్త్రుట్యత్కాంచ్యో
    విగళితదుకూలాయువతయః.

ఇది సంస్కృత సౌందర్యలహరి శ్లోకం. దీనికి రాయప్రోలువారి ఆంధ్రీకృతిఇది :—

"ముదియైనన్ వది గ్రుడ్డియైన,
    నగరాట్పుత్రీ! స్మరోత్తంత్రసం
పదపేలుండయినన్ త్వదీయ
    కరుణామత్తారుణాలోకనా
భ్యుదయున్ వీడక వెంబడించెదరు
    కొప్పుల్ వీడ పాలిండ్లప
య్యెద లూడన్ మొలనూళ్లు కోకముకు
    ట్టికై విడం జవ్వనుల్"

## కవితాస్వభావము

రాయప్రోలువారి కథా కావ్యాలలో కథనశక్తి చాలా తక్కువ అని అనుకున్నాము. కథాకావ్యాలలోనే గాక మిగిలిన కావ్యాలలోకూడా కథాశరీరం చాలా తక్కువ. అదైనా శక్తివంతంగా రాక పోవడంవల్ల వీరి కవిత ఆయా పట్టులలో పాఠకులకు చాలావరకు భావాస్వాదము, రసాస్వాదము మాత్రమే కలిగించగలదు.

స్వప్నకుమారం తీసుకుందాము. దీనిలో సహజంగా కవే ఉద్దేశించిన నిగూఢత ఉన్నది. అయితే "దోసిట మల్లెమొగ్గల నధోముఖియై కొని తెచ్చిన" ఆ బాల ఎవరు ? అని సామాన్య పాఠకుల కెవరికైనా సందేహం కలిగితీరుతుంది. కవి ఎక్కడా ఆమెను గురించి చెప్పక పోవడం వల్ల ఈమె సాంకేతికార్థం విషయంలో పాఠకులకు సందేహం కలుగుతుంది. ఇలా సందేహం కలిగినప్పుడు ఈ కావ్యం పాఠకులకు అర్థంకాకపోతే వారినిగాని, కవినిగాని నిందించడంవల్ల ప్రయోజనం లేదనుకుంటాను.

నేటికాలపు కవుల కవితావస్తువులో మన భారతకవితా వస్తువులో ఉన్నంత విశ్వజనీన వైశాల్యం కాని, అథమం పెద్దనాదుల ప్రబంధవస్తువులోనైనా కనిపించే సర్వజనీనత గాని లేదు. ఆపైన కవికొంత సంకేతభాష వాడినప్పుడది సహృదయుల కందడం మరింత క్లిష్టమైపోతున్నది. ఉదాహరణకు శ్రీ సుబ్బారావుగారు రచించిన 'ఆత్మకీలకము' అనే ఖండకావ్యం తీసుకుందాము. ఇందులో ఓంప్రథమంగాకవి ఇలా గంటున్నాడు.

"ఎన్నాళ్ళకొచ్చావె చిన్నారి చిలక !
కన్నారి చూచినట్లున్నదే చిలక
దానిమ్మగొని నిన్ను తిలపోస్తి చిలక
లేనిమ్మదరి కేగ లేకొస్తి చిలక !
బింబాల చూచి కంపించావె చిలక
తాంబూరశ్రుతి కంతో దడిశావె చిలక
వంశికీర్తనవిని వణికావె చిలక
మదిలోని రొదలకే అదిరావె చిలక !"

ఈ కావ్యం ఇలాగ చివరదాకా చదువుకు పోయినా 'ఆత్మకీలకము' అనే శీర్షికకు, ఈ కావ్యానికిగల సంబంధం విషయంలో పాఠకులకు కొంతమందికి సందేహము కలుగుతూనే ఉండవచ్చును.

ఈ విధంగా పరిమితమైన సహృదయ వర్గానికి అర్థంకావడమనేది నేటి మన అధునాతన కవిత్వానికే గాక ఆంగ్లాదిభాషలలోని అధునాతన కవితలో

కూడా ఉన్నదనీ, ఇది ఈ కవితకు సహజమైన స్వభావమనీ సుప్రసిద్ధ విమర్శకులనేకులు భావిస్తున్నారు. రాయప్రోలువారి కవితలో కూడా అక్కడక్కడ ఇటువంటి అస్పష్టత, దుర్గ్రాహ్యత ఉంటే ఉండవచ్చును గాని అది కొంతమనస్కులైన సహృదయులకు కూడా అసాధ్యమైన అస్పష్టత కాదు.

నేటి తెలుగుకవులందరిలోను ఒక్కొక్కరిలో ఒక్కొక్క విధమైన సాంకేతిక శబ్దప్రయోగం కనిపిస్తుంది. అది వారివారి కవితా ధోరణికి సహజమైన సాంకేతికశబ్దజాలము. ఈ సాంకేతికశబ్దజాలం కొంత ఒరిమితో అధిగమిస్తేనేగాని వీరి కవిత మనకర్థంకాదు.

రాయప్రోలు సుబ్బారావుగారి కవితలో అక్కడక్కడ 'త్రయస్కోటి' వంటి వ్యాకరణానికి లొంగని ప్రయోగాలు కనిపిస్తున్నాయి. అయితే వీటి విమర్శ 'నీపీ మోక్షణవేళలో వస్త్రమూల్యం కక్కే' పద్ధతికి దిగజారగలదనే భయంతోనే వానిలోకి పోవడం లేదు. తమ కవితలో శల్యాన్వేషణకు అవకాశం లేదని సుబ్బారావుగారే ఒకచోట వ్రాశారు. ఇలాంటి శల్యాన్వేషణ కవితాశల్యసాగన్యం చేసే విమర్శకులు చేసే పని. అది వారికే విడిచి పెడుతున్నాను. ఒకవేళ ఇల్లాంటి శల్యాలున్నాయనుకున్నా అసమగ్రమైన మన తెలుగు వ్యాకరణాల ప్రకారం అవి ఎంతవరకు అపశబ్దాలో నిర్ణయించడము కష్టమే. కేవలం పదదోషాలే వెదకడం ప్రారంభిస్తే అనిగ్రమైన అపనిందకు తాళుకోగల కవులు మన నవ్యులలో దొరకనేరకరనడం సాహసం కాజాలదు!

ఏ వాఙ్మయంలోనైనా వచనానికంటె కవితకెక్కువ సుముఖ దృష్టికావాలి. తత్రాపి నేటి కాలపు కవితకది మరింతఅవసరమేమోనని తోస్తుంది. ఇది లేనినాడు కవితకొక నమస్కారం పెట్టి దూరంగా నిలబడడమే ఉత్తమం! ఇంతమించుగా ఇదే అభిప్రాయంగల శ్రీ సుబ్బారావుగారి గీతాలు రెండిక్కడ ఉదాహరించి ఈ వ్యాసం ముగిస్తాను.

"ఇది శ్మశానము కాదుసూ! ఎండిపోయి
నేలపాలయినట్టి శల్యాలు దొరుక,
వానికీ సువర్ణద్వారబంధమందు
తావులేదు శోభన పదార్థములె కలవు!
పచ్చిపాడియావువంటిది కావ్యంబు
లేగ కుడిపి చేపురాగ గువ్వ,
పిసుక నమృతమిచ్చు, పొదుగుగ్రుద్దితి వేని
కాలు విసరు, జున్ను పాలు దావు!"

—వనమాల.

# గ్రంథవిమర్శనము

## త్రిలింగ లక్షణశేషము

అను ప్రౌఢ వ్యాకరణము. వ్యాఖ్యాత: ఉభయ భాషాప్రవీణ, సాహిత్య విద్యా ప్రవీణ, బులుసు వేంకటరమణయ్య, వావిళ్ళ రామస్వామి శాస్త్రులు అండ్ సన్స్‌వారిచే ప్రకటితము. వెల మూడు రూపాయలు.

ప్రౌఢ వ్యాకరణం బాలవ్యాకరణానికి పరిశిష్ట గ్రంథము. బాలవ్యాకరణకర్త చెప్పకుండా విడిచి వేసిన కవిప్రయోగాల కన్నిటికీ ప్రౌఢవ్యాకృతి కర్త గతి కల్పించాడు.

అయితే బాలప్రౌఢ వ్యాకరణకర్తలిద్దరూ కూడా సమగ్రంగా ప్రయోగ పరిశీలన చేసినవారు కారు. ప్రౌఢ వ్యాకరణకర్త సాధించకుండా విడిచివేసిన ప్రయోగాలింకా కోకొల్లలుగా ఉన్నాయని ఇటీవల జరిగిన భాషాపరిశోధనలవల్ల స్పష్టపడింది. అయితే మనకింతవరకు వచ్చిన వ్యాకరణాలలో ప్రౌఢవ్యాకరణం పండితుల మన్ననలందుకొని ప్రామాణికత గడించుకొన్నది. క్రమంగా ఇది విశ్వవిద్యాలయోన్నత, పరీక్షలకు పాఠ్యగ్రంథమై విద్యార్థులకు భాషాభిమానులకు అవశ్యపఠనీయమైన వ్యాకరణ గ్రంథంగా మారింది. సంస్కృత వ్యాకరణ సంప్రదాయాలతో జటిలమైన ఈ గ్రంథం సవ్యాఖ్యానంగా ప్రకటించవలసిన అవసరం ఎంతైనా ఉన్నది.

శ్రీ వెంకటరమణయ్యగారీ గ్రంథంలో సూత్రాలకు ప్రతిపదార్థం వ్రాసి లక్ష్యలక్షణసమన్వయం చేసి విశదంగా వివరణలు వ్రాశారు. వీరిది విద్యార్థులకందరికీ సులభగ్రాహ్యమైన వ్యాఖ్యాన పద్ధతి.

అయితే వీరి వ్యాఖ్యానపద్ధతిలో ఉన్న పాఠాంతర పరిష్కారాలలో ఒక విశేషం ఉన్నది. ఈ పరిష్కారాలలో వీరు కొన్ని కొత్త పాఠాంతరాలు పేర్కొని వాటిమూలాన ప్రౌఢవ్యాకరణంలో కొన్ని కొన్ని సూత్రాలు రచించడం అవసరమే లేదని తోసివేశారు.

"మధ్యమ పురుష ముపర్ణంబున కచ్చు పరంబగునపుడు గొన్ని యెడల లోపంబు మాపట్టెడి" అనే సూత్రం వ్యాఖ్యానిస్తూ వ్యాఖ్యాతలు మూలకర్త ఇచ్చిన 'అడిదె నీకు పందెము' అన్న ఉదాహరణానికి 'అడితె నీదు పందెము' అనే పాఠాంతరం ఉన్నదనీ, అల్లాగే మిగిలిన ఉదాహరణాలకు కూడా పాఠాంతరాలు ఉన్నాయనీ అందుచేత ఈ సూత్ర రచన అనావశ్యకమనీ వ్రాశారు. మరికొన్ని సూత్రాల వ్యాఖ్యానంలోకూడా వీరిల్లాగే పాఠాంతరాలున్నాయనే కారణంచేత ఆయా సూత్రాలు అనావశ్యకములని వ్రాశారు.

అయితే మన గ్రంథసంస్కర్తలు కొందరు బాలవ్యాకరణ ప్రౌఢవ్యాకరణాలు చూసి ప్రాచీన కావ్యాల పాఠాలు దిద్దివేసిన ఘట్టాలెన్నో ఉన్నాయి. వ్యాఖ్యాతలిచ్చిన పాఠాంతరాలు కూడా అల్లాంటి దిద్దుబాట్లేమో తెలియదు. గ్రంథాంతంలో మాత్రం పాఠాంతరాలన్నీ తరుచు ముద్రితప్రతులలోనించే సేకరించామని వ్రాశారు. అయినా ఈ గ్రంథాల పాఠాలు ఎంతవరకు ప్రామాణికాలో తెలియదు. అది తేలేవరకు వీరీ విషయంలో వ్రాసిన వ్యాఖ్యానంకూడా అప్రామాణికమే అయిపోతుంది.

సూత్రానుక్రమణిక మొదలయిన ఉపయుక్త విషయాలతో చక్కగా ముద్రించిన ఈ గ్రంథం ఆంధ్రవ్యాకరణాధ్యేతలకు అత్యావశ్యకమైనది.

---

## దక్షిణపవనం

[స్టాలిన్ ప్రైజు నవల.]

రచన ఎల్మర్ గ్రీన్. అనువాదం మహీధర జగన్మోహనరావు, విశ్వసాహిత్యమాల రాజమహేంద్రవరం, వెల. రూ. 4-8-0.

ఈ నవల ఫిన్లండుదేశం జీవితానికి సంబంధించింది. దీనిలో కథ సామాన్యంగా స్టాలిను ప్రైజు నవలలన్నింటిలోను నడిచే కథల వరవడిలోనే నడిచిపోతుంది. ఫిన్లండులో ఒక భూస్వామి ఉంటాడు. అతని పొలంలో ఐవారీ అనే పాలేరున్నాడు. ఆ పాలేరు తమ్ముడు విప్లవవాది. ఇతగాడు కథ ముగిసేసరికి భూస్వామి కుమార్తెను పెళ్లి చేసుకుంటాడు. రష్యాకీ ఫిన్లెండుకీ జరిగిన పోరాటంలో చిట్ట చివరికి రెండుదేశాలకీ మధ్యన సంధిజరుగుతుంది. ఫిన్లెండులో ప్రజలంతా భూస్వాముల చీకటి చెరనించి విముక్తులౌతారు. ఈ పోరాటంలో ఆ పాలేరు, అతనితమ్ముడు అగ్రగాములై నిలబడతారు. [illegible] నించి వీచిన దక్షిణపవనంవల్ల ఫిన్లండు [illegible] ఆనంద

[illegible]

పరిమళ భరితమ కలకల [illegible] ఇదీ ఈ నవల [illegible]

ఈ రహస్యాని [illegible] మే మరి ప్రపం [illegible] అన్ని [illegible] అర్థమైనదే అని పిస్తే [illegible]చవచ్చును కాని కొంచెం నిశితంగా వాఙ్మ[illegible] పరిశీలనచేసేవారి కిదేమి అంత గొప్ప నవలలా [illegible]బడదు. మొత్తంమీద ఈ నవల ఎలాగో అలాగ [illegible] మూలనించి ఈ మూలదాకా చదివించి వేస్తుం[illegible] ఇందులోవచ్చే పాత్రలన్నీ కేవలం కొన ఊపిరి[illegible] కొయ్యబొమ్మల్లా కదిలిపోతూ నవలా కారుని [illegible]యచ్ఛాయల్లో అణిగిమణిగి ఉంటాయి. అయితే [illegible]అంతా మూలానికి సంబంధించిన విషయం.

అను[illegible]దకారు లనువదించడంలో బాగా జాగ్రత్త తీసుకు[illegible]. పుటల అడుగున రహస్యకు సంబంధించిన [illegible] కొన్ని పదాల వివరణలు అవీ వ్రాసి పాఠకుల[illegible] నవల బాగాసుగమ మయ్యేటట్టు చేశారు. అను[illegible] సకృత్తుగా ముద్రాక్షరపు దోషాలున్నా మొత్తంమీద నవలఅంతా హాయిగా [సాఫీగా నడిచి పోతుం[illegible]

[illegible] అట్ట బైండుతో పుస్తక ముద్రణాదికం ప్రశస్తం[illegible] ఉన్నది.

---

వేణువు:

[illegible]గి శ్రీరామ అప్పారావు ఎమ్,ఏ. ప్రకాశకులు. [illegible]షల్లి అండ్ కో. సరస్వతీ పవర్ ప్రెస్. రాజమ[illegible]ద్రవరము. వెల రూ. 1-8-0.

గద్యంలో కావ్యరచన పా[illegible] వాఙ్మయాల్లో బాగా ప్రసిద్ధికెక్కింది. ఇటీవల తెనుగులో కూడా [illegible] కవిత్వం ప్రారంభించినవారిద్దరు ముగ్గురున్నా[illegible]

[illegible]మ అప్పారావుగారి రచనలన్నీ గ్రాంథికంలో [illegible]దించారు. ఈ రచనలలో [illegible] చక్కని[illegible]యితీ[illegible] మార్దవము [illegible] తొణికిసలాడు తున్నా[illegible] వీరి గ్రాంథికం చిక్కని జాతీయతతో జాలువా[illegible] పాఠకులకు చవులూరిస్తున్నది. ఈ గద్యకవి[illegible]గ్రంథం ప్రకటించిన ప్రకాశకు లభినంద్య నీయులు[illegible]

ఖండకృతి.

జాస్తి వేంకటనరసయ్య, చిలకలూరిపేట, గుంటూరు. జిల్లా వెల 8 అణాలు.

ఇది రచయిత అప్పుడప్పుడు వ్రాసిన ఖండ కావ్యాల సంపుటి. వీటిలో వాడినవన్నీ సాంప్రదాయిక ఛ్ఛందస్సులే. ఈ రచనలలో భాషాసౌష్ఠవము, తెలుగునుడికారము మొదలైనవి వీరి భాషాసంప్రదాయాభిజ్ఞతకు తార్కాణాలు. వృత్తాలు మొదలైన వాటి నడక కుంటుపడకుండా సుఖంగా సాగిపోతున్నది. పుస్తక ప్రాశస్త్యాన్ని గురించి వ్రాసిన ఈ క్రింది వృత్తాన్నిబట్టి వీరి రచనా సౌష్ఠవం గ్రహించవచ్చును.

"సారాసార వివేకమున్ దెలుపు
సచ్చారిత్ర సంయుక్తుడున్
పారావారగభీర చిత్తుడగుచున్
భాసిల్లు సన్మిత్రమున్
మీరున్ ధర్మము నొక్కకప్పుడిక
నీ మిత్రత్వ మెల్లప్పుడున్
గారుణ్యంబు నుదారవృత్తి గరపున్
గళ్యాణ మార్గస్థులన్.

---

గ్రంథస్వీకృతి.

అధ్యాత్మోపనిషత్తు. ఆంధ్రపద్యానువాద వివరణ సహితము. ఆంధ్రకృతికర్త పంతుల లక్ష్మీనారాయణశాస్త్రి, మహారాజా సంస్కృతకళాశాల, విజయనగరము. వెల ఒకరూపాయి.

అధ్యాత్మోపనిషత్తు అష్టోత్తర శతోపనిషత్తులలో చేరిన గ్రంథము. శ్రీ శాస్త్రిగారు ఈ ఉపనిషత్తు సరళమైన కందపద్యాలలోకి అనువదించి ఆ పద్యాలకు విపుల వివరణలు వ్రాశారు. ఈ పుస్తకం ఆంధ్రంలో అధ్యాత్మోపనిషత్తు పఠింపదలిచినవారి కందరికి బాగా ఉపయోగిస్తుంది.

పాహిమాం శతకము

ఆత్మకూరి గోవిందాచార్యులు. చిరునామా లేదు. వెల దైవభక్తి అని ఉన్నది దీనికి విశ్వనాథ సత్యనారాయణగారు పీఠిక వ్రాశారు. ఇందులో పద్యాలన్నీ చాలా వరకు గీతాలే. అక్కడక్కడ కొన్ని గీతాలు రచయిత భక్తిభావం స్ఫురింప జేస్తున్నాయి.

---

[illegible]blished by S. Sambhu Prasad at the Andhra Patrika Press
No. [illegible] Chetty Street, Madras. Editor — S. Sambhu Prasad.

సిద్ధముగా నున్నది. త్వరపడుడు!

**'ALICE IN WONDERLAND'** రచన : లూయీ కెరోల్



# అల్లిబిల్లిలోకంలో అమ్మాయి కథ

ఆంధ్ర గ్రంథ మాల

మద్రాసు 1.




శోభనాచల వారి,

# ప్రజాసేవ

డైరెక్టర్.....ప్రభాకరావు..